1

RMR01A141

శ్రీః

# శంకర గ్రంథ రత్నావళి

## అమరుక శతకము

షోడశ సంపుటము

మూలమ్

అమరుక ప్రభువు

శ్రీ శంకర భగవత్పాదులు

మనసిజ వ్యాఖ్యానము

వ్యాఖ్యాత

దోర్బల విశ్వనాథ శర్మ



ప్రకాశకులు

సాధన గ్రంథ మండలి, తెనాలి

R. Mohana Rao, M.Sc.,
H.No.: 4-103
I.L.T.D. Colony (Extn.)
Kotha pet, CHIRALA - 523 157
© 08594 - 34054

First Edition : 24th November 1996

Price : Rs.25/-



CIP - DATA :24th November 1996
AMARUKA SATAKAM - AMARUKA PRABHUVU
Commentator - Dorbala Viswanadha Sarma
DDC 19th Edition : 181.482
Pages : VI + 146

R. Mohana Rao has been assisted by V. Dasaradhi in the proof reading of the Commentary for the AMARUKA SATAKAM.

D.T.P. by
*MR LASER PRINTS,*
CHIRALA - 523 155.

This book is published with the financial assistence of Ravi Umamaheswara Rao of Vatticherukuru of Guntur (Dt)

# మండలి మాట

1945వ సంవత్సరములో తెనాలిలో నాటిన 'సాధన గ్రంథ మండలి' అనే మొక్క - శ్రీయుతులు వేలూరి, ఈశ్వర, కుందుర్తి, జనస్వామి, తాడేపల్లి, పోతుకుచ్చి, బులుసు, దోర్బల వంటి మాననీయులతో శాఖోపశాఖలుగా విస్తరించి ఆంధ్రదేశమున వేళ్లానుకొని, దినదిన ప్రవర్థమానమై, భాసిల్లుతూ ఒక మహావృక్షంగా రూపొందినది. ఈ మహావృక్షానికి ఆంధ్ర దేశములోని ఎందరో వదాన్యులు దన్నుగావుండి పోషించారు/పోషిస్తున్నారు. సాధన గ్రంథ మండలి, గత 52 సం॥ లలో 250కి పైగా ఆధ్యాత్మిక గ్రంథాలను వెలువరించింది. జగద్గురు శ్రీ శంకర భగవత్పాదులవారి వాఙ్మయాన్ని తెలుగు అనువాదంతో సామాన్యులందరికి అందుబాటులోనికి తేవాలనే సత్సంకల్పముతో ఇప్పటికి 16 సంపుటాలు వెలువడ్డాయి. శ్రీ కామకోటి పీఠాధిపతులైన శ్రీశ్రీశ్రీ చంద్ర శేఖరేంద్ర సరస్వతీ స్వామివారు కాలినడకన దేశ పర్యటన గావించినప్పుడు - వారు అక్కడక్కడ చేసిన అనుగ్రహభాషణలు జగద్గురు బోధనలను పేర 10 సంపుటాలుగా వెలువడ్డాయి. నా సోదరుడు బ్రహ్మశ్రీ బులుసు సూర్యప్రకాశం - శంకరకింకరుడు అను నామముతో శ్రీ సదాశివ బ్రహ్మేంద్రుల వారి రచనలైన శివ మానసిక పూజాస్తుతి, ఆత్మవిద్యావిలాసం, అద్వైత తారావళి, అద్వైత కీర్తనలు మొదలైనవాటికి వ్యాఖ్యలు, శివతాండవ స్తోత్రం, మహిషాసురమర్దినీ స్తోత్రము, శివ పదమణిమాల లకు అర్థతాత్పర్యాలతో వెలువడ్డాయి. కుందుర్తి వారి శ్రీ చైతన్యచరితావళి అనేక సంపుటాలుగా వెలువడ్డాయి. శ్రీ దోర్బలవారు శ్రీమూక పంచశతిలోని శతకాలకు వ్యాఖ్యలను అందించగా - వాటిని వెలువరిస్తున్నది . త్వరలోనే ఆర్యా శతకము వెలువడుతుంది.

ఇవి మచ్చుకు కొన్ని మాత్రమే

మాననీయులు వేదమూర్తులైన శ్రీ దోర్బల విశ్వనాథ శర్మగారు అమరుక శతకానికి మనసిజ వ్యాఖ్యానమను పేర అర్థతాత్పర్య విపుల వివరణ అందించారు. ఈ శతకమీవిధముగా వెలువడుటకు వారు చేసిన కృషి ఎంతో శ్లాఘనీయము. ఎంతో శ్రమ కోర్చి ఆధ్యాత్మమిక గ్రంథాలకు వ్యాఖ్యానాలు అందిస్తూ సాధన గ్రంథ మండలికి అండదండగావున్న వీరికి ఆ శివాశివులు ఆయురారోగ్య ఐశ్వర్యములిచ్చి కాపాడుగాక.

లోకాస్సమస్తా స్సుఖినోభవన్తు.

తెనాలి. బులుసు సూర్యప్రకాశ శాస్త్రి
04-11-1996 సాధన గ్రంథ మండలి

# వ్యాఖ్యాత పరిచయము



పేరు : దోర్బల విశ్వనాథ శర్మ
జననీ జనకులు :
శ్రీమదనంతలక్ష్మీరత్నయ్యదీక్షితులు
స్వగ్రామము : రామాయం పేట, మెదక్ జిల్లా
విద్యార్హతలు : సాహిత్య విద్యా ప్రవీణ,,
యమ్.ఏ. (సంస్కృతాంధ్రాలలో), బి.యడ్.
చేసిన ఉద్యోగం: ప్రభుత్వ జూనియర్ కళాశాల ప్రధానాచార్యత్వము
ప్రస్తుత ప్రవృత్తి : భారతీయ సాహిత్య భక్తి వేదాంత, ప్రచార గ్రంథ రచనా కవితా రచనాదికము నందు

ముద్రిత గ్రంథములు : **1.** శ్రీ లాలిత్యము - శ్రీ లలితా రహస్యసహస్రనామములకు సంస్కృత శ్లోక సాహస్రి. **2.** దుర్గానామ సప్తశతీ స్తోత్రము. **3.** శ్రీ సూక్తాంధ్ర వివరణ. **4.** శ్రీ శివ విష్ణు గణేశ దేవీ మహిమ్న స్తోత్రములకు ఆంధ్రపద్యానువాదము. **5.** శ్రీ శివ సప్తతి-శ్రీ శంకరాచార్యులవారి శ్లోకములకు ఆంధ్ర పద్యానువాదము. **6.** శ్రుతి గీతలకు, ఆదిత్యహృదయమునకు ఆంధ్ర పద్యానువాదము. **7.** మూకపంచశతిలోని కటాక్ష, మందస్మిత శతకాలకు అర్థతాత్పర్య వివరణ. **8.** శివమీడే స్తవః- హర్షిణీ వ్యాఖ్యానం.

అముద్రిత గ్రంథములు: **1.** విష్ణు సహస్రనామ వైభవము. **2.** శ్రీమద్భగవద్గీత ఆంధ్రవివరణ. **3.** పురుష సూక్తాంధ్ర వివరణ. **4.** పరశంభు మహిమ్నస్తోత్రము ఆంధ్రానువాదము. **5.** త్రిమత సాంగోపాంగ సంధ్యోపాసనము.

పొందిన సన్మానాలు : **1.** నిజామాబాద్ జిల్లాస్థాయి ప్రభుత్వ సన్మానము **1966.** **2.** రాష్ట్రస్థాయి ఉత్తమోపాధ్యాయ ప్రభుత్వ సన్మానము **1982.**

విద్వత్ప్రశంసలు : **1.** వీరి రచనలన్నియు సలక్షణ ములు, రసవంతములును, సాహితీ విమర్శనాజ్ఞాన స్ఫోరకములును ప్రాచీన కవి ప్రయోగా రూఢములును, లలిత భావసమన్వితములై యలరారు చున్నవి. --పి.వి. సోమయాజులు, నిజామాబాద్.
**2.** అమ్మవారు నిలువెల్లా పులకరింపగా భక్తిమై వెదజల్లబడుచు మనోమతల్లులైనవి మీ చంపకోత్పలములు. --అష్టావధాని గుమ్మన్నగారి లక్ష్మీనరసింహ శర్మ, మెదక్.

***

## ముందు మాట

సాధన గ్రంథ మండలి, తెనాలి వారు శ్రీ శంకర గ్రంథ రత్నావళి అనుపేర శ్రీ శంకరుల పెక్కు గ్రంథములను ముద్రించి తదభిమానులకు అల్పమూల్యమునసే అందించినారు. కొన్ని గ్రంథములకు చక్కని అనువాదములను కూడ అందించినారు. ఇది వెల కట్టలేని పని.

తత్త్వశాస్త్రాకాశమున శ్రీ శంకరులెంత దుర్నిరీక్ష్య ప్రచండ మార్తాండులో అంత అమృతాంశువులు. గొప్ప గొప్ప పండితులకును ముక్కు దూర్చరానంత కఠినముగా ఆబాలగోపాలము ఆనందించునంత తేలికగా తత్త్వశాస్త్ర రహస్యములను అందించ గలిగిన కృతార్థులు. శాస్త్రరహస్యములనెన్ని అందించగలిగినారో అన్ని సాధనాను కూల విధానములను అందించగలిగినారు. వారి రచనలు చదువుచున్న పాఠకులకు దేశికుడు దగ్గఱ కూర్చొని అనుభూతులను వివరించునట్లుండును. ఏ గ్రంథమున, ఏ సందర్భమున, ఏ అనుభూతి అందుకొనవచ్చునో సాధకులకే అది హృదయంగమ మగును. పండితులకే ఆ బ్రహ్మవిద్వరిష్ఠుని బోధలు మనోగోచరములు కాగలవు. అందుకే శ్రీశంకరులు జగద్గురు పదవి నలంకరించినారు. శ్రీవారి గ్రంథములలో పారమార్థికమైన జీవ బ్రహ్మాద్వైతమును ప్రతిపాదించు గ్రంథములు తాత్త్వికుల కెట్లు అత్యంత ముపాదేయములో శ్రీవారి వ్యావహారిక శివ విష్ణు దేవీ పారమ్యమును బోధించు స్తోత్రగ్రంథములు భక్తుల కట్లుపాదేయములు. శ్రీవారి విష్ణుసహస్రనామ స్తోత్రభాష్యము వంటి కొన్నిగ్రంథము లాయిరువురకును ఉపాదేయములు. జీవ బ్రహ్మాద్వైతజ్ఞానమునకు వ్యావహారిక హరిహరాద్వైతజ్ఞానము పరంపరాసాధనము అని శ్రీ విష్ణుసహస్రనామస్తోత్రోపోద్ఘాత భాష్యమున వ్యంజింపబడినది. అందు సర్వదేవతాద్వైతమును ప్రతిపాదించుట వలనే హరిహరాద్వైతము పెక్కు శ్రుతి స్మృత్యాది ప్రమాణోపన్యాసములతో నిరూపింపబడినది. కావుననే అద్వైతులకు శివపారగమ్యమో విష్ణుపారగమ్యమో ఉన్నను విరోధము కాకపోయినను శివ విష్ణు భేదభావము వారిలో కొట్టవచ్చినట్లు కనబడును. శైవులలో వైష్ణవులలో కానవచ్చు విష్ణుద్వేషముగాని శివద్వేషముగాని స్మార్తులలో కానరాకపోవుటకు శ్రీ శంకరుల అనుగ్రహమే కారణము. పరమ విరక్తులు సర్వసంగపరిత్యాగులునైన శ్రీశంకరు సన్యాస జీవనము సర్వసన్యాసులకును ఆదర్శము. మచ్చునకైనను మచ్చకానరాదు.

శృంగార గ్రంథములలో అమరుక శతకమునకు మించిన శృంగార గ్రంథము కానరాదు. భర్తృహరి వ్రాసిన శృంగార శతకమందలి శృంగారమునకన్న అమరుక శతకములోని శృంగారము సహృదయుల కాస్వాద్యతరము. భర్తృహరి ప్రతిజ్ఞ యొకటి యున్నది. ఎంతటి విరాగియైనను నా శృంగార శతకము చదివెనేని శృంగారి యగును

అన్నదే ఆ ప్రతిజ్ఞ. ఆ ప్రతిజ్ఞ అమరుక శతక కర్త చెప్పినట్లు లేకున్నను అమరుక శతకము చదివినవారు విరాగులైనను శృంగారులుగా మారుట తప్పదు అన్నంత శృంగార మాశతకమున కుప్పలు కుప్పలుగా కూర్చబడియున్నది. శ్రీ శంకరులే అమరుకుని మృత శరీరమున ప్రవేశించి అమరుక స్థూలదేహోపాధికులై అమరుక శతకము రచించినట్లు అభిజ్ఞుల కథనమున్నది. అందుచేతనే శ్రీ శంకర గ్రంథ రత్నావళి లోని యొక రత్నముగా దీనిని పాఠకుల కందించగల్గుట ముదావహమైన విషయముగా భావించు చున్నాము.

—దోర్బల విశ్వనాథ శర్మ

## -ప్రస్తావన-

అమరుక కావ్యాన్ని గురించి నాతో ప్రస్తావించి, స్పందన కలిగించిన శ్రీమతి టి. అన్నపూర్ణగారు-గుంటూరు జిల్లాలో నరసరావు పేటకు పది కిలోమీటర్ల దూరంలోని కోటప్పకొండ వద్ద వున్న 'చిన్మయారణ్య' త్రికూటాశ్రమవాసిని.

మూకమహాకవి విరచితమైన మూకపంచశతిలోని శతకాలకు వ్యాఖ్యానాలను అందించిన / అందిస్తున్న - పూజ్యులు, వేదమూర్తులైన శ్రీ దోర్బల విశ్వనాథశర్మగారు ఈ అమరుక మహాకావ్యానికి 'మనసిజ' వ్యాఖ్యానాన్ని అడిగినదే తడవుగా అంద జేసినారు.

తెనుగునాట సాధన గ్రంథ మండలి - శ్రీ శంకర వాఙ్మయము - శ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రి గారు, ఈ మూడూ పర్యాయపదాలుగా భాసిల్లుటచేతనే వెలువడినదీ - అమరుక వ్యాఖ్యాన గ్రంథం.

పై ముచ్చురుకు నా నమస్సుమాంజలులు.

అమరుక అధ్యయనంతో వెలువడే అద్వైతపరిమళాన్ని ఆస్వాదించ వలసినదని ఆంధ్ర పాఠకులను అర్థిస్తున్నాను.

'మనసిజ' వ్యాఖ్యానంతో వెలువడిన ఈ అమరుక శతకమును శ్రీశ్రీశ్రీ చిదానంద భారతీ స్వామివారి (శ్రీ దోర్బల విశ్వనాథ శర్మగారి పూర్వాశ్రమ జనకులు) పాదపద్మములకు సమర్పితము.

ఓం శ్రీ త్రికూటేశ్వరాయ నమః

—మోహన రావు

1

శ్రీః

# అమరుక శతకము

శృంగారము రసరాజము. శృంగ శబ్దమునకు శిఖరమని అర్థము. ఎత్తున ఉండునది శృంగము. ఆ శృంగమును చేరినది, అనగా అత్యున్నత భూమిలో నిల్చునది శృంగారము. సహృదయుని హృదయభూమిలో నొక మేరు పర్వతమున్నచో దానికి గల శిఖరముతో పోల్చదగినది శృంగారము. మిగిలిన భూములలో నిలచునవి ఇతర రసములు. హాస్యాది రసములకు ప్రకృతి కావున శృంగారమును ప్రకృతిరసమందురు. భోజుని మతమున శృంగారము సర్వరస ప్రకృతి. భవభూతి కరుణ రసమునకు అట్టిస్థానమునే కల్పించినాడు. కాని అది ఆత్యంతిక వియోగ పర్యవసాయి కావున రసికుల కదిసమ్మతము కాదు. శాంతమును ప్రకృతి రసమను వారును కలరు. అదినశ్వర విషయ విరక్తులకు మాత్రమే ఉపాదేయము. భక్తి రసమనుట ఆనంద వర్ధనాద్యాలంకారిక శిరోమణుల కంగీకార్యము కాలేదు. ఒకవేళ దాని రసత్వమును నిరాకరింపజాలకున్నను దాని శృంగార ప్రభేదమనుటను నిరాకరింపజాలరు. నశ్వర విషయ విముఖత శాశ్వత పరమేశ్వర సంగమ పర్యావసాయియే కావున శాంతరసము, శృంగారము పరస్పరవిరోధులనుట ఆధ్యాత్మిక శృంగార విషయమున చెల్లదు. అట్టిసందర్భమున శాంత రసమును, శృంగారరసమును ఒక నాణెమునకు గల బొమ్మ బొరుసులే అగును. కావున గోపికా శ్రీకృష్ణ శృంగారము ఆధ్యాత్మికముగ జీవేశ్వర సమాగమమే యని తత్కథాతాత్పర్య వేత్తలు చెప్పినారు. పరకీయా శృంగార వర్ణనాదులకు స్వకీయారక్షణమే తాత్పర్యమని అందుకే వాత్స్యాయనాది మహర్షులు పరకీయా సంగమాదులను తమ కామ శాస్త్రములలో వివరించి నారని తత్త్వవేత్తల యభిప్రాయము. అట్టి శృంగార రసము ప్రధానముగా గల అభిజ్ఞాన శాకుంతల మేఘసందేశ రత్నావళ్యాది ప్రబంధములు పెక్కులు సహృదయ హృదయావర్జకములై విరాజిల్లు చున్నవి. మొత్తము గ్రంథమున నొక శృంగారమును నింపుట యొక పద్ధతి. అది పైన పేర్కొనిన ప్రబంధము లందున్నది. మొత్తము శృంగారమును నొక శ్లోకమున నిబంధించుట మరియొక పద్ధతి. ఈ పద్ధతికి చెందిన గ్రంథములలో అమరుక శతకము సర్వశ్రేష్ఠము, అద్వితీయము. " అమరుక కవేరేకః శ్లోకః ప్రబంధ

శతాయతే''- అనునది ఆలంకారిక మూర్ధన్యుడైన అభినవ గుప్తుని సూక్తి. అమరుక కవి యొక్క ఒక శ్లోకము ప్రబంధ శతకమునకు సమానమని ఆ సూక్తి యొక్క అర్థము. అట్టి శ్లోకములను పెక్కు రచించిన వాడమరుకుడు. ఆతని శ్లోకముల సంఖ్య యెంత అను విషయమున వైమత్యమున్నను దాని శతక వ్యవహారమున వైమత్యము లేదు. అమరుక శతకముమీద విమర్శనములు పెక్కులు వచ్చినవి. వానిలో నాతని కాలనిర్ణయము నిశ్చయముగా ఇదమిత్థముగా చెప్పబడలేదు. కాని క్రీస్తుశకము ఏడవ శతాబ్దమునకు చెందిన వాడతడని కొందరి ఊహ. అసలు గ్రంథకర్త అమరుకుడు కాడని శ్రీశంకరాచార్యులే మండన మిశ్ర పండితుని జయించియు నాతని భార్యయగు భారతీదేవి యవతారమని భావింపబడిన ఉభయభారతీదేవిని జయించుటకై అప్పుడే మరణించిన అమరుక మహారాజు శరీరమున ప్రవేశించి కామ శాస్త్రవేత్తయై అమరుక శతకమును రచించి తిరిగి ఆశరీరమును వీడి ఉభయభారతిని జయించినాడను ఐతిహ్యము విద్యారణ్య ప్రణీతమైన శ్రీశంకర విజయ గ్రంథమున గ్రథితమై పెక్కురి చేత విశ్వసింపబడుచున్నది. శ్రీశంకరులే తమ అమరుక శతకమునకు ఆధ్యాత్మికార్థమును చెప్పి, సన్యాసియైన తమపై వచ్చిన శృంగారియను అపకీర్తి కళంకమును తొలగించుకొన్నారని కొందఱు చెప్పిరి. కాని ప్రసిద్ధ వ్యాఖ్యాత లెవ్వరును (అమరుక శ్లోకములకు శృంగారార్థమునే వివరించినారు. కాని) ఆధ్యాత్మికార్థమును చెప్పలేదు. వారు చెప్పలేదని దానికర్థము లేదనుట సరికాదు. యాస్కనిరుక్తమునకు వృత్తి రచించిన దుర్గాచార్యులు ప్రతిపాదించిన శబ్దవిభుత్వ సిద్ధాంతము ననుసరించి ఆశ్లోకములకు ఆధ్యాత్మికార్థమునొసగు శక్తిలేదని చెప్పజాలము.

అవ॥ శృంగార ప్రబంధమును రచింపగోరిన గ్రంథకర్త శిష్య శిక్షణమునకై మంగళాచరణము నొనరించుచున్నాడు.

శ్లో॥ జ్యాకృష్టిబద్ధ ఖటకాముఖ పాణి పృష్ఠ
ప్రేంఖన్న ఖాంశుచయ సంవలితోఽంబికాయాః।
త్వాం పాతు మంజరిత పల్లవ కర్ణపూర
లోభ భ్రమద్భ్రమర విభ్రమభృత్కటాక్షః॥ 1

ప్ర॥ జ్యాకృష్టి బద్ధఖటకాముఖ పాణిపృష్ఠ ప్రేంఖన్నఖాంశుచయ సంవలితః అల్లె త్రాటినిలాగుచున్నట్లు బంధించిన ఖటికా ముఖమను హస్తము (ముద్ర) యొక్క వెనుక భాగమున సంచలించు గోటి కాంతుల సమూహముతో కూడిన; మంజరిత

పల్లవ కర్ణపూరలోభ భ్రమద్భ్రమర విభ్రమ భృత్ - వికాసోన్ముఖములైన చిగుళ్ళ కర్ణ పూరము నందలి లోభముచే భ్రమించు తుమ్మెద యొక్క విలాసమును ధరించు; అంబికాయాః - అమ్మవారి యొక్క; కటాక్షః - క్రీగంటి చూపు; త్వామ్ - నిన్ను; పాతు - కాపాడుగాక!

తా॥ అమ్మవారు లాస్యాంగముగా ఖటకా ముఖముద్రను పట్టినది. అది అల్లెత్రాడు లాగుచున్న భంగిమ. అప్పుడమ్మవారి గోటికాంతి మట్టపై వ్యాపించినది. ఆ ముద్రనే చూచుచున్నందున అమ్మవారి క్రీగంటి చూపు ఆ కాంతిలో కలసినది. ఆ చూపు అమ్మవారి కర్ణపూరమును వికసోన్ముఖమైన పుష్పమంజరియని భ్రమించిన తుమ్మెద యట్లున్నది.

వి॥ 1. అల్లెత్రాడును లాగునప్పుడు వింటి దండము నెడమ పిడికిట బంధించి కుడి వ్రేళ్ళతో అల్లెత్రాటిని లాగుదురు. దాని నభినయించునప్పుడు కుడి పిడికిలి పైన శిఖరముగా బొటన వ్రేలిని ప్రదర్శించుదురు. ఆ ముద్ర (భంగిమ) శిఖర ముద్ర యనబడును. ఆ శిఖర ముద్ర యందు మూసియున్న చూపుడు వ్రేలిని వంచి బొటనవ్రేలితో కలిపినప్పుడు ఏర్పడు ముద్ర కపిత్థముద్ర యనబడును. ఆ కపిత్థ ముద్రయందు మూసియున్న అనామికను వంచి చూపుడు వ్రేలును చక్కగా పైకి నిలుపునప్పుడు ఏర్పడు ముద్ర ఖటకాముఖ ముద్రయన బడును. 2. ఈ ముద్రలో చూపుడువ్రేలు నిలబడి యుండును దాని గోటి కాంతులు పాణి పృష్ఠ మందు (మట్టపై) పడును. ''హస్తమెక్కడనుండునో దృష్టి యక్కడ నిలుపవలెను. దృష్టినిల్పిన చోట మనస్సుండును'' అను నాట్యశాస్త్ర నియమముననుసరించి అమ్మవారు తన దృష్టిని పాణి పృష్ఠమందు నిలిపినప్పుడు చూపుడు వ్రేలి గోటి కాంతులతో సంవలిత మగును. 3. అమ్మవారి వ్రేలు చిగురు వంటిది. గోరుపూవు వంటిది. వాని కాంతిపై తుమ్మెద వంటి అమ్మవారి చూపుపడినదను విషయము పుష్పమంజరీ భ్రాంతితో వచ్చిన తుమ్మెద యను భ్రాంతి నా కటాక్షము కలిగించినది, అని వర్ణించుటచే నీశ్లోకమున భ్రాంతి మదలంకారమును 'విభ్రమభృత్' అను పదము వాచ్యమొనరించుచున్నది. ''లోభభ్రమద్భ్రమర విభ్రమభృత్'' అను సమాసమున అనుప్రాసాలంకారమను శబ్దాలంకారము కూడ నున్నది. 4. కొందరీ సమాసముననున్న దుత్ప్రేక్షాలంకార మందురు. ఈ శతక వ్యాఖ్యాతలలో ప్రాచీనుడు ప్రామాణికుడునైన భోజ వంశీయుడు సుభటవర్మ పుత్రుడునైన అర్జున వర్మ దేవుడు త్ప్రేక్షయగుటను సిద్ధోప మానములేని కారణమున నిరాకరించి యట కల్పితోపమాలంకారమని ప్రాచీనుల మతము ననుసరించి చెప్పినాడు. ఈ శ్లోకమందు వీరరస వ్యంజక వైదర్భీరీతి

యున్నదనియు చెప్పినాడు. వృత్తము వసంతతిలక. 5. ఈ కావ్యమున రసము శృంగారమనుట స్పష్టము. శృంగార రసమున నాయికా నాయకులకు సమప్రాధాన్య ముండును. కాని ఈ మంగళాచరణ శ్లోకమమ్మవారిని వర్ణించుటచే నాయికకే ప్రాధాన్యమని చెప్పినట్లైనది. నాయిక తరువాత నాయకునకు ప్రాధాన్యము కావున రెండవ శ్లోకమున శివస్తుతి చేయబడినది. నాయికా నాయకుల శృంగారమునకు ఫలము నందనుడని పైన పేర్కొనబడిన వ్యాఖ్యాత యొక్క గురువైన బాల సరస్వతి యను నామాంతరముగల మదనుడు చెప్పినాడు. దేవీ భక్తిని ప్రతిపాదించు నీ మంగళాచరణ శ్లోకమున కామపురుషార్థ సూచకమైన కటాక్షమును వర్ణించుట ఏల? అను ప్రశ్నమును కల్పించుకొని కామపురుషార్థము సంతాన ఫల పర్యవసాయి పితౄణ విముక్తి హేతువు కావున కటాక్ష వర్ణనము దోషము కాదని వ్యాఖ్యాత తన గురువుగారు చెప్పిన వాక్యమును స్వమత సమర్థకముగా నుదహరించినాడు. ధర్మార్థకామ మోక్షములలో ధర్మార్థములకు పైన మోక్షమునకు కించిన్మాత్రమే కామము న్యూనముగా చెప్పబడినందున కామపురుషార్థముపాదేయమే యగుననియు సూచించినాడు. జ్యాకర్షణాభినయ మాత్రముననే సమస్త దైత్యవినాశ మొనరించు నమ్మవారి మహిమ యిటు వ్యంగ్యమని చెప్పినాడు. 6. కటాక్షము సితము, అసితము, సితాసిత మిశ్రము అని త్రివిధము. ఇట భ్రమరముతోడి సామ్యము చెప్పబడుటచే నీ కటాక్షము అసితమని తెలియుచున్నది. మూక మహాకవియు తన కటాక్ష శతకమున అమ్మవారి అసిత కటాక్షమునే వర్ణించినాడు. 7. శృంగార ప్రధాన కావ్యమున మంగళాచరణ శ్లోకము వసంత తిలకావృత్తమున నిబంధించుట యుచితముగా నున్నది. 8. దేవీకటాక్షమును వర్ణించు నీ మంగళా చరణ శ్లోకమున కాధ్యాత్మికార్థము చెప్పుట యనావశ్యకమే, అయినను తదర్థ ప్రణయులైన సహృదయుల మనః ప్రీతికై ఈ శ్లోకము యొక్క ఆధ్యాత్మికార్థము చెప్పబడుచున్నది. చక్షురింద్రియము తైజసము కావున కటాక్షమును తైజసమే. నఖము తైజసముకాదు. దాని కాంతియు తైజసము కాదు. కాని కటాక్షము తత్సంవలిత మైనది. తైజసా తైజసముల ఈ కలయిక సద్రూపుడైన పరమాత్మ యసద్రూప మాయావిద్యలందు ప్రతిబింబించుటను సూచించును. ఈ శ్లోకము నందలి భ్రమర భ్రాంతి జీవునికి సంసారము నందుగల సత్యత్వభ్రాంతిని సూచించును. శాక్తేయ తంత్రమున వామాదేవి జగత్సర్జనమును, జ్యేష్ఠాదేవి జగత్పాలనమును, రౌద్రీదేవి జగత్సంహారమును చేయునని చెప్పబడును. ఆ ముగురమ్మల మూలపుటమ్మ నంబికా శబ్దము సూచించు చున్నది. ఈ జగత్ సృష్టిపాలన సంహారకృత్యము అపర (బ్రహ్మ) యొక్క తటస్థ లక్షణ మగుటను

చూచించు చున్నది. ఇచ్ఛాశక్తికి (పశ్యంతికి) జ్ఞానశక్తికి (మధ్యమకు); క్రియాశక్తికి (వైఖరికిని) మూలదేవత యని చెప్పబడిన అంబిక కటాక్షము ఎదుటనున్న వానిని రక్షించుటకై ప్రార్థింపబడుచున్నది. ఆ ఎదుటనున్న వాడు గ్రంథప్రేరకుడైన మరొక రాజో, తనకన్నా అధికుడైన చక్రవర్తియో కావచ్చును. అతని రక్షణ మీతనిచే అర్థింపబడినదని లేక తనను తాను శుద్ధాత్మునిగా భావించుకొని తన దేహేంద్రియాదులందాభిమానించు తన ఆత్మ ప్రతిబింబమైన చిదాభాసరూపుడైన తన జీవుని త్వవ్పదార్థరూపునిగా భావించుకొని యాతని రక్షణ మర్థింపబడినదనియో ఊహించు కొనవలసి యున్నది. అంబికా శబ్దము అల్పార్థక ప్రత్యయమను కొన్నప్పుడు అంబ గంగయని, అంబిక పార్వతియని వ్యక్త మగును.

అవ॥ పితుః శతగుణ మ్మాతా అను సూక్తిననుసరించి పూర్వ శ్లోకమున అంబికా (కటాక్ష) ప్రార్థన మాచరింపబడినది. 'మాతృదేవోభవ' అను అను శాసనమునకు పిమ్మట 'పితృదేవోభవ' అను అనుశాసనమున్నది. కావున ఈ శ్లోకమున శివుడు (అతని శరాగ్ని) ప్రార్థింప బడుచున్నాడు.

శ్లో॥ క్షిప్తో హస్తావలగ్నః ప్రసభ మభిహతోఽప్యాదదానోఽంశుకాన్తం
గృహ్ణన్ కేశేష్వపాస్త శ్చరణ నిపతితో నేక్షితః సంభ్రమేణ।
ఆలింగన్యోఽవధూత స్త్రిపుర యువతిభిః సాశ్రునేత్రోత్పలాభిః
కామీవాఽఽర్ద్రాపరాధః స దహతు దురితం శాంభవో వః శరాగ్నిః

ప్ర॥ యః-ఎవడు/ఏది; సాశ్రునేత్రోత్పలాభిః-కన్నీరుకార్చు కలువుల వంటి కన్నులు గల; త్రిపురయువతిభిః-త్రిపురాసురభార్యలచేత; క్షిప్తః-త్రోసివేయబడి; హస్తావలగ్నః-చేతినంటుకొనువాడై/నదై; ప్రసభమ్-వేగముగా; అభిహతః+ అపి-కొట్టబడిన వాడైనను/నదైనను; అంశుకాన్తమ్-కొంగును; ఆదదానః-లాగువాడై/నదైనను; కేశేషు-వెంట్రుకల (యందు); గృహ్ణన్-గ్రహించుచు (పట్టుకొనుచు); అపాస్తః-తొలగింప బడినవాడై(దై); చరణ నిపతితః-కాళ్ళయందుబడి; న+ ఈక్షితః-చూడబడనివాడై/దై; సంభ్రమేణ-తొట్రుపాటుతో; ఆలింగన్ - కౌగలించుచు; అవధూతః-తొలగింప బడినవాడై/దై; ఆర్ద్రాపరాధః-క్షణ ముక్రితమే అపరాధము చేసిన; కామీ+ ఇవ-కాముకుని వలెనున్న; సః-ఆ; శాంభవః-శివునికి సంబంధించిన; శరాగ్నిః-బాణాగ్ని; దురితమ్-పాపమును; దహతు-కాల్చుగాక!

తా॥ పరస్త్రీసక్తుడైన ప్రియుని నాయికలు సహింపక యాతనిని దూరముగా నుంచు యత్నమొనర్చుదురు. ఆ ప్రియుడు మరల మరల తన ప్రియుల వెంట

ఖడుచుండును. తోసి వేసిన ప్రియుల చేతులు పట్టుకొనును. మృదువుగా కొట్టినను వాడు కొంగు పట్టుకొనును. దూరముగా నెట్టినను పాదములు పట్టుకొనును. వారు అప్పటికిని వానివైపు చూడరు. అయినను వాడు వారిని కౌగిలించుకొన బోవును. ప్రియుడు పరస్త్రీసక్తుడైనాడని కన్నుల నీరు కార్చుచునే, లోపల వానిని ప్రేమించుచునే ఈర్ష్యచేత వానిని దూరముగా నుంచ యత్నించుదురు. వాడు కాముకుడు. వాని అపరాధము క్షణము క్రితమే వారి కంటబడినది. వాడు శఠుడు అనగా గూఢముగా అపరాధము చేయును. బాధను కల్గించును. అయినను వారది గమనించెదరు. శివుడు త్రిపురాసురుల సంహరించుటకు బాణముల ప్రయోగించెను. ఆ బాణముల నుండి పుట్టిన అగ్ని వారి భార్యల చేతులను కొంగులను, కేశములను, పాదములను, చివరకు శరీరమును అంటుకొనెను. ఆ శివ శరాగ్నిచేష్టలు ఆర్ద్రాపరాధి యగు కాముకుని చేష్టలవలె నున్నవి. వారి ప్రియుల చేష్టలు ఆర్ద్రాపరాధి కాముకుడైన ప్రియుని దూరమున నుంచు ప్రయత్నములను పోలియున్నవి.

వి॥ 1. ఈ చేష్టలను బోధించు శబ్దములు క్షిప్తః హస్తావలగ్నః ఇత్యాదులు భిన్నార్థములు గాకున్నను అగ్ని యందును, కాముకునియందును సమముగా నున్నవి. కావున ఇట్టి శబ్దముల ఉభయసమానార్థములను కలిగి యుండుట అర్థశ్లేష యనబడును. ఈ యర్థశ్లేష కాముకుని తోడి పోలిక అగ్నికి కలదని ఇవశబ్దము వాచ్యమొనరించుటచే నీశ్లోకమున అర్థశ్లేషానుప్రాణితోపమాలంకారము కలదు. సాశ్రునేత్రోత్పలాభిః అను సమాసమున లుప్తోపమాలంకార మున్నది. 2. పూర్వశ్లోకమున కటాక్ష శబ్దముచే అంబికా శంభుగత సంభోగ శృంగారము రేఖా మాత్రముగా సూచింపబడగా ఈశ్లోకమున త్రిపుర యువతుల యొక్క ఆర్ద్రాపరాధి కాముకత్వ సంభావిత శాంభవ శరాగ్ని యందుగల ఈర్ష్యావిప్రలంభ శృంగారము పుష్కలముగానే ఆస్వాద్యమాన మగు చున్నది. ఈ రెండు శృంగారములను అంబికాగత భక్తి (రతి) భావమున కంగములు గానే చేయబడినవి. ముండస్రగ్ధరుడైన శంభుని శరాగ్నిని స్రగ్ధరావృత్తమున వర్ణించుట యుచితముగా నున్నది. 3. పూర్వశ్లోకమున శివప్రీత్యర్థ లాస్యసక్తయగు అంబికా (నాయిక) వర్ణింప బడగా నీ శ్లోకమున శివుడు (శాంభవశరాగ్ని) అనగా నాయకుడు వర్ణింప బడినాడు. ఈ శ్లోకమందు శాంభవశరాగ్ని త్రిపుర యువతి గతములు విరుద్ధములునైన శృంగార కరుణములు పోషింపబడినవి. అయినను ఆ రెండింటి కంగాంగి భావ ముండుటచే నా విరోధము రసప్రతీతి భంజకము కాలేదు. 4. మంగళాచరణ రూపములైన ఈ రెండు శ్లోకములందు అంబికా శంభుగత వీర రసము పైన చెప్పబడిన సంభోగ విప్రలంభ

రసములతో పాటు అంగములుగా నున్నవి. అంబికాశంభులందు కవికి గల భక్తి (రతి) భావము అంగిగా నుండుటచే రసవదలంకారమున్నది. 5. ఆధ్యాత్మికార్థము- త్రిపురములనగా స్థూలసూక్ష్మ కారణ శరీరములు. త్రిపురాసురులనగా తత్తద్దేహాభిమానులైన విశ్వతైజసప్రాజ్ఞులు. త్రిపుర యువతులనగా తత్తద్దేహము లందు తత్తద్దేహాభి మానులైన విశ్వతైజస ప్రాజ్ఞులకు గల అభిమానములే. ఇవి బ్రహ్మ విష్ణు రుద్రగ్రంథులని చెప్పబడును. (స్థూలదేహాభి మానము బ్రహ్మగ్రంథి, సూక్ష్మదేహాభి మానము విష్ణుగ్రంథి. కారణ దేహాభిమానము రుద్రగ్రంధి.) త్రిపుర యువతులను శాంభవ శరాగ్ని యంటుకొనుట యనగా తద్దేహత్రయాభిమాని జీవుని త్రివిధాభి మానములు దహింపబడుటయే. శాంభవ శరాగ్ని యనగా జ్ఞానాగ్నియే. ఈ శ్లోకమున శాంభవ శరాగ్ని దురిత దాహమునకై ప్రార్థింపబడుచున్నది. దురితము దగ్ధము కానిదే, చిత్తశుద్ధికలుగదు. చిత్తశుద్ధి కలుగనిదే జీవేశ్వరైక్య జ్ఞానము కలుగదు. జ్ఞానము కలుగనిదే కైవల్యరూప పరమ ముక్తి లభింపదు. సాధారణముగా తల్లి బిడ్డను కాపాడును కావున పూర్వశ్లోకమున రక్షణ మర్థించ బడినది. తండ్రి ఉపనయన బ్రహ్మోపదేశముల వంటి సంస్కారముల ద్వారా కుమారుని జ్ఞానప్రతిబంధములను తొలగించును. జ్ఞాన ప్రతిబంధములు దురితములే యని ఇంతకు ముందే చెప్పబడినది. కావున ఈ శ్లోకమున తండ్రియగు శివుడు(శాంభవశరాగ్ని) దురిత దహనమునకై యర్థింపబడుట ఉచితముగా నున్నది.

అవ॥ పూర్వశ్లోక ద్వయమున దేవతాశీర్వాద మర్థింపబడినది. ఈ శ్లోకమున సురతాంత సుందర కాంతా ముఖము రక్షణకై యర్థింపబడు చున్నది.

శ్లో॥ ఆలోలా మలకావలీం విలులితా మ్బిభ్రచ్చలత్కుండలం
కించిన్మృష్ట విశేషకం తనుతరైః స్వేదామ్భసః శీకరైః।
తన్వ్యా యత్ సురతాంత తాంత నయనం వక్త్రం రతివ్యత్యయే
తత్త్వాం పాతు చిరాయ కిం హరిహర స్కందాదిభి ర్దైవతైః॥ 3

ప్ర॥ రతివ్యత్యయే-పురుషాయిత రతియందు; అలోలామ్- కొంచెము లేక బాగుగా కదలు; విలులితామ్-చెదిరిన; అలకావలీమ్- ముంగురుల గుంపును; బిభ్రత్- ధరించుచున్న; చలత్కుండలమ్- కదలుచున్న కుండలములు గల; తనుతరైః- మిక్కిలి చిన్న; స్వేదామ్భసః-చెమట యొక్క; శీకరైః- బిందువుల చేత; కించిన్మృష్ట విశేషకమ్- కొంచెము చెదరిన బొట్టుగల; సురతాంత తాంత నయనం- సంభోగాంత మందు పెద్దవైన కన్నులు గల; తన్వ్యాః- కృశాంగి యొక్క; యత్- ఏ; వక్త్రం ముఖము

(కలదో); తత్-అది; త్వామ్-నిన్ను; పాతు-కాపాడు గాక; హరిహరస్కందాదిభిః-విష్ణు శివుడు కుమారస్వామి మొదలైన; దైవతైః-దేవతలతో; కిమ్-ఏమి (ప్రయోజనము).

తా॥ స్త్రీ పురుషులకు సంభోగాంతమున కొంచెె మలసట కలుగును. కాని సంభోగ మందాసక్తి స్త్రీ పురుషుల కింకను మిగిలియే యుండును. అప్పుడు పురుషుని యనుమతితో నాయిక నాయకునికి పైనుండి సంభోగ క్రియకు సాయపడుట పురుషాయితరతి యనబడును. స్త్రీ పురుషునివలె పై నుండి రతిలో పాల్గొనుట ఈ పురుషాయితిరతికా పేరు కలుగుటకు కారణము. సంభోగాంతమున స్త్రీ యొక్క జుట్టు చెదరియుండును. కుండలములు కదలు చుండును. ముఖమందు పుట్టిన చిరుచెమటచే బొట్టు చెదరి యుండును. కన్నులు పెద్దవై యుండును. ఇట్లు సంభోగాంతమున మరింత యందముగా కనబడు కాంతా ముఖము నిన్ను రక్షించు గాక! కాముకుడవైన నీకా సుఖమును శివుడు కాని, విష్ణువు కాని, కుమార స్వామి కాని ఈయలేరు కదా! వారితో నిక నేమి ప్రయోజనము.

వి॥ 1. ఈ శ్లోకమున హరిహరస్కందాది దేవతాక్షేప ముండుటచే నాక్షేపాలంకార మున్నది. సురతాంత తాంత నయనమ్ అను సమాసమున తాంతయను శబ్దమ వ్యయహితముగా ద్విరుక్త మగుటచే ఛేకాను ప్రాసయను శబ్దాలంకార మున్నది. సురతాంత కాంతా వదన మిందు స్వభావసుందరముగా వర్ణించు చక్కని విశేషణ ములతో వర్ణింప బడుటచే స్వభావోక్త్య లంకార మున్నది. 2. మంగళాచరణము నందు వలె ఈ శ్లోకమున కాంతాముఖము రక్షణకై ప్రార్థింపబడినను ఇది దేవతాశీః ప్రార్థనాదుల వంటి మంగళా చరణము కాదు. కారణమేమనగా నిట్లు మంగళా చరణము చేయుట హాస్యోద్దేశముగా మాత్రమే యుండుట. అనగా కవికి హాసమును కల్గించుట యందే తాత్పర్య ముండుట అట్టి కాంతా ముఖమునకు మంగళముల కల్గించు శక్తి లేకుండుట అనగా నాయకుని కాహ్లాద రూపదృష్టి మంగళమును కల్గించినను పాపాది నిర్మూలన రూపమైన అదృష్ట మంగళము నీ ముఖము కలిగింప జాలక పోవుట. 3. ఈ శ్లోకమున సంభోగ శృంగారము ఆస్వాద్యమగు చున్నది. సంభోగ శృంగారమున కాలంబన విభావమైన ఇచటి నాయిక ముగ్ధకాదు. మధ్యయుకాదు. ఈ నాయిక ప్రౌఢ, ప్రేమ పెంపొందుచున్న కొలది సిగ్గు తగ్గుచుండును. తొలుత సిగ్గెక్కువగా నుండును. అట్టి నాయిక ముగ్ధ. కొంతకాలము గడవగా సిగ్గు తగ్గుట మొదలగును. అట్టి నాయిక మధ్య. సిగ్గు యొక్క జాడ కన్పడక పోవు స్థితి యేర్పడును. అట్టి నాయిక ప్రౌఢ యనబడును. 4. ఉత్తమ నాయికా నాయక సంభోగము వారికి

సమాధిలో కలుగు ఆనందముతో సమానమైన ఆనందము కలిగించును. (రజనీశ్ యొక్క సాహిత్యమీ సందర్భమున చదువ దగినది.) తద్వర్ణనమును సహృదయుల హృదయములందట్టి విగళిత వేద్యాంతరమైన ఆనందమునే కలిగించును. చిత్తము ద్రవించినప్పుడు ఆనందము కలుగును. కఠిన చిత్తుల కానందము కలుగదు. జాలియు కలుగదు. చిత్తము యొక్క ఈ ద్రవీభావము సంభోగే విప్రలంభే చ కరుణే చ ప్రకర్షవత్-సంభోగ శృంగారమున విప్రలంభ శృంగారమున కరుణమున ప్రకర్షము కలిగి యుండునని ఆనంద వర్థనుడు చెప్పినాడు. ప్రభువువలె శాసించు వేదము యొక్క శాసనము, మిత్రుని వలె బోధించు పురాణము యొక్క ఉపదేశమును పనిచేయని సుకుమార బుద్ధులలో ధర్మము నందాదరము కలుగజేయుటకీ కాంతా సమ్మితమైన రస ప్రధాన మహాకావ్య మొక్కటీ సమర్థము. 5. ఆధ్యాత్మికార్థము: హరి హర స్కందాదీష్ట దేవతానుగ్రహమున అద్వైత వాసన కలుగును. వారి యనుగ్రహము కలుగుటకు తొలుత ఉపాస్యోపాసక భేదబుద్ధి యావశ్యకమైన దైనను ఆ దేవతతోడి తాదాత్మ్యమును, అభేదమును పొందనంత వరకు ముక్తి కలుగదు. తానే ఆ యిష్ట దేవతాభేదమును పొంది నప్పుడింక నా దేవతయే విడిగా నుండదు. దేవత స్వాత్మాభిన్నయై నప్పుడింక నా దేవత తోడి ప్రయోజన మేముండును. ఈ శ్లోకము నందలి దేవతాక్షేపమున కిదియే తాత్పర్యము. నాయికకు నాయకుడుపాస్యుడు. నాయకునకు నాయిక యుపాస్య. ఈ ఉపాసనము వారి సంభోగ రూపైక్యమున పర్యవసించును. అప్పుడు పాస్యోపాసక భేదబుద్ధి నశించును. నాయికా నాయకుల లొ నొకరు జీవునకు మరొకరు ఈశ్వరునకు ప్రతీకములు. ఈ యిరువురి సంభోగ రూపతాదాత్మ్యమున పైనెవరు? క్రిందెవరు? అను ప్రశ్న మకించిత్కరము. నాయిక పురుషాయిత యైనది. అనగా జీవున కీశ్వర భావము లేక ఈశిత్వము కలిగినది అని ఈ శృంగారరస ప్రధాన శ్లోకము యొక్క అంతరార్థము. 6. శ్రేష్ఠవాచక శార్దూల శబ్దారబ్ధ నామము శార్దూలవిక్రీడిత వృత్తమీ శ్రేష్ఠ నాయికానాయక శృంగారవర్ణనము నకే నిబంధించుట యుచితముగా నున్నది. ఇట్టి వృత్తములే ఈ వర్ణనమునకు మూలముగా నుండుట వృత్తౌచిత్యము.

అవ॥ పై శ్లోకమున సురతాంత మందలి కాంతా ముఖము రక్షణ మునకై ప్రార్థించి నట్లు మంగళాచరణ చ్ఛాయతో నీ సంభోగ శృంగారము వర్ణింప బడినది. ఈ శ్లోకమున విప్రలంభ శృంగార భేదములలో మొదటి దైన ప్రథమరాగ శృంగారము వర్ణింప బడు చున్నది.

శ్లో॥ అలసలలితైః ప్రేమార్ద్రార్ద్రై ర్ముహు ర్ముకులీ కృతైః
క్షణ మభిముఖై ర్లజ్జాలోలై ర్నిమేష పరాఙ్ముఖైః
హృదయనిహిత మ్భావాకూతం వమద్భిరి వేక్షణైః
కథయ సుకృతీ కోఽయమ్ముగ్ధే త్వయాద్య విలోక్యతే॥ 4

ప్ర॥ అలసలలితైః-మెల్లిగా కదలుటచే అందములైన; ప్రేమార్ద్రార్ద్రైః-ప్రేమచే తడి తడిగా నున్న; ముహుర్ముకులీకృతైః-మాటిమాటికి మూయబడిన; క్షణమ్-కొంచెము సేపు; అభిముఖైః-ముఖమునకెదురుగా నున్న; లజ్జాలోలైః-సిగ్గుతో చంచలములుగా నున్న; నిమేష పరాఙ్ముఖైః-ఱెప్ప పాటును వీడిన; హృదయ నిహితమ్-ఎదలోదాగి యున్న; భావాకూతమ్-ప్రేమసంకేతమును; వమద్భిరివ-వెలిగ్రక్కు చున్నట్లున్న; ఈక్షణైః-చూపులచేత; కః-ఏ; సుకృతీ- పుణ్యాత్ముడు; త్వయా-నీచేత; అద్య-ఈనాడు; విలోక్యతే-చూడబడుచున్నాడో; కథయ-చెప్పుము.

తా॥ ఒక సహచరి తన నాయిక యొక పురుషుని చూచుటను చూచి ఆమెతో ఇట్లు అనుచున్నది. నీ చూపులు మెల్లగా కదులుటచే నందములై యున్నవి. అవి ప్రేమచే మిక్కిలి తడిసియున్నవి. మాటి మాటికి మూయబడుచున్నవి. కొంచెము సేపే నాయకుని చూచు చున్నవి. అంతలోనే సిగ్గుతో కొంచెము కదలుచున్నవి. అంతలోనే ఆ చూపులలో రెప్పపాటు ఆగిపోవుచున్నది. ఎదలో దాగియున్న ప్రేమను వెల్లడించు చున్నట్లున్నవి. అట్టి చూపులతో నీవీనాడే పుణ్యాత్ముని చూచు చున్నావో చెప్పుము.

వి॥ 1. ఈ శ్లోకమందలి నాయిక పరకీయ యని ఆమె పురుషుని యందను రాగము నంది చూచునప్పుడు సిగ్గుచేత ప్రేమచేత చూపుల లోని మార్పులను కవి వర్ణించి నాడని ప్రామాణిక వ్యాఖ్యాత యగు అర్జున వర్మదేవుడు చెప్పినాడు. దీనికి సూచనము శ్లోకమున ''అద్య'' అని యుండుట. 2. ఈ శ్లోకమున సహచరి పేరుకాని, నాయిక పేరుకాని, నాయకుని పేరు కాని చెప్పక పోవుటచే నాయకుడు శ్రీకృష్ణుడని నాయిక యొక గోపిక(రాధ) యని సహచరి మరొక గోపిక యని తలచుట కెట్టి యభ్యంతరము లేదు. వాస్తవమునకు శ్రీకృష్ణుని మించిన పర(మ) పురుషుడుండ జాలడు. అయనకు సమస్త జీవులు స్వకీయనాయికలే. ఇట్లంగీకరించిన ఈ శ్లోకము రాధాకృష్ణ శృంగార వర్ణనమై పవిత్రతను సంతరించు కొనును. 3. యౌవనా రంభ మందు సుందర పురుషుని చూచినప్పుడు సహజముగ కలుగు లజ్జనే లజ్జాలోలైః అను పదము సూచించును. శృంగార నాయిక స్వకీయ(పెండ్లిచేసి కొన్న

నాయిక); సామాన్య అనగా వేశ్య, పరకీయ యనగా పరులకు చెందిన నాయిక అని త్రివిధముగ నుండును. పరకీయా నాయిక యనగా పెండ్లికాక ముందు తండ్రి రక్షణలో నున్న నాయిక యని ఒక అర్థము. ఒకనికి భార్యగా నుండియు మరొక పురుషుని వలచిన నాయిక యని మరొక యర్థము. లజ్జాలోలైః అనుపదము ఈ పరకీయ నాయిక మొదటి తరగతికి చెందినదే కాని రెండవ తరగతికి చెందినది కాదనియు సూచించును. **4.** ఆధ్యాత్మికార్థము-రాధా దేవి కొందఱి దృష్టిలో ఊఢ అనగా పెండ్లయిన స్త్రీ. శ్రీకృష్ణుని యందు బద్ధాను రాగ యై జీవితమునంతను ఆతని విరహముతో గడపినదని (జయదేవుని అష్టపదులలో) జానపదుల గాథలలో విస్తృత ప్రచారము నొందిన యైతిహ్యము. దీని ననుసరించి ఆమె రెండవ తరగతికి చెందిన నాయిక. ఈ యైతిహ్యము ఆమెకు భర్తతో సంగము లేనిదని శ్రీకృష్ణుని తోడనే సంగమము కలదని ఆమె పవిత్రతను సూచించును. కొన్ని పురాణముల ననుసరించి రాధాదేవి శ్రీకృష్ణుని కనిత్యాపాయుని యైన నాయిక అనగా ఆమె శ్రీకృష్ణునిలోనే ఉన్న నాయిక. కావున ఆమెకు గల శ్రీకృష్ణుని విరహము అవతారమునకు సంబంధించిన అభినయము మాత్రమే. ఈ దృష్టితో ఆమె మొదటి తరగతికి చెందిన నాయికయే. కొన్ని పురాణములలో ఆమెకు శ్రీకృష్ణునికిని జరిగిన వివాహ మహోత్సవ వైభవము కూడ వర్ణింపబడినది. ఇట్లే రాబోవు శ్లోకములలో నాధ్యాత్మికార్థమునూహించుకొన వలెను. **5.** సుకృతీ అను నాయిక విశేషణము ఎందఱో నిన్ను జూచి, నీవు తమను చూచి వలపించు కొనగోరు చుండగా వారిపై కన్నెత్తియు జూడవు. ఇప్పుడీ నాయకుని కుతూహలముగా చూచుచున్నావనగా ఆతడు గొప్ప పుణ్యాత్ముడను వస్తువును వ్యంజింప జేయు చున్నది. పెండ్లికాక ముందు కన్య పురుషుని చూచుట, వలచుట అనునవి సాధారణములు, స్వాభావికములు నైన వ్యవహారములు. **6.** నాయికా నాయక సంయోగమునకు ముందు నాయికకు ప్రథమముగా కలిగిన అనురాగ మిందు వర్ణింపబడుటచే నీ యనురాగము ప్రథమాను రాగమని చెప్పబడినది. దీనికే పూర్వ రాగమని మరొక పేరు. నాయకుని సంభోగ వాంఛ అధికమై విషాదాద్యవస్థల ననుభవించు స్థితి కలిగిన అది పూర్వ విరహముగా మారును. అట్లుగాక వివాహము జరిగి నాయిక సంయోగమును పొందగలిగి నప్పుడు ఆ సంయోగ శృంగారము యొక్క పూర్వాంగమగును. **7.** ఆరంభ శ్లోకములలో నీ ప్రథమానురాగ శ్లోకముండుట యుచితముగానే యున్నది. ఈ శ్లోకమునకు ముందే యున్న శ్లోకమున సంభోగ శృంగారము వర్ణింపబడినను అది ఆశీరూప మంగళా చరణ చ్ఛాయలో నున్నది. కావున వస్త్వారంభ శ్లోకములలో చేరదు. ఈ శతకమున

ప్రథమ ద్వితీయ శ్లోకములలో ఆశీః ప్రార్థనా రూప మంగళా చరణ ముండుటచే దాని యందు వస్తు నిర్దేశ రూప మంగళా చరణ మున్నదనుట సమంజసము కాదు. వ్యాఖ్యాత యగు అర్జునవర్మ దేవుడు క్రమౌచిత్యాత్ ప్రథమలిఖితః- క్రమౌచిత్యము కారణముగా మొదట వ్రాయ బడినది అని చెప్పినాడు. 8. ముగ్ధ యొక్క విశిష్ట వీక్షణ ములు హేతువులుగా ఆమెలోని ప్రథమానురాగము చూపింప బడుటచే నిందను మానాలంకారము కలదు. ముగ్ధే అను పదము నాయకుని తదేక దృష్టితో చూచి, నీలోని ప్రేమను బయట పెట్టు కొని లోకోపహాసమునకు పాత్రురాలవగుదువు. అంతగా చూడదలచు కొన్నచో గుప్తముగా చూడుము. నాయకునితో నీకు సమాగమము నే నేర్పాటు చేయుదును అను వస్తువు వ్యంగ్యమగు చున్నది. ఇది కవిని బద్ధ వక్త్రియగు సఖి వాక్యనిష్పన్నమగుటచే కవి నిబద్ధ వక్తృప్రౌఢోక్తి సిద్ధము. 9."క్షణ మభిముఖైః" అను ఈక్షణ విశేషణ ముచేత నాయిక సిగ్గునకు కారణము ఆతడు కూడ నీమెను ప్రేమించు చున్నాడని తెలుసుకొనుట, అను లజ్జాకారణము వ్యంగ్యమగుచున్నది. నాయికలు చంచలాక్షులు, మృగాక్షులు. లక్ష్మీదేవి యవతారములు. వారిని వర్ణించుటకు హరిణీ వృత్తమును కవి యుపయోగించుట మిక్కిలి సముచితము.

అవ॥ పైశ్లోకమున పూర్వరాగము వర్ణింపబడినది. ఈ శ్లోకమున ఈర్ష్యావిర హము వర్ణింపబడుచున్నది.

శ్లో॥ అంగుల్యగ్రనఖేన బాష్పసలిలం విక్షిప్య విక్షిప్య కిం
తూష్ణీం రోదిషి కోపనే బహుతర మ్ఫూత్కృత్య రోదిష్యసి।
యస్యాస్తే పిశునోపదేశ వచనైర్మానేఽతి భూమిం గతే
నిర్విణ్ణోఽనునయ మ్ప్రతి ప్రియతమో మధ్యస్థతా మేష్యతి॥ 5

ప్ర॥ అంగుల్యగ్రనఖేన- వ్రేలికొనగోటితో; బాష్పసలిలమ్- కన్నీటిని; విక్షిప్య విక్షిప్య- విసరి విసరి; తూష్ణీమ్- మౌనముగా; కిమ్- ఏల; రోదిషి- ఏడ్చు చున్నావు; బహుతరమ్- అధికముగా; ఫూత్కృత్య- వెక్కి; రోదిష్యసి- ఏడ్చెదవో; (తస్యాః- ఆ; తే- నీ యొక్క); ప్రియతమః- ప్రియతముడు; అనునయమ్ ప్రతి- అనునయించు విషయమున; నిర్విణ్ణః- నిర్వేదమునొందిన వాడై; మధ్యస్థతామ్- పట్టించుకొనని స్థితిని; ఏష్యతి- పొందగలడు.

తా॥ నీకు కోపమెక్కువ. దానికి తోడు నీ నాయకునిపై కొందఱునీతో చుప్ప నాతులు కొండెములచెప్పినారు. వానితో నీ మానము (కోపము) పెరిగిపోయినది.

కారుచున్న కన్నీటిని కొనగోటితో తొలగించు కొనుచు వెక్కివెక్కి ఏల యేడ్చెదవు? ఎంతసేపేడ్చెదవు? దాని వలన నీప్రియుడు నిన్నూరడించుటకు వచ్చునను కుందువేమో! అట్లు జరుగదు. పైగా ఊరడించినను ప్రయోజనమును బొందని నిర్వేదమును బొంది నీ దుఃఖమును పట్టించు కొనని ప్రమాదమున్నది. ఇంతటితో నూరుకొన్న ఆతడు నీదుఃఖమును నూరడించుటకు వచ్చునవకాశమున్నది. ఈ మారు వచ్చునప్పుడు కోపమును తగ్గించుకొని ప్రవర్తింపుము. మరల మీ దంపతుల మధ్య సయోధ్య యేర్పడి కాపురము చక్కబడ గలదు.

వి॥ 1. పై శ్లోకమున వలె ఈ శ్లోకము నందును నాయికకు అమె సహచరి చేసిన ఉపదేశమున్నది. నాయకుడు పరస్త్రీలోలుడై నాడు అని కొండెగత్తెలు నాయికతో చెప్పినారు. ఆ మాట నిజమని నమ్మిన నాయిక యొక్క మానము (కోపము) అతివేల మైనది. కన్నీటిని కొనగోటితో విసిరికొట్టుచు వెక్కివెక్కి యేడ్చుచుండగా చూచిన అమె సహచారి అమెకీ యుపదేశ మొనర్చినది. నాయకుడు కొండెగత్తెలు చెప్పినట్లు పరస్త్రీ లోలుడు కాడు. నీ కొంప కూల్చవలెనని వారు నీకిట్టి కొండెములు చెప్పినారు. నీవింత కోపము నొందుటచే నాయకుడు నీదగ్గఱకు వచ్చుటకు భయపడు చున్నాడు. నీవిట్లే అతనియెడ కోపమును చూపించు చుండిన నీ కోపమును మాన్పలేనని నిరాశనొంది నీ కడకు బొత్తిగా వచ్చుటయే మాని వేయునని హెచ్చరిక చేయుచున్నది. అతడు నిన్నూరడించ వచ్చినప్పుడు కొంచెము బెట్టు చేసినను అతడు విముఖుడై పోవునట్లు కోపమును ప్రదర్శింపకు మని ఉపదేశించు చున్నది. 2. విరహము అనగా నాయికా నాయకుల ఎడబాటు. ఒకప్పుడు నాయిక యొక్క ఈర్ష్యకారణముగా సంభవించును. సాధారణముగా నాయికలు (స్త్రీలందఱు) తమ ప్రియుని యే యపరాధములైనను సహింపగలరేమో కాని అతని పరస్త్రీ సౌముఖ్యమును సహింపరు. నాయకుని ఈ పరస్త్రీ సంపర్కము యధార్థము కాక పోయినను అతని పొరపాట్లు (పరస్త్రీనామమును కలవరించుట మొదలగునవి వినుట కారణముగా గాని లేక స్త్రీలు అతని యందు పరస్త్రీసంపర్క సూచనములై అతని గుడ్డలకు, శరీరమునకు అంటుకొనిన బొట్టు, కాటుక మొదలగునవి చూచి అతని పరస్త్రీ సంపర్కము ననుమానించుట కారణముగా గాని పరస్త్రీలతో అయున చేసిన ఆలింగనాదులు చూచుట కారణముగా గాని ఈర్ష్య జనించును. ఈ విధము వినుట వలన (శ్రుతము), అనుమానించుట వలన (అనుమితము,) చూచుట వలన ఈర్ష్య జనించి నాయకునితో వియోగమును విరహమును పొందుట జరుగును. దీనికి ఈర్ష్యా విరహమని పేరు. ఇది వియోగ

శృంగారము (విప్రలంభ శృంగారము) యొక్క భేదములలో నొకటి. అది ఈ శ్లోకమున వర్ణింపబడినది. 3. నాయకులు పెక్కురు నాయికలందు ప్రేమ కలిగి యుండుట ప్రాచీన కాలమునుండి నేటి వఱకును మనము చూచుచున్నాము. ఆయన పెక్కుఱు స్త్రీలను పెండ్లాడుటయు చూచుచునే యున్నాము. అట్టి నాయకులు దక్షిణ నాయకులన బడుదురు. వారు వీరైనంత వఱకందఱు నాయికలందు సమాన ప్రేమను కలిగియుండుట, కలిగి యున్నట్లు నటించుటయో జరుగు చుండును. అందఱు ఊఢలే (పెండ్లాడబడినవారే) కావున వారిలో కొందఱిని వివాహమాడుటకు ముందు తామనుమతించిన వారేకూడ ఆయియుందురు కావున అతని నాయికలు సాధారణముగ ఈర్ష్యా విరహమునకు గురికాకుండ నుందురు. అప్పుడప్పుడు నాయకుని శాఠ్యము (గూఢముగా నాయిక కు కష్టము కల్గించుట) కారణముగా ఈర్ష్యావిరహము వారిలో కూడ కలుగు చుండును. ఇట్టి సందర్భములలో నాయకుడు తనకు మిక్కిలి యిష్టమైన నాయికతో సంపర్కమును సైతము మిగిలిన వారికి తెలియకుండ చేయుటకు యత్నించును. ఒక వేళ తెలిసి పోయినచో వచ్చి క్షమాపణ వేడుకొనును. లేదా పాదములపై సైతము పడుటకు వెనుదీయడు. ఇట్లు దాక్షిణ్యమును ఆ దక్షిణ నాయకుడు చూపు చుండును శ్రీకృష్ణుని మించిన దక్షిణ నాయకుడు ప్రపంచమునసే మరొకడుండబోడు. 4. రోదిషి అనుశబ్దము వలన నాయకుడు వచ్చినప్పుడాతనిని కోపముతో ధిక్కరించుట చే నాతడు వదలి పోవుట వలని పశ్చాత్తాపముతో కాని, తనమీద ఇదివఱకున్న ఆ గూఢ ప్రేమను తన కతని దూరము చేసిన నాయిక దూషింప జేసినదను తాపముతో గాని అమె యేడ్చుటను చెప్పును. ఇక ముందు కూడ నాయకుని పట్ల నీ ప్రవర్తనమును మానుకొనకున్నచో జీవితమంతయు నితోధికముగా సేద్వగలవను నర్థమును కూడ వ్యంగ్యమొనరించును. ఒకే క్రియనొకే శ్లోకమున రెండలంకారముల(లట్‌ల్రుట్) లో ప్రయోగించుట అరుదుగానే కన్పించును. 5. ఈ శ్లోకము నందును అనుమానాలంకారమున్నది. ఈ శ్లోకమందలి గుణము ప్రసాదము. అలంకారములు కావ్యకన్య యొక్క శబ్దార్థ శరీరము నలంకరించును. అలంకారముల కన్న గుణములు అభ్యర్థితములు. అలంకారములు బహిరంగ సంబద్ధములు (సంశ్లిష్టములు), గుణము లంతరంగ సంబద్ధములు, అను మాటలు లోకమునందువలె కావ్య ప్రపంచము నందును చెల్లును. కావున అలంకారములు లేని కావ్యము రచింపనగును. కాని నిర్గుణమైన కావ్యము రచింపరాదు. అది సహృదయులకు అసలే రుచింపదు. రసప్రధాన కావ్యమున అలంకారముల కంగభావమే సంపాదింపవలెను. కాని ప్రాధాన్యమును సంపాదింప జేయకూడదు. అలంకారములకన్న గుణములకు అధికమైన స్థానము

కలదు. నిరలంకార వ్యక్తిని సహింప వచ్చును, గాని నిర్గుణ వ్యక్తిని సహింపలేము. అలంకారము వాచ్యముగా గాని వ్యంగ్యముగా గాని ఎట్లున్నను అది అంగమే కావలెను. రసము అలంకార్యము కావున తదనుగుణముగా అలంకార ముండవలెను. రస ప్రధాన కావ్యమున యమకాది శబ్దాలంకారము లుండరాదు. అవి రసప్రతీతి భంజకములు కావున మహాకవులు వానిని ప్రయత్న పూర్వకముగా నిబంధించుట కిష్టపడరు. 6. వృత్తము శార్దూల విక్రీడతము.

అవ॥ పై శ్లోకమున సహచరి నాయికకు చేసిన యుపదేశము వర్ణింప బడినది. ఈ శ్లోకమున సహచరి నాయకునితో నిష్ఠూరము లాడుట వర్ణింపబడు చున్నది.

శ్లో॥ దత్తోఽస్యాః ప్రణయస్త్వయైవ భవతైవేయం చిరం లాలితా
దైవాదద్య కిల త్వమేవ కృతవానస్యా నవం విప్రియమ్।
మన్యుర్దుస్సహ ఏవ యాత్యుపశమం నో సాన్త్వవాదైః స్ఫుటం
హే నిస్త్రింశ విముక్త కంఠకరుణం తావత్సఖీ రోదితు॥ 6

ప్ర॥ త్వయా ఏవ- నీచేతనే; అస్యాః- ఈమెకు; ప్రణయః- ప్రేమ; దత్తః- ఈయబడినది; భవతైవ- నీచేతనే; ఇయమ్- ఈమె; చిరమ్- చిరకాలము; లాలితా- లాలింపబడినది; దైవాద్- దైవవశమున; అద్య- నేడు; త్వమ్ఏవ- నీవే; అస్యాః- ఈమెకు; నవమ్- కొత్త; విప్రియమ్- అప్రియమును; కృతవాన్కిల- చేసినవాడవైనావు గదా! దుస్సహఏవ- సహింపరానిదేయైనను; అస్యాః- ఈమె యొక్క; మన్యుః- తాపము; సాన్త్వవాదైః- ఊరడింపులచేత; ఉపశమమ్- శాంతిని; నోయాతి- పొందదు (అనుట); స్ఫుటమ్- స్పష్టమే; హే- ఓ; నిస్త్రింశ- నిర్దయుడా; విముక్త కంఠకరుణమ్- జాలికలిగించునంత బిగ్గరగా; సఖీ- సఖి; తావత్- అంతవరకు; రోదితు- ఏడ్చుగాక!

తా॥ ప్రేమ యనగా నేమో తెలియని నాస్నేహితురాలికి; క్రొత్తగా ప్రేమ యన నేమో తెలిపినావు. చాలా కాలమామెను ప్రేమతో లాలించినావు. ఈనాడు నీవే ఆమెకు అప్రియమును కలిగించుట దైవికమను కొందును. ఊరడింపుల చేత ఆమె దుస్సహమైన తాపము శాంతించునట్లు లేదు. నీవు నిర్దయుడవు. జాలి కలిగించు నంత బిగ్గఱగా ఆమె యేడ్చిన యేడ్చుగాక!

వి॥ 1. ఒకతెను కామించిన పురుషుడు కొంతకాలమామెను లాలించి కొత్తమోజు తీరగనే మరొకతెతో ప్రణయ కలాపము సాగించినట్లు భావించిన ఆ నాయిక పంపగా నో లేక స్వయముగానో ఆమె సహచరి వచ్చి నాయకునితో పలికిన నిష్ఠుర వాక్యములీ శ్లోకమున నున్నవి. నీవు మొగవాడవు. ఇచ్చకములాడి ఆమెను ప్రేమించి నట్లు

నటించి ఆమెలో ఆశలు రేకెత్తింప జేసి మోజు తీరగానే క్రొత్త నాయికతో సరసము సాగించు చున్నావు. నేనెంత ఊరడించినను ఇతర నాయికతో సంబంధ మును వీడనంత వఱకు ఆమె తాపము తీరునది కాదు. ఆమె అంత దిగ్గఱ గా జాలిగా నేడ్చినను నీ మనసు కొంచెమైనను కరుగదు. నీవా క్రొత్తనాయికతో విహరించుట మానవు; అనునర్థమును వ్యక్తమొనరించు సఖిమాటలలో ఈర్ష్యా విరహమే ధ్వనించు చున్నది. 2. నీవు స్వయముగా ప్రేమించి చాలాకాలము లాలించి ఈనాడు విముఖుడ వైనావనగా నది నీ తప్పని నేననుకొనను. అది కేవలము దైవికమే; అనునర్థము 'దైవాత్' అను పదముచే తెలియబడుట మరల నాయికాభి ముఖ్యము కల్పించు సహచరీ ప్రయాసమును ఆమె వాగ్వైదగ్ధ్యమును వ్యంజింపజేయు చున్నది. 3. కార్య కారణ ముల విరోధము( నీవే ప్రేమించి లాలించి ప్రేమకు విరుద్ధముగామరొకకామిని ప్రేమించుట) వర్ణింపబడుటచే నీ శ్లోకమున విషమాలంకార మున్నదని అర్జున వర్మదేవుడు వ్యాఖ్యానించినాడు. 4. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పై శ్లోకమున నాయకుని వైముఖ్యము వలన కలిగిన నాయికా దుఃఖము వర్ణింపబడినది. ఈ శ్లోకమున ప్రయత్నించియు నా యనుమానమును తొలగింపలేని నాయకుని దైన్యము, నాయిక మొండి తనమును మందలించుట నాయిక యొక్క ప్రధాన సఖి వాక్యములలో వర్ణింప బడుచున్నది.

శ్లో॥ లిఖన్నాస్తే భూమి మ్బహిరవనతః ప్రాణ దయితో
నిరాహారా స్సఖ్యః సతతరుదితో చ్ఛూననయనాః।
పరిత్యక్తం సర్వం హసితపఠిత మ్పంజరశుకై
స్తవావస్థా చేయం విస్సృజ కఠినే మానమధునా॥ 7

ప్ర॥ కఠినే- ఓకఠినురాలా!; అవనతః- వంచుకొన్నతలగల; ప్రాణ దయితః - ప్రాణ ప్రియుడు; భూమిమ్-నేలను; లిఖన్- వ్రాయుచు; ఆస్తే- ఉన్నాడు; నిరాహారాః - ఆహారమును మానిన; సఖ్యః- స్నేహితురాండ్రు; సతతరుదితోచ్ఛూన నయనాః- నిరంతరము ఏడ్చుటచే ఉబ్బిన నయనములు గలవారై యున్నారు; పంజరశుకైః- పంజరమందలి పెంపుడుచిలుకల చేత; హసిత పఠితమ్- నవ్వుట చదువుట; సర్వమ్- అంతయు; పరిత్యక్తం- విడువబడినది; తవ- నీయొక్క; అవస్థాచ- అవస్థయు; ఇయమ్ - ఇది ( ఇట్లున్నది); అధునా- ఇప్పుడు( అయినను); మానమ్- మానమును; విస్సృజ- విడువుము.

తా॥ నీ ప్రాణ ప్రియుడు బయట తలవంచుకొని నేలరాయుచు నిలిచి యున్నాడు. చెలికత్తెలందఱు ఆహారము మాని యేడ్చి యేడ్చి కనులు వాచి యున్నారు. పంజరము

లందలి చిలుకలు సైతము మౌనమును వహించి యున్నవి. ఇక నీ పరిస్థితియో, ఇట్లు వర్ణింపరానిదైయున్నది. కఠినురాలా! ఇప్పటికైనను మానమును(కోపమును) విడువుము.

వి॥ 1. నాయకులు అందును దక్షిణులు తప్పులు చేయుట, అవి తన ప్రియురాలికి తెలియకుండునట్లు యత్నించుట, అవి చివఱకెట్లో నాయికకు తెలియుట, అది సహింపని నాయిక కోపమునొందుట జరుగుచునే యుండును. పరస్పరము ప్రేమగల వారును అపరాధములు చేయుచునే యుందురు. వానిని సహించుటయో లేక కొంచెము శిక్షించి మరచి పోవుటయో మంచిది. పట్టు విడుపులుండవలెగదా! ఇంత కాఠిన్యము నీకు తగదని ఒక ప్రధాన సఖి నాయికతో చెప్పుమాటలీ శ్లోకమున నున్నవి. 2. నేల వ్రాయుచును నిలచి యున్నాడనుటచేత నాయకుని శూన్యచిత్తత వ్యక్తమగు చున్నది. ఆహారమును మాని సఖులు యేడ్చి యేడ్చి కన్నులు వాచి యున్నారనుట చేత నీవు ఆహారమును తీసికొన్నప్పుడే వారు నీతో కూడి ఆహారమును తీసికొందురను సహోక్త్యలంకారము వ్యక్తమగుచున్నది. నీ యవస్థ యిది యని యవస్థ యెట్టిదో చెప్పకుండుటచేత ఆమె నిట్టూర్పులు, ఆమె కోపము ఆహారమును మానియుండుట మొదలగు నామె ప్రస్తుత పరిస్థితులు ఊహింపబడు చున్నవి. పంజరశుకైః అని చెప్పుట చేత బంధించి యుంచిన పక్షులును మీయిరువురి వియోగము సహింపలేకున్నవని వ్యంగ్యమగు చుండగా మనుష్యులు సహింపలేకుండుటలో వింత యేమున్నది; అనువస్తువు వ్యంగ్యమగుచున్నది. కఠినే ప్రాణదయితః అను పదములు ప్రాణ ప్రియుడు గదా స్వశరీరమున కంటెను ప్రేమింప దగిన వాడుగదా; అతని యందు మానము నిప్పటికిని వీడ కుండుట తగదు, అను అర్థమును వ్యంజింపజేయు చున్నవి. కొండెక్కి దిగిరాని నాయిక కోపమును శిఖరిణి వృత్తమున వర్ణించుట సముచితముగా నున్నది. 3. నీవపరాధము చేసినావని అనను. ఇది దైవికముగానే జరిగినది అని చెప్పుట ప్రధాన సఖి యొక్క వచో వైదగ్ధ్యమును తెలుపుచున్నది.

అవ॥ పై శ్లోకమున పశ్చాత్తప్తుడైన నాయకుని వృత్తాంతము వర్ణింప బడినది. ఈ శ్లోకమున ధృష్టనాయకునెట్లు వశము చేసుకొన వలెనో విదగ్ధయగు సఖి నాయికతో చెప్పు చున్నది.

శ్లో॥నార్యో ముగ్ధశఠా హరన్తి రమణం తిష్ఠన్తి నో వారితా
స్తత్కిం తామ్యసి కించ రోదిషి ముధా తాసాం ప్రియ మ్మా కృథాః॥

కాన్తః కేలిరుచిర్యువా సహృదయస్తాదృక్పతిః కాతరే
కిం నో బర్బర కర్కశైః ప్రియశతైరాక్రమ్య విక్రీయతే॥ 8

ప్ర॥ కాతరే-పిరికిదానా! నార్యః-స్త్రీలు; ముగ్ధశఠాః-పైకిఅమాయకులు లోపల శఠలు; రమణమ్-(నీ) ప్రియుని; హరన్తి-(లాగు) కొనిపోవుచున్నారు; వారితాః-నివారింపబడిన వారయ్యు; నోతిష్ఠన్తి-ఆగకున్నారు; తత్-అందువలన; కిమ్-ఏల; తామ్యసి-బాధపడుచున్నావు; చ-మరియు; కిమ్-ఏల; ముధా-వ్యర్థముగా; రోదిషి-ఏడ్చెదవు; తాసామ్-వారికి; ప్రియమ్-సంతోషమును; మాకృథాః-కలిగింపకుము; కాన్తః-అందగాడు; కేలిరుచిః-క్రీడారసికుడు; యువా-యువకుడు; సహృదయః-సహృదయుడునైన; తాదృక్-అటువంటి; పతిః-(నీ) భర్త; బర్బలకర్కశైః-మోటుగా కఠినముగా నున్న; ప్రియశతైః-వందలకొలది మంచి మాటలచేత; ఆక్రమ్య-వశపరచుకొని; కిమ్ నో విక్రీయతే-ఏలకొనబడకున్నాడు;

తా॥ ఓ పిఱికిదానా! అమాయకముగా కనబడుచు లోపల గూఢముగా నీ కపకారము తలపెట్టు కొందఱు స్త్రీలు నీ భర్తనులాగు కొని పోవుచున్నారు. నావంటి వారు వారించినను ఆగకున్నారు. అందువలన నీవు తపించుట కాని, ఏడ్చుటకాని, ఎందుకు. దీనివలన వారికి మరింత సంతసము కలుగును. నీ భర్త అందగాడు, క్రీడారసికుడు. యువకుడు. సహృదయుడు. అట్టి భర్తను సూటిపోటు మంచి మాటలతో నేల వశపఱచి కొన కున్నావు.

వి॥ 1. ముగ్ధలు అనగా అమాయకురాండ్రు. శఠలనగా గూఢముగా అపకారము చేయువారు. ముగ్ధత్వము, శఠత్వము పరస్పరవిరుద్ధములు. అవి ఒకచో నెట్లుండును? ఉండవు. స్థలభేదమున విరుద్ధములుండ వచ్చును. కావున ముగ్ధత్వము పైన, శఠత్వము లోపల, నున్న స్త్రీలు ముగ్ధశఠలు. కాంతత్వ, కేలిరుచిత్వ, యువత్వ, సహృదయత్వ గుణములు గలవాడై నందున ఎగిరేసి కొని పోవ యత్నించు చున్నారు. నీవేమో పిరికి దానవు. నోటమాట పెకలదు. బాధపడుట, ఏడ్చుట తప్ప నీకేమి చేయను చేతకాదు. నీ బాధ నీయేడ్పు వారికి సంతోషమునే కలిగించును. నీ వాపని యేల చేసెదవు! అట్లు చేయకుము. అట్లు చేయుట వ్యర్థముకూడ. గట్టిగా నిలదీసి లోని ప్రేమను వ్యక్తము చేయుటకు పైకి మోటుగా కఠినముగా నున్న మంచి మాటలతో వశపరచు కొనుము. మంచి మాటలను ధనముల నిచ్చి నీ భర్తను నీవు కొనుక్కొనుము. నీవు మోటుగా కఠినముగా నీ భర్తనపహరించు వారిని మందలించి నీ భర్తను స్వాధీన పఱచుకొనుము. ఇంటు కట్టివేయకుము: బయటికి పోనీయకుము. అను నర్థము

నొసగు నాయిక యొక్క విదగ్ధ సఖి యొక్క మాటలీ శ్లోకమున నున్నవి. 2. బర్బర కర్కశములనగా ఎత్తి పొడుపు నిష్ఠురత కలవి. ఈ మాటలు లోపలి ప్రేమను సూచించు నవిగా నుండవలె. అట్టి మాటలతో నీ భర్తను నీవు కొనుక్కొన వలసి యున్నది. ఈ మాటలు చెప్పుటకు భయపడెదవేల, ఇట్లు భయపడినచో కాంతత్వ, కేలి రుచిత్వ, యువత్వ, సహృదయత్వాది కాంతా స్పృహిణీయగుణములు గల నీ భర్త నీకు దక్కడు. నీవిందుకు సమర్థురాలవు. ఇట్టి భర్తను ఇంతకాలము గుప్పిట నుంచు కొన్న ధన్యురాలవు. ఇప్పుడీ బేలతనమేలనని విదగ్ధ సఖి నాయికతో చెప్పుచున్నది. ఈ మాటలవలన ఇట్టి భర్తను పొందిన ఇన్నాళ్ళు ఇంటకట్టి యుంచిన నాయిక యొక్క ధన్యాత్వము వ్యంగ్యమగు చున్నది. నాలుగు తీయని తిట్లతో భర్తను కొనుక్కొనుమని చెప్పుట చేత పరివృత్త్యలంకార మీ శ్లోకమున నొప్పుచున్నది. 3. ఇతర నాయికలాకర్షించినను నీ పతి సహృదయుడు. కావున నీ నిష్ఠురములను, నిందలను అపార్థము చేసికొనక నీలోని ప్రేమకు పూర్తిగా వశుడై వారి ఆకర్షణలకు లోనుగాకుండ నుండునని సహృదయ శబ్దము వ్యంగ్య మొనర్చు చున్నది.

అవ॥ ఇంతవరకు పై నాలుగు శ్లోకములలో ఈర్ష్యామానవిరహములు వర్ణింపబడినవి. ఈ శ్లోకమున సంభోగ శృంగారమున వాని పర్యవసానము చెప్పబడుచున్నది.

శ్లో॥ కోపాత్కోమలలోల బాహులతికా పాశేన బద్ధ్వా దృఢం
నీత్వా వాసనికేతనం దయితయా సాయం సఖీనా మ్పురః।
భూయోఽ ప్యేవమితి స్ఖలన్మృదుగిరా సంసూచ్య దుశ్చేష్టితం
ధన్యో హన్యత ఏవ నిహ్నుతి పరః ప్రియాన్ రుదత్యా హసన్॥ 9

ప్ర॥ సఖీనామ్-చెలికత్తె యొక్క; పురః-ఎదుట; కోపాత్-కోపము వలన; కోమలలోల బాహులతికా పాశేన-కోమలము చంచలమునైన భుజవల్లీ రజ్జువుతో; దృఢమ్-గట్టిగా; బద్ధ్వా-బంధించి; రుదత్యా-ఏడ్చుచున్న; దయితయా- ప్రియురాలి చేత; వాసనికేతనమ్-నివాసభవనమును; సాయమ్-సాయంకాలము; నీత్వా-కొని పోయి; ఏవమ్-ఇట్లు; భూయాఃఅపి-మరలకూడ; ఇతి-అను; స్ఖలన్మృదుగిరా-తొట్రుపడు మెత్తని మాటతో; దుశ్చేష్టితమ్-చెడ్డపనిని; సంసూచ్య-బాగుగా సూచించి; హసన్-నవ్వుచున్న; ధన్యః-ధన్యుడయిన; నిహ్నుతిపరః-దాచుటతో ఆసక్తిగల; ప్రియాన్-ప్రియుడు; హన్యత ఏవ-కొట్టబడుచునే యుండును.

తా॥ ప్రియుని దుశ్చేష్టితమునకు కోపించిన ప్రియురాలు ఏడ్చుచునే చెలికత్తెల ముందరనే ప్రియుని తన బాహులతికతో గట్టిగా బంధించి, ఇంటికి తీసుకొని పోయి, అతని దుశ్చేష్టితమును సూచించుచు మరలనిట్లు(చేయవుగదా) అను తొట్రుపాటు గల మాట పలుకుచు కొట్టినది. వాడు అపరాధము దాచినాడు కదా, అందుకే ఆమె కొట్టుచున్నప్పుడు నవ్వు చున్నాడు.

వి॥ 1. నాయికకు ప్రియుని దుశ్చేష్టితము తెలిసినది. వాడుదాచినను అది దాగలేదు. ఆమెకు కోపము వచ్చినది. ఆమె తన కోమలలోల బాహులతికతో దృఢముగా చెలులయెదుట బంధించినది. బాహులతిక అనగా సన్నని తీగవలె సన్ననైన భుజము చేత అని అర్థము. ఈ సమాసము ఆమె విరహముతో కృశించి పోయినదన్న వస్తువును వ్యంజింపజేయును. సఖుల యెదుట అనుమాట ఇంతవఱకు ఆమెసిగ్గుతో ఆమె ఈ పని చేయుటకు సాహసింపలేక పోయినది. కాని నేడు సిగ్గును వీడి ఆ పని చేసిన దన్న వస్తువును వ్యంజింప జేయును. ఇట్లుమరల కూడ అనుమాటలు ఒక అసంపూర్ణవాక్యము. వాక్యము పూర్తిచేయ లేక పోవుటకు కారణ ము తొట్రుపాటు. ఎన్ని రాత్రులో ప్రియ విరహముతో గడిపిన నేటి రాత్రి కూడ ప్రియునకెదురు చూచుచునే గడుపవలసి వచ్చునని సాయంకాలమే సిగ్గువీడి, దారికాచి ప్రియునింటికి తన బాహులతికలో బంధించి తెచ్చినది. సాయమ్ అనుమాట ఇంక ఆమె ఆ రాత్రి విరహము వేగజాలదను వస్తువును వ్యంజింప జేయును. కొట్టినదనగా పూవుతోడనో, జడతోడనో అని అర్థము. అంతే కాని ఆమె చీపురు కట్టతో భర్తను సింగారించు ధూర్తకాదు. ధూర్తయైనచో యేడ్వదు. ఈమె యేడ్చుచునే బంధించినది. ఆప్రియుడు ను బంధించినప్పుడు కాని ఇంటికి లాగుకొని వచ్చునప్పుడు కాని పెనుగులాడలేదు. అనగా ఆతడు ఆమె శిక్ష కంగీకరించి యైనను ఆమె పొందు కోరుచున్నాడు. అందుకే మరల ఇట్లు చేయవు కదా, అని అన బోయి సగము వాక్యమే పలికిన ప్రియురాలి తొట్రుపాటును గమనించి దానికి కారణమైన ఆమెలోని ప్రేమకు బహిరంగ సాక్ష్యమైన బాహులతికా బంధనము నంగీకరించి నవ్వుచునే యున్నాడు. 'హసన్' అను పదము నీ యర్థము నంతయు వ్యంగ్య మొనర్చు చున్నది. ఇట్లు గాఢ ప్రేమతో శిక్షింప బడువాడు ధన్యుడే అని కవి చెప్పుటచే నాయికా నాయకులు విరహము ముగిసి సంభోగానంద మున నోలలాడ బోవుచున్నారను వస్తువును వ్యంజింప జేయుచున్నాడు. కవి నాయికానాయకుల విరహమును సంభోగ శృంగారమున పర్యవసింపజేయుట శృంగార రసమును పరిపుష్ట మొనర్చుటయే 'నవినా విప్రలంభేన శృంగారః పుష్టి మశ్నుతే' (వియోగము లేదా విరహము లేక శృంగారముపుష్టి నొందదు)

అని కదా శృంగార రసజ్ఞుల సూక్తి. 2. నాయిక యేక కాలమున భర్త యందు నిగ్రహానుగ్రహముల జూపినది. బంధించిన మాట నిజమే. కాని దేనితో, బాహులతికతో-త్రాటితో కాదు. ఆ బాహువు కూడ లోలము. లోలత్వము ఆమె లోని సాత్త్విక భావోదయమునకు చిహ్నము. కోమల భుజముతో బంధించుట భర్త యెడ నిగ్రహము అనుగ్రహము కూడ. బంధించు నెపమున నాయిక యొక్క స్వయం గ్రహపరిష్వంగము నాయకుని యందనుగ్రహము కదా! మరలనిట్లు అను వాక్యమును పూర్తిచేయలేని ఆమె తొట్రుపాటు వ్యంగ్యము ఆ మాటచే ఆమె నిగ్రహించినదా, అనుగ్రహించినదా అను సందేహము కలుగును. రెండును చేసినదని సమాధాన పెట్టుకొనవలెను. 3. బాహులతికా పాశేన అను సమాసమున రూపకాలంకారమున్నది. దానిని సావయవముగా సాకల్యముగా రూపింపక పోవుట రసతుష్టికే అని ఆనంద వర్ధనుడు చెప్పినాడు. వృత్తము శార్దూల విక్రీడితము. నాయిక అధీరప్రగల్భ.

అవ॥ పై శ్లోకమున నాయిక నాయకుని నివాసభవనమునకు తెచ్చుకొనుట వర్ణింపబడినది. ఈ శ్లోకమున నాయకుడు నాయికను విడిచి దేశాంతర మేగదలచియు, అప్పటి ఆమె విరహాసహనమును గుర్తించి తన ప్రయాణమును మానుకొనుట యిందు వర్ణింపబడుచున్నది.

శ్లో॥ యాతాః కిం న మిలంతి సుందరి! పునశ్చింతా త్వయా మత్కృతే
నో కార్యా నితరాం కృశాసి కథయత్యేవం సబాష్పే మయి।
లజ్జా మంథర తారకేణ నిపతత్పీతాశ్రుణా చక్షుషా
దృష్ట్వా మాం హసితేన భావి మరణోత్సాహ స్తయా సూచితః॥

ప్ర॥ సుందరి! - అందమైన దానా! యాతాః-ప్రయాణమైపోయిన వారు; కిం న మిలంతి-మరలకలసికొనరా; పునః-మరల; మత్కృతే-నాకొఱకు; త్వయా-నీచేత; చింతా-చింత; నకార్యా-చేయదగినదికాదు; నితరామ్-మిక్కిలి; కృశాఅసి-చిక్కియున్నావు; ఏవమ్-ఇట్లు; సబాష్పే-కన్నీరుకల; మయి-నేను; కథయతి-చెప్పుచుండగా; లజ్జామంథరతారకేణ-సిగ్గుతో కలవరమొందిన; నిపతత్పీతాశ్రుణా-గ్రుడ్ల నీరు గ్రక్కుకొన్న(బయటపడకుండ); చక్షుషా-చూపుతో; మామ్-నన్ను; దృష్ట్వా-చూచి; తయా-ఆమెచేత; భావిమరణోత్సాహః-తప్పనిరాబోవు మరణాసక్తి; హసితేన-నవ్వుతో; సూచితః-సూచింపబడినది.

తా॥ ఓ సుందరీ! దేశాంతర మేగిన వారు తిరిగి కలిసికొనరా! నాకొఱకు నీవు చింతించగూడదు. ఈవఱకే నీవు మిక్కిలి చిక్కియున్నావు. అని నేను కన్నీటితో చెప్పు చుండగనే సిగ్గుతో కలవర మంది పడుచున్న కన్నీటిని గుడ్లలోనే నిలుపుకొని ఆమె నన్ను చూచి నవ్వినది. ఆ నవ్వున ఇకనేను మరణించక తప్పదు. అను విషయము సూచించబడినది.

వి॥ 1.దేశాంతర మేగ దలచిన నాయకుడు నీవు మరల మనము కలిసి కొందుమో లేదో అని చింతించకుము.ఎందఱెందఱు దేశాంతర మేగినవారు తిరిగి వచ్చి తమ నాయికలను కలిసి కొనుట లేదు. ఇది వరకే కృశించి యున్న నీవు ఈ చింతలో మరింత కృశించెదవు గాన చింత మానుము. అని తన నాయికతో చెప్పినాడు. చెప్పునప్పుడు నాయకుని కన్నులలో సైతము నీరు తిరిగినది. అప్పటికే కారుచున్న కన్నీరు కారకుండ గుడ్లనీరు గుడ్లలోనే గ్రుక్కుకొనుచున్నది. నాయిక ఆమె విచిత్రముగా నవ్వినది. దాని యర్థము ప్రియునకెట్లు తోచినది? నీవు దేశాం తరమునకు బయలు దేరిన పిదప నేను తప్పక మరణించుటకే యుత్సహింతు నన్నట్లు నాయకునకు తోచినది. ఈ అర్థమామె నవ్వుచే సూచించ బడినది. 2. చూపులతో చూచి అనికాక చూపుతోచూచి అని యిక్కడ ఏకవచనాంతముగా చక్షుః శబ్దమున్నది. ఈ నిర్దయుడు పట్టిన పట్టు విడువడు. ఎదుటి వారేమై పోయినను సరే. అట్టివానిని ప్రయాణ మును మానుడు అని చెప్పి చూచిన ప్రయోజనములేదను నిరాశతో చూచుటనేకవచనము వ్యంగ్యమొనరించుచున్నది. నిపతత్పితాశ్రుణా అను చక్షుర్విశేషణ ము పడుచున్న తాగబడిన కన్నీరు కలది అనునర్థము నొసగును. ఈ అర్థముచేత ఈ మొండివాని సేడ్చి, కన్నీరు కార్చియు దేశాంతర గమనమును మానుపజాలక చచ్చుటకు నిశ్చయించుకొన్న నాయిక కన్నీరు కార్చలేదు. ప్రయాణ కాలమున కన్నీరు కార్చుట అమంగళము. అదికాక చచ్చుటకు నిశ్చయించు కున్నవారు కన్నీరు కార్చరు. అను వస్తువు వ్యంగ్య మగుచున్నది. కృశాఅసి (కృశించి యున్నావు) అను శబ్దములు దేశాంతరము పోవుచున్నను చెప్పునప్పుడు కలిగిన కృత్యమును చెప్పును అసి వర్తమానార్థకము గదా! 3. నాయిక నాయకుడు దేశాంతరమునకేగుచున్నానని చెప్పినప్పుడు మామూలుగానే నొంటరిగా విడచి యుండ వలెనన్నది. మరల నీవత్తువో, రావో. దేశాంతరమునకేగుట యనగా దాదాపు శాశ్వత వియోగమే. ప్రయాణ సాధనము లంతగా లేవు గదా! అదిగాక పరదేశమున నిన్ను మరొక స్త్రీ తగుల్కొన్న నేనిక జ్ఞాపకమునకు వచ్చుట కల్లగాదా! అని

ప్రశ్నించినది. దానికి సమాధానముగా నాయకుడు దేశాంతరమునకేగినవారందరు తిరిగి వచ్చుట లేదా మరల నేను రానను చింత నీకు వలదు. అని చెప్పినాడు. నాయకుని ఉత్తరము వలన నాయిక ప్రశ్నమూహించు కొనదగినదై యుండుటచే నీశ్లోకమున నుత్తరాలంకార మున్నది. రాబోవు ప్రవాస విప్రలంభ శృంగార రసమీ శ్లోకమున ధ్వన్యమానమగు చున్నది. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పై శ్లోకమున ప్రతిష్ఠానోపరోధ రూపమైన ఉపాయాక్షేపము చెప్ప బడినది. ఈ శ్లోకమున అనిష్టవస్తూద్దేశ కృతప్రయత్న విపరీత ఫలోత్పత్తి రూప యత్నా క్షేపము చెప్పబడుచున్నది.

శ్లో॥ తద్వక్త్రాభిముఖ మ్ముఖం వినమితం దృష్టిః కృతా పాదయో
స్తస్యాలాప కుతూహలా కులతరే శ్రోత్రే నిరుద్ధే మయా।
పాణిభ్యాం చ తిరస్కృతః సపులకః స్వేదోద్గమో గండయోః
సఖ్యః కిం కరవాణి యాంతి శతధా యత్కంచుకే సంధయః॥ 11

ప్ర॥ సఖ్యః- చెలికత్తెలారా; మయా- నాచేత; తద్వక్త్రాభిముఖమ్- ఆతని ముఖమున కెదురుగా; ముఖమ్- ముఖము; వినమితమ్- వంచబడినదిగా; పాదయోః- పాదముల యందు; దృష్టిః- చూపు; కృతు- చేయబడినది; తస్యాలాపకుతూహలాకులతరే- ఆతని మాటలు వినుకుతూహలముచే మిక్కిలి వ్యాకులత చెందిన; శ్రోత్రే- చెవులు; నిరుద్ధే- అడ్డగింపబడినవి; గండయోః- చెంపలయందలి; సపులకః- రోమాంచముతో కూడిన; స్వేదోద్గమః- చెమట పట్టుట; పాణిభ్యాంచ- చేతులచేతను; తిరస్కృతః- తిరస్కరింపబడినది; యత్- ఎప్పుడు; కంచుకే- రవికయందలి; సంధయః- అతుకులు; శతధా- నూరుముక్కలుగా; యాంతి- పోవుచున్నవి; తదా- అప్పుడు; కిం కరవాణి- ఏమి చేయుదును;

తా॥ చెలికత్తెలారా! ఆతని ముఖము నాకభిముఖమై యున్నప్పుడు ముఖమును వంచినాను, ఆతనిని చూడకుండ పాదముల యందే చూపు నిలిపినాను. ఆతని మాటలు వినుటకు చెవులుత్సాహమును చూపగా వానిని మూసికొన్నాను. పులకించిన చెంపల యందు చెమట పట్టి యుండగా తుడిచి కొన్నాను. రవికలోని అతుకులు ఊడి పోవుచున్నప్పుడు నేనేమి చేయుదును.

వి॥ చెలికత్తెలు నాయికకు నాయకునికి వెంటనే లోబడవద్దని బెట్టు చూపవలెనని చెప్పినారు. కాని నాయిక నాయకుని చూడగానే ఆతనికి లోబడి పోయినది. ఆ పిమ్మట మేము చెప్పిన దేమి? నీవు చేసిన దేమి? యని చెలికత్తెలు కొంచెము కోప

పడినారు. వారికి నాయిక చెప్పిన సమాధానమీ శ్లోకమున నున్నది. 2. నామానము ను అనగా కోపమున కలిగిన వైముఖ్యమును ప్రదర్శించుటకు నేనేమేమి చేయలేదు. ఆయన ఎదురుపడగానే తలవంచి కొన్నాను. నా ముఖమును చూడగానే ముద్దు పెట్టుకొనబోవును. దానిని వారించుటకు తలవంచినాను. అతనిని చూచినచో నాకు తనపై ఆసక్తి యున్నదని తెలియును. అట్లు తెలియకుండుటకు నేనాతని వైపు చూడకుండ నా పాదముల పైననే నిలిపినాను. అతని మాటలు వినవలెనని యున్నను అతని నర్మవచనములు వినకుండ చెవులు మూసి కొన్నాను. రోమాంచముతో కూడిన చెంపలకు చెమట పట్టగా అది నాయకునకు తెలియకుండుటకై వెంటనే చేతులతో తుడిచివైచినాను. ఇన్ని చేసియు అతని సంభోగమును తప్పించుకొన లేక పోయితిని. అతని చూడగనే నా రవికలోని గుడ్డలముక్కలు కుట్టి అతికిన అతుకులు నూర్ల ముక్కలగు చుండగా నేనేమి చేయుదును అను వస్తువీ శ్లోకమున వ్యంగ్యము. అందుచే నాయికా నాయక సంభోగ శృంగారము ధ్వన్యమాన మగుచున్నది. 3. నాయికకు నాయకుని యందు గాఢాసక్తి యున్నది. అతని సంయోగమునకెదురు చూచుచున్నది బెట్టు చేయకున్న చులకనై పోవుదునని చెలికత్తెలు చెప్పినారు. కాని అతని ముఖము కనబడగానే తనకాతని భోగమిష్టమే యని అంగీకారమును చూపుటలో సిగ్గు అడ్డు పడి తలవంచినది. కాని వైముఖ్యముతో కాదు. మానముతో కాదు. అతడు కనబడగానే బెట్టు చేయవలెనన్న చెలికత్తెమాట లామెకు జ్ఞప్తికే రాలేదు. పాదముల యందు దృష్టినిలిపి నానని చెప్పినదికాని ఎవరి పాదములందో చెప్పలేదు. ఆరాధనా భావముతో నాయకుని పాదములందె దృష్టి నిలిపినది. రసికుడైన నాయకుడది గమనించియే యామెను కౌగిలించుకొన్నాడు. తనకాతని మాటలు వినవలెనని యున్నది. బెట్టు చేసితినని చెప్పుటకు చెవులు మూసికొన్నట్లు చెప్పినది. కాని చెంపలపై పట్టిన చెమట తుడుచుకొనునెపముతో అతని చాటు ప్రసంగములను విన్నది. లోని సాత్త్విక భావములైన రోమాంచ స్వేదములు చెంపలపై కనబడుచునే యుండగా రసికుడైన నాయకుడు గ్రహింప లేకపోవునా! సంభోగాసక్తి తీవ్రమయినప్పుడు స్తనజృంభణమనివార్యము. ముక్కలు ముక్కలైన రవిక అక్కడ నిలుచునా! నాయకున కు రవిక విప్పు శ్రమయే కలుగలేదు. తలవంచి నానని చెప్పి అతని చూడనే లేదని పాదములందు దృష్టి నిలిపినానని చెప్పి క్రీగంటు కూడా చూడలేదని అతని మాటలు వినవలెనని యున్నను చెవులు మూసికొన్నానని చెప్పి సఖులందు తనకున్న గౌరవమును చాటినది. రోమాంచస్వేదములు కలుగుటను చెప్పుటచే నాలో అట్టి సాత్త్విక భావములు పెంపొందించు చుండగా అతనితో భోగింపకుండుట నా వశమా!

యని తనయశక్తతను తెలిపినది. మొత్తము మీద మీరు చెప్పినట్లు మానమును ప్రదర్శింప వలెనని యే యనుకొన్నాను కాని నా అవయవములు సహకరింపలేదు అని తేల్చినది. ఈ యర్థము నంతయు వ్యంగ్యమొనర్చు ప్రసంగముచేసిన నాయిక వైదగ్ధ్యము విస్పష్టము. మీరు చెప్పినట్లు మానమును ప్రదర్శించుటకు నేనుచేసిన యత్నమంతయు వ్యర్థమయినదని చెప్పుటచే యత్నాక్షేప మిందున్నదని వ్యాఖ్యాత అర్జునవర్మదేవుడు చెప్పినాడు. ముఖమును వంచినాననుమొదటి వాక్యమున ఆమె వివక్షారసమును తిరస్కరించినది, కాని నిషేధించ లేదని, మొదటి పాదమునందలి ముఖనయన పాదదృష్టులచే దిదృక్షా రసనిషేధమునే చేసినదని ఆ వ్యాఖ్యాత స్పష్టీకరించినాడు. నాయిక సమాధానములచే చెలికత్తెల పలుకు లూహింప బడు చున్నందున ఈ శ్లోకమున కూడ ఉత్తరాలంకారమే యున్నదని చెప్పినాడు. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పై శ్లోకమున ప్రౌఢ నాయిక యొక్క వైదగ్ధ్యమును ప్రదర్శించు వచనములు చెప్పబడినవి. ఈ శ్లోకమున ముగ్ధావచనములు చెప్పబడుచున్నవి.

శ్లో॥ ప్రహరవిరతౌ మధ్యే వాహ్నస్తతోఽపి పరేణ యా
కిముత సకలే యాతే వాఽహ్ని ప్రియ త్వమిహైష్యసి।
ఇతి దినశత ప్రాప్యం దేశ మ్ప్రియస్య యియాసతో
హరతి గమన మ్బాలాలాపై స్సబాష్పగల జ్జలైః॥ 12

ప్ర॥ అహ్నః-పగలు యొక్క; బాలా-చిన్నది; ప్రహరవిరతా-మొదటిజాము ముగియుగానే(గాని); మధ్యేవా-నడిజామునగాని; తతఃఅపి-దానికంటెను; పరేణయా-అవతలనున్న జామునగాని; ఉత-లేక; సకలే-సమస్తమైన; అహ్ని-పగలు; యాతే-పోగానేగాని; ప్రియ!-ప్రియుడా; త్వమ్-నీవు; ఇహ-ఇక్కడికి; ఆఏష్యసి-రాగలవు; ఇతి-అని; దినశత ప్రాప్యమ్-నూరుదినములకు చేరదగిన; దేశమ్-దేశమును; యియాసతః-పోదలిచిన; ప్రియస్య-ప్రియుని యొక్క; గమనమ్-ప్రయాణమును; సబాష్పగలజ్జలైః-కన్నీటితో కూడిన; ఆలాపైః-మాటలచేత; హరతి-ఆపుచున్నది.

తా॥ నాయకుడు నూరు దినములకు చేరదగిన దేశమునకు బయలు దేరగా ఈ జాము చివర కో రెండవ జాము నందో లేక మూడవజామునందో చివరకు దినము యొక్క అంత మందో నీవు రాగలవని కన్నీరువిడచుచు పలికిన మాటల చేత అతని నాయిక అతని ప్రయాణమునే మాన్పినది.

వి॥ 1. బాలా అనుటచేత ఆ నాయక ముగ్ధ అని వ్యంజింప బడుచున్నది. నూరు దినములకు చేరదగిన దేశమును బయలుదేరిన వాయకుడు ఆ దినమున మొదటి జాము ముగియగానే గాని రెండవ జామునగాని మూడవ జామునగాని చివఱకు నాల్గవ జామున గాని చివఱకు ముగిసిన పిదప అనగా దినము యొక్క అంతమునందు రాగలుగుట యెట్లు అని ఆలోచింప లేక అమాయకముగా ఆతని రాకనూహించుటచే నీ శ్లోకములలోని వచనములు ముగ్ధ వచనములు. సబాష్పగలజ్జలైః ఆలాపైః అనుటచే ఆమె యొక్క ప్రియవిరహా సహిష్ణుత వ్యంగ్య మగుచున్నది. బయలుదేరు చుండగనే కన్నీరు విడుచు చున్న దనగా ఆపైన తన విరహమును సహింపలేదని నాయకుడు ప్రయాణ మునే మానుకొని నాడను వస్తువీ శ్లోకమున వ్యంగ్యము. 2. ఈ శ్లోకమున విప్రలంభ శృంగారరసోత్కర్ష హేతువైన జాతి అను అలంకార మున్నదని వ్యాఖ్యాత అర్జునవర్మదేవుడు చెప్పినాడు. హరిణీ వృత్తము.

అవ॥ పై శ్లోకమున నాయిక తన విరహమును సహింపజాలదను కారణ మున నాయకుని దేశాంతర గమన నివృత్తి చెప్పబడినది. ఈ శ్లోకమున దేశాంతరగత నాయకుని విరహావస్థ వర్ణింపబడుచున్నది.

శ్లో॥ ధీరం వారిధరస్య వారి కిరతః శ్రుత్వా నిశీథే ధ్వనిం
దీర్ఘోచ్ఛ్వాస ముదశ్రుణా విరహిణీ మ్బాలాం చిరం ధ్యాయతా।
అధ్వన్యేన విముక్త కంఠ మఖిలాం రాత్రిం తథాక్రందితం
గ్రామీణైః పునరధ్వగస్య వసతిర్గ్రామే నిషిద్ధా యథా॥ 13

ప్ర॥ నిశీథే- అర్ధరాత్రమున; ధీరమ్- మెల్లగా; వారి- నీరమును; కిరతః- విడచు చున్న; వారిధరస్య- మేఘము యొక్క; ధ్వనిమ్- ధ్వనిని; శ్రుత్వా- విని; చిరమ్- చాల కాలము; ఉదశ్రుణా- కన్నీరు విడుచుచున్న; విరహిణీమ్- విరహముగల; బాలామ్- (తన) చిన్నదానిని; ధ్యాయతా- చింతించుచున్న; అధ్వన్యేన- బాటసారి చేత; విముక్త కంఠమ్- బిగ్గఱగా; అఖిలామ్- మొత్తము; రాత్రిమ్- రాత్రి; గ్రామీణైః పునః- జాన పదులచేత మాత్రము; అధ్వగస్య- బాటసారి యొక్క; వసతిః- నివాసము; యథా- ఎట్లు; నిషిద్ధా- నిషేధింపబడునో; తథా- అట్లు; క్రందితమ్- ఏడ్వబడినది.

తా॥ దేశాంతరము నందలి యొక గ్రామమున బాట సారి యొకచోట పరుండి అర్ధరాత్రమున తొలకరి మేఘము నీరు చిలుకరించుచు గర్జింపగా ఆ ధ్వనికి మేల్కాంచిన నాయకుడు క్రొత్తగా కాపురమునకు వచ్చిన తన భార్యను తలచుకొని నిదురరాక బిగ్గఱగా నిట్టూర్పులు విడచుచు నేడ్చినాడు. ఆ ధ్వని విని గ్రామీణులు నీవీ యూర నుండరాదని నిషేధించినారు.

వి॥ వారిముచః (నీరు విడచుమేఘము) అని యనక వారి ధరస్య (నీరుధరించు మేఘము) అను నర్థమొసగు శబ్దమును ప్రయోగించుటచే నీరు విడచు చున్నచో నెప్పటికైన నీరయి పోయి విడుచుట ఆగిపోవునని అట్టి మేఘమిది కాదని, ఇది నీరును ధరించియే యుండుటచే నీరు విడుచుట ఆగి పోవదను అర్థము వ్యంగ్యమగు చున్నది; అని వ్యాఖ్యాత అర్జునవర్మ దేవుడు చెప్పినాడు. 2. నీశీథే అని చెప్పుట వలన పగటి పూట ఎవరో యొకరితో మాట్లాడుచు విరహవ్యథ నపనయించుకొన వచ్చును. అట్టి అవకాశము లేని సమయమిది. అని విరహము యొక్క రాత్రియందలి అన పనేయత వ్యంజింపబడుచున్నది. ఆ రాత్రి యేమియు చేయగలిగినది లేక పోవుటచే దాని తొలగించు కొన లేని యసమర్థతచే నేడ్చుట తప్పని సరియైన దను నర్థము వ్యంగ్యమగు చున్నది. వర్షపాతముతో కూడిన అర్థరాత్రి చీకటి ప్రియురాలి కొరకు నాయకుడు వెళ్ళలేక పోవుటకు కారణము వ్యంజింపజే యుచున్నది. 3. 'బాలామ్' అనుట చేత ఇది నాయకుని మొదటి విరహమని ఇంతకు ముందిట్టిది అనుభవమునకు వచ్చి యుండక పోవుటచే నిది నాయకునకత్యంతము బాధించుచున్నదను నర్థము వ్యంగ్యమగును. 4. 'విరహిణీమ్' అనుటచేత పురుషుడనైన నాకే ఈ విరహమింత దుర్భరముగా నుండ నామెకీ విరహమెంత బాధాకరముగ నున్నదో! అని నాయకుడు ఆమె విరహమును గూర్చి చింతించుటను వ్యంజింపచేయును. 5. అఖిలామ్ రాత్రిమ్ చిరమ్ అనుట చేత అర్ధరాత్రి గడచిపోగా మిగిలిన రాత్రియే దీర్ఘముగా గడచు చున్న దను వస్తువు వ్యంగ్యమగు చున్నది. 6. గ్రామీణైః అనుటచేత దేశాంతరవాసాదు లోనర్చు నాగరికుల విరహవ్యథల నెఱుగని గ్రామీణులకే నాయకుని విరహాక్రందనము భరింపరానిదై యున్నది కావున నాగరికుల నత్యధికముగా బాధించునను నర్థము వ్యంగ్యమగును. 7. ఈ శ్లోకముననే యలంకారము లేదని అమరుక శతకమున చాల శ్లోకములలో అలంకారములు లేకున్నను రసాభివ్యక్తికి చమత్కారము కలుగు చున్నదని వ్యాఖ్యాత అర్జున వర్మదేవుడు చెప్పినాడు. ఒక్కొక్కతరి అలంకార నిబంధన తత్పరత ప్రకర్షహేతువుకాదని ఆతని ఉపాధ్యాయుడు చెప్పినాడు. 8. వృత్తము శార్దూల విక్రీడితము. 9. ధీరంవారిధరస్యవారి కిరతః అను ప్రథమపాదమున వృత్త్యను ప్రాసమను శబ్దాలంకారమున్నదని చెప్పవచ్చును. కాని అదిశబ్దాలంకారము కావున రసప్రతీతి కేమంత సహకారి కాదు. కావున అది ఉన్నను లేకున్నను సమానమే.

అవ॥ పై శ్లోకమున నాయుకుడు ప్రియురాలి కడకు వెడలలేక బాధపడుట వర్ణింప బడినది. ఈ శ్లోకమున ప్రియుడు నాయిక కడకు వెడలినను ఆమె గాఢ మానము కారణముగా బాధపడుట చెప్పబడు చున్నది.

శ్లో॥ కుతో దూరాదేవ స్మిత మధుర మభ్యుద్గమవిధిః
శిరస్యాజ్ఞా న్యస్తా ప్రతివచనవత్యానతిమతి।
న దృష్టేః శైథిల్యం మ్మిలన ఇతి చేతో దహతి మే
నిగూఢాంతః కోపా కఠిన హృదయే! సంవృతిరియమ్॥ 14

ప్ర॥ కఠినహృదయే- కర్కశమనస్కురాలా! దూరాత్ఏవ- దూరమునుండియే; స్మిత మధురమ్- నవ్వుతో తీయనైనట్లు; అభ్యుద్గమవిధిః-ఎదుర్కొనుట; కుతః- ఏల (చేయబడుచున్నది); ప్రతివచనవతీ- బదులుపలుకు చున్నదై; ఆనతిమతి- మిక్కిలి వంగిన; శిరసి- శిరమున; ఆజ్ఞా- ఆజ్ఞ; న్యస్తా- ఉంచ బడినది; దృష్టేః- చూపుయొక్క; మిలన- కలయికయందు; శైథిల్యమ్- జారుపాటు; న- లేదు; ఇతి- ఈవిధమైన; ఇయమ్- ఈ; నిగూఢాన్తఃకోపా- లోనదాచుకొన్న కోపముగల; సంవృతిః- ఆకార గుప్తి; మే- నాయొక్క; చేతః- మనస్సును; దహతి- కాల్చుచున్నది;

తా॥ ఓ కఠిన హృదయురాలా! దూరము నుండియే తీయనినవ్వుతో నెదురు కొను చున్నావేల? బదులిచ్చుచునే నా ఆజ్ఞను మిక్కిలి వంచిన తలపై ధరించు చున్నావు. చూపును కలుపుటలో జారుపాటేమియులేదు. కాని నీయీలోపల కోపము దాచుకొన్న ఆకారగోపనము నామనస్సును కాల్చి వేయుచున్నది.

వి॥ 1. నాయకుడు రాగానే లేచి నిలువబడి దూరము నుండి యే నాయిక ఆహ్వానించినది. నాయకు డాజ్ఞాపించినపుడు బదులు పలుకుచునే వంచిన తలపై నాయకుని ఆజ్ఞను ధరించినది. చూపును కలుపుట మామూలుగానే యున్నది. తొట్రుపాటేమియులేదు. మార్పేమియులేదు. లోపల కోపమును దాచుకొన్న నాయిక యొక్క ఈ ఆకారగోపన మీ శ్లోకమున వర్ణింపబడినది. 2. నాయుకుడు వచ్చినప్పుడు తన ప్రవర్తనమున మార్పేమియు లేనట్లు నాయిక నటించుచున్నది. నాయకుని దగ్గఱకు చేరి కౌగిలించుకొన లేదు అని దూరాదేవ అను పదములు తెలుపు చున్నవి. నాయకుడేదేని ఆజ్ఞ యొసగినప్పుడు మంచిదని బదులు పలుకుట చాలదన్నట్లు తలను మిక్కిలి వంచి దానిని మోయుట చేత ఆమె అతి వినయమును చూపు చున్నదని వ్యంగ్యమగును. చూపుకలుపుటలో శైథిల్యము లేదనుటచే నాయకుని హృదయముతో తన హృదయమును నాయిక కలుపలేక పోవు చున్నదని వ్యక్తమగును. ఆమె యెంతగా ఆకారగోపనమొనరించినను ఆమె హృదయమున గూఢముగా కోపమును దాచుకొని పైపైన ప్రేమను ప్రదర్శించు చున్నదని నాయకుడు గ్రహించి పలికిన మాటలీ శ్లోకమున నున్నవి. 3. నాయిక కోపమునకు కారణము నాయకుడు పరస్త్రీ

లోలుడైనాడని ఎవరో చెప్పినచాడీలు; ఆమెను కఠినహృదయురాలా అని నాయకుడు సంబోధించినాడు. కోపముచే ఎప్పుడు లేనంతకఠినముగా నీహృదయము మారి పోయిన దేమను నాయకుని ఆశ్చర్యమును వ్యక్తపరచు చున్నది. 4. దూరము నుండియే నాయకు నాహ్వానించుట అన్యాంగనా స్పర్శ కళంకితమైన అతని శరీర స్పర్శను సహింప లేక పోవుటను తెలుపును. ఇంతకు ముందెంతగానో నాకు వశీభూతుడై యున్న నాయకుడిప్పుడు అన్యస్త్రీ లాలసుడైనను నేనాతని ననువర్తించు చున్నాను. బ్రతుకుతునే యున్నాను. నేను నేనేనా? అను ఆమె చేయగలిగిన దేమియులేని నిస్సహాయ్యతను వ్యక్తమొనర్చుటకు నాయకున కుపచారములు చేయుచున్నదే కాని ప్రీతితో కాదు. అది యథార్థమునకు ఎదురు కొనుటయే కాదు. అది కేవల మాకోపము మాత్రమే. 5. నా హృదయము దహించుకొని పోవు చున్నదనుట చేత నాయికకు నామీద అనుమానము కలిగి నందుకే ఇంతగా కుమిలిపోవు నాయందు అన్యాంగనా సంగమమారోపించుట న్యాదురదృష్టమనుటను వ్యంజింపజే యును. కోపమును హృదయమున పాదు కొల్పుట చేత( పాతుటచేత) హృదయము కోమలమైనను కఠినముగా మారినది. రాతిని పాతుటచే మృదుభూమి కఠినమగుట స్వాభావికము గదా! ఆమె అత్యంతము తలవంచినది. మిక్కిలి బరువైనవస్తువును శిరమున మోయుట అప్పుడు బాగుగా వంగుట జరుగును. ఇప్పుడు భర్త ఆజ్ఞ బరువుగా నుండుటచే ఆమె తలను పూర్తిగావంచినది. భర్త ఆజ్ఞ బరువైన దనగా దానికి కారణము. ఆతనిపై కోపము కలుగుటయే. ప్రేమ యున్నచోట ఎంతటి దుస్తర కార్యము నొనర్పుమను నాజ్ఞయు తేలికగా తల దాల్చుట జరుగును. 6. మిలన మనుటకు బదులుగా మేలన మనుటయుచితము. మిలనశబ్దము సాధువుగా కున్నను రూఢి యున్నది. కావున ప్రయోగింపబడినదని వ్యాఖ్యాత అర్జునవర్మదేవుడు మిలన శబ్దప్రయోగమును సమర్థించినాడు. 7. దూరగమనాదులు హేతువులుగా కోప మనుమేయమై యుండుటచే నీ శ్లోకమున నను మానాలంకార మున్నది. 8. నాయిక ఔదార్యమును ప్రదర్శించిన కారణమున ఈ శ్లోకమున ఔదార్యమను నాట్యాలంకారమున్నదని వ్యాఖ్యాత అర్జునవర్మదేవుడు చెప్పినాడు. 9. నాయిక యొక్క కొండంత కోపము శిఖరిణీ వృత్తమున వర్ణించుట యుచితముగా నున్నది.

అవ॥ పై శ్లోకమున ప్రియుని యందాదరము నటించు కోపకఠిన హృదయ యగు నాయిక వర్ణింపబడినది. ఈ శ్లోకమున కోపమున ప్రియునితో కలహించి అతనిని వెడలి పొమ్మని, అతడు వెడలి పోయిన పిమ్మట పశ్చాత్తప్త యగు కలహాంతరితా నాయిక వర్ణింపబడు చున్నది.

శ్లో॥ కథమపి సఖి క్రీడా కోపాద్వ్రజేతి మయోదితే
కఠిన హృదయః శయ్యాం త్యక్త్వా బలాద్గత ఏవ సః।
ఇతి సరభసం ధ్వస్తప్రేమ్ణి వ్యపేత ఘృణే స్పృహాం
పునరపి హతవ్రీడం చేతః కరోతి కరోమి కిమ్॥ 15

ప్ర॥ సఖి- ఓస్నేహితురాలా!; కథమపి-ఎట్లో; క్రీడాకోపాత్- ప్రణయకోపము వలన; వ్రజ- పొమ్ము; ఇతి- అని; మయా- నాచేత; ఉదితే-చెప్పబడగా; సః- ఆ; కఠిన హృదయః- కఠినహృదయుడు; బలాత్- బలాత్కారముగా; శయ్యామ్- శయ్యను; త్యక్త్వా- వీడి; గతఏవ- పోనే పోయినాడు; ఇతి- ఈవిధముగా; సరభసమ్- తొందరపాటుతో; ధ్వస్తప్రేమ్ణి- ప్రేమనుచంపిన; వ్యపేతఘృణే - దయలేని వాని యందు; హతవ్రీడమ్- సిగ్గులేని; చేతః- మనస్సు; పునరపి- మరలకూడ; స్పృహామ్- కోరికను; కరోతి-చేయు చున్నది; కిమ్- ఏమి; కరోమి-చేయుదును.

తా॥ ఓ స్నేహితురాలా! ప్రణయ కోపమున నెట్లో వెడలిపొమ్మనిచెప్పగానే కఠిన హృదయుడైన ఆతడు బలాత్కారముగా శయ్యను వీడి పోనేపోయినాడు. ఈ విధముగా ప్రేమను చంపిన దయలేని వానిని ఇంకను నా మనస్సు కోరుచునే యున్నది. ఏమిచేయుదును?

వి॥ 1. ఇంతకాలము నాతో కాపురము చేసిన వాడుగదా! నాస్వభావము (పట్టుదల, బలహీనత మొదలగు అంశములన్నింటిని) తెలిసిన వాడుగదా; పొమ్మని అన్నానే అనుకొమ్ము. తన కిష్టము లేక పోయినను పొమ్మనగానే పోవుట సబబుగా నున్నదా? ఆయన కఠిన హృదయుడు. కావుననే వెళ్ళు మనగానే వెడలి పోయినాడు. ఇంతవఱకు ఆయన హృదయపులోతు నేను తెలిసికొన లేక పోయినాను. శయ్యపై నుండి లేచి పోయినాడనగా నెంతటి కఠిన హృదయుడో తెలియుచున్నది గదా! అట్లు లేచిపోయి నా ప్రేమను చంపివేసి నాడు. ప్రేమ అటుండనిమ్ము. ఆడుదానను, తననే నమ్ముకొన్న దానిని, తాను విడచిన బ్రతుక జాలని దానినని తెలిసియు ఉపేక్షించి, మరొక దిక్కు లేని దానినను జాలికూడ విడచి వెడలిపోవుట వలన అంతటి కఠిన హృదయుడు మరొకడుండడని తెలియుచున్నది గదా! అయినను నా హృదయ మింకను వానినే కోరుచున్నది. నా బలహీనత కేడ్చుట కన్న నేనేమి చేయగలను. అనునర్థమును వ్యంగ్య మొనర్చు నాయిక వాక్యములీ శ్లోకమున నున్నవి. 2. సఖి అను సంబోధనము చేత స్నేహితురాంద్రతో పంచుకొన్నప్పుడు దుఃఖభారము తగ్గునని నీకు చెప్పు చున్నాను. వీలైనచో నాసంగతి ఆయనకు చెప్పి ఆయనకు

నాయెడల పూర్వప్రేమ కలుగనట్లు చేయగల జాణవని నీకు చెప్పుచున్నాను, అనునర్థము వ్యంగ్యమగు చున్నది. కథమపి అనుటచేత ఇది వఱకెప్పుడు వైమనస్యము చెందుననను శంకతో ప్రణయకోపము చేతను వెడలి పొమ్మన లేదు. ఇప్పుడు కోపము తట్టుకొనలేక మాత్రమే అన్నానని ఎందుకో తెలిసికొనలేక పోయినాడు అను నంశము వ్యక్తమగును. శయ్యాం త్యక్త్వాగతః అనుట చేత శయ్యను మాత్రమే విడిచి పోయినాడు; గాని నన్ను శాశ్వతముగా విడచిపెట్టి పోయినాడని యనుకొనుటలేదు. కావున నాప్రార్థనతో నీ వాతని మరల తీసికొనవచ్చు ప్రయత్నము సఫలమగునను ఆశ ఉన్నదను నర్థము వ్యంగ్యమగుచున్నది. సాధారణముగా క్రీడాకోపముతో పలికిన మాటలు చేష్టలు నాయకులు పట్టించుకొనరు కాని నాక్రీడా కోపమును సహజ కోపముగా భావించి యాతడుశయ్యవిడచి వెడలి పోయినాడు. తిరిగి రాడేమో అను భావమున కవకాశమున్నను అది తన కమంగలము కావున ఆ భావమును చెప్పుకొనలేక పోవుచున్నది; అనియు వ్యంగ్య మగుచున్నది. 3. శయ్య విడిచి పోయినాడనగా ఆతడన్యాసక్తుడో గ్రామ్యుడో కావలెను. నాగరికనగు నన్ను లోబఱచుకొన జాలిన యా నాయకుడు గ్రామ్యుడనుట సరికాదు. నేను అయన అన్యాసక్తుడని భావించి పొమ్మనగానే పోవునట్టి కఠిన హృదయుడనుటకును నామనసొప్పుటలేదు. ఈ చుట్టు పట్టులలోనే యెక్కడో గోడ చాటున నుండి నామాటలువిను చున్నాడనియు నను కొందును. వెదకి తీసికొనిరమ్ము అను నర్థమును వ్యంగ్య మగుచున్నది. హరిణీ వృత్తము.

అవ॥ పై శ్లోకమున కలహాంతరితా నాయికా ప్రణయము వర్ణింపబడినది. ఈ శ్లోకమున కులపాలికా ప్రణయము వర్ణింపబడు చున్నది.

శ్లో॥ దంపత్యోర్నిశి జల్పతో ర్గృహ శుకే నాకర్ణితం యద్వచ
స్తత్ప్రాతర్గురు సన్నిధౌ నిగదతః శ్రుత్వైవ తారం వధూః।
కర్ణాలమ్బిత పద్మరాగ శకలం విన్యస్య చంచ్వాః పురా
వ్రీడార్తా ప్రకరోతి దాడిమఫల వ్యాజేన వాగ్బంధనమ్॥ 16

ప్ర॥ గృహశుకేన-పెంపుడు చిలుక చేత; ఆకర్ణితమ్-వినబడిన; నిశి-రాత్రి యందు; జల్పతోః-మాట్లాడుకొనుచున్న; దంపత్యోః-భార్యా భర్తల యొక్క; యద్-ఏ; వచః- వాక్కు; ఆకర్ణితమ్-వినబడినదో; ప్రాతః-ప్రాతఃకాలమున; తారమ్-బిగ్గఱగా; గురుసన్నిధౌ-పెద్దలయెదుట; నిగదతః-పలుకుచున్న ఆ చిలుకయొక్క; తత్- ఆ వాక్కును; శ్రుత్వా-విని; ఏవ-వెంటనే; వధూః-కోడలు; వ్రీడార్తా-సిగ్గుతో

పీడింపబడి; చంచ్వాః-ముక్కు యొక్క; పురా-ముందర; దాడిమఫలవ్యాజేన-దానిమ్మపండు యొక్క నెపముతో; కర్ణాలమ్బిత పద్మరాగ శకలమ్-చెవిని వ్రేలాడు పద్మరాగమణి యొక్క ముక్కను; విన్యస్య-ఉంచి; వాగ్బంధనమ్-మాటకట్టును; ప్రకరోతి-కలిగించు చున్నది.

తా॥ దంపతులు రాత్రి మాట్లాడుకొను చుండగా పెంపుడు చిలుకవిని, విన్న దానిని ప్రొద్దున పెద్దలయెదుట పలుకనారంభించగానే వెంటనే ఆ కోడలు దానిమ్మ పండు ముక్క యొక్క నెపముతో తన చెవిని వ్రేలాడు పద్మరాగమణి యొక్క ముక్కనా చిలుక ముక్కు యొక్క యెదుట నుంచి దానికి వాగ్బంధనము చేయుచున్నది.

వి॥ 1. రాత్రి ఏకశయ్యాగతులైన దంపతు లేవో అనవలసినవి అనగూడనివి యైన మాటలు మాట్లాడు కొనుచుందురు. అట్లే ఈ శ్లోకములోని నాయికానాయకులు మాట్లాడు కొను చున్నారు. అందఱి యిండ్లలో పెంపుడు చిలుకలుండక పోవచ్చును. కాని వారింట పడకగదిలో పంజరమున విలాసము కొఱకు చిలుకను బంధించి యుంచుకొన్నారు. అది రాత్రి వీరి మాటలను విన్నది. తెల్లవాఱగానే ఆ మాటలనే పలుకుట కారంభించినది. భర్త కంటె భార్య తరువాత నిద్రించి ముందు మేల్కొన వలె నను పతివ్రతా ధర్మము ననుసరించి తెల్లవార్లు ప్రణయకలాపములో నిదుర వీడి జాగారము చేసినను తెల్లవారుజామున లేచిన ఆ నాయిక ఆ మాటల నింటిలోని పెద్దవారు వినుట తనకు లజ్జాకరము కావున అది మాట్లాడకుండ దాని ముందఱ తన చెవికి వ్రేలాడు పద్మరాగము యొక్క ముక్కనొక దాని నుంచినది. దానిని దానిమ్మ గింజ యని భ్రమించిన చిలుక తన వాగుడు మాని దానిని కొఱుక నారంభించినది. ఇంటి కోడలు తన సమస్య నీవిధముగా తీర్చుకొనుట ఈ శ్లోకమున వర్ణింపబడినది. 2. రాత్రి పూట నేకాంతమున మాట్లాడు కొనుటలో దంపతులకు స్వేచ్ఛ యుండును. వారు శృంగార మధికముగా వ్యక్తపరచు మాటలు (సురతాలాపములు) మాట్లాడుకొందురు. వానిని విన్న చిలుక రహస్య భంగము చేయుచు కూసిన కూతలు వినకుండ పద్మరాగమణి శకలమును చిలుక ముందుంచుట నాయిక సమయస్ఫూర్తిని వ్యంజింపజేయును. పగటి పూట ఇంట దిరుగు దంపతులు రాత్రియందువలె సురతాలాపము లాడుకొనరు. రాత్రి సురతాలాపములతో ప్రొద్దు పుచ్చినారను విషయము 'ప్రాతః' అను మాటచే వ్యంజింప జేయబడుచున్నది. 3. కవులు మరణించిన పిదప వారి పద్యములలోని యసంగతములను నివారించుటకై చదువరులు పాఠాంతరముల కల్పించుదురు. అందుచేత మన సాహిత్యమున దాదాపు ప్రాచీన కవులందఱి శ్లోకములలో నక్కడక్కడ పాఠభేదములను కల్పించెదరు. ఆ

చదువరి యొక్క సామర్థ్యము ననుసరించి కల్పిత పాఠము యొక్క సంగతత్వమాధార పడియుండును. ఈ శ్లోకమున శ్రుత్వైవ అను పదములున్నవి. చదువరికో వ్యాఖ్యాతకో ఈ పదములు అసంగతములుగా కన్పించినవి. ఏవ కారము యొక్క అన్య యోగ వ్యావృత్తి అ యోగ వ్యావృత్తి మొదలైన ప్రసిద్ధార్థములు సంగతములగుటలేదు. కావున 'త్రస్త్వైవ' అను పాఠమును కల్పించినాడు. దీనికన్న మొదటి కవిపాఠమే బాగున్నది. ఏవ కార మవ్యయము కావున, అవ్యయమున కనేకార్థములుండును. కావున ఈ శ్లోకమున పైన జెప్ప బడిన యర్థములు కాకున్నను అవిలంబము(వెంటనే) అను అర్థము చెప్పిన ఏవ కారము యొక్క అసంగతత్వము తొలగి పోవును. ప్రామాణిక వ్యాఖ్యాతయగు అర్జున దేవుడే పైకల్పిత పాఠమును నిరాకరించి మొదటి కవి పాఠమును సమర్థించినాడు. అసంగతత్వ మున్నదను కారణమున పాఠాంతరములు కల్పించుట అనుచితము. చాపల్యము. ఒక్కొక్కప్పుడు దీని వలన కవి కనుచితమైన అపకీర్తియో కీర్తియో కలుగవచ్చును. ఈ శ్లోకమున 'దాడిమ ఫలవ్యాజేన' అని యున్నది. చిలుకకు దాడిమ బీజభ్రాంతిని కలిగించి దాని వాగుడు మాన్పదలచిన నాయిక తన చెవిని వ్రేలాడు పద్మరాగ శకలమును తీసి దాని ముందుంచినది. ఇది కవి హృదయము కాని ఆ సమాసము నందు ఫలశబ్దమున్నది. కాని బీజ శబ్దము లేదు. ఫలశబ్దమునకే ఆ ఫలములోని అవయవమైన బీజమని యర్థము చెప్పికొని సంతోష పడవలసి యున్నది. కాని ప్రామాణిక వ్యాఖ్యాత యగు అర్జునదేవుడు దాడిమ ఫలమువలె పద్మరాగశకల ముండదు. కావున శుకమునకు భ్రాంతి కలుగ జాలదను శంక కలిగినచో 'దాడిమ మృషాబీజేన' అను పాఠాంతరము కల్పించుకొన వలెనని చెప్పినాడు. మృషాదాడిమ బీజమని యుండవలె కాని దాడిమ మృషాబీజమను పాఠాంతరము దాడిమ ఫలవ్యాజేన అను కవి పాఠమున కంటె సే విధముగను సంగత మని పించదు. **4.** ఈ శ్లోకమున శుకమునకు దాడిమబీజ భ్రాంతికలిగించుటకు పద్మరాగ శకలము నుంచుట చెప్ప బడినందున భ్రాంతి మదలంకారమిందున్నది. కాని అది వ్యంగ్యమగుచున్నది. వాచ్యమగుట లేదు. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పై శ్లోకమున ఉద్దీపన విభావమైన గృహశుకము యొక్క భ్రాంతి ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమున ఆలంబన విభావమైన నాయకుని భ్రాంతి చెప్పబడినది.

శ్లో॥ అజ్ఞానేన పరాఙ్ముఖీ మ్పరి భవాదాశ్లిష్య మాం దుఃఖితాం
కిం లబ్ధం శఠ! దుర్ణయేన నయతా సౌభాగ్యమేతాం దశామ్।

పశ్యైతద్దయితా కుచవ్యతి కరోన్మృష్టాఙ్గ రాగారుణం
వక్షస్తే మలతైల పఙ్క శబలై ర్వేణీ పదై రంకితమ్॥ 17

ప్ర॥ శఠ- ఓయి మోసగాడా!; పరిభవాత్- అవమానమువలన; పరాఙ్ముఖీమ్ - విముఖురాలైన; దుఃఖితామ్- దుఃఖితురాలనైన; మామ్- నన్ను; అజ్ఞానేన- అజ్ఞానముతో; ఆశ్లిష్య- కౌగిలించుకొని; సౌభాగ్యమ్- సౌభాగ్యమును; ఏతామ్- ఈ; దశామ్- అవస్థను(కు); నయతా-చేర్చుచున్న; దుర్ణయేన- దురుసుతనముతో; కిమ్- ఏమి; లబ్ధమ్- పొందబడినది; దయితా కుచ వ్యతికరోన్మృష్టాఙ్గరాగారుణమ్- ప్రియురాలి చనుల సంబంధము చేత అంటుకొనిన అంగరాగముచే నెఱ్ఱనైన; ఏతత్- ఈ; తే- నీ యొక్క; వక్షః- ఱొమ్ము; మలతైల పంకశబలైః- మాలిన్యము నూనెజిడ్డుతో కూడిన; వేణీపదైః- జడయొక్క గుర్తులతో; అంకితమ్- చిహ్నితమైనది; పశ్య- చూడుము.

తా॥ అవమానముతో పరాఙ్ముఖినై దుఃఖితురాలనైన నన్ను అజ్ఞానముతో కౌగిలించుకొని నీ సౌభాగ్యము నీ స్థితికి తెచ్చుకొన్నావు. ఇది నీదుర్ణయము. నీ ఱొమ్ము నీ ప్రియురాలి యొక్క రక్త చందనము పూయబడిన స్తనముల రాపిడిచే ఎఱ్ఱనై యుండగా మాలిన్యము నూనె జిడ్డుగల నా జడ యొక్క చిహ్నములచే కొంత భాగము నిండి పోయినది.

వి॥ 1. శ్రోత్రియుల యింటి పడుచువాడైన ఒకడు పరస్త్రీ సంగమము చేసి వచ్చినాడు. తత్సంపర్క చిహ్నమైన అంగరాగము అతని ఱొమ్మునకంటుకొని యే యున్నది. రాలిపోలేదు. అట్లుండగానే తన భార్య కనుమానము రాకుండ వెనుక నుండి కౌగలించు కొన్నాడు. ఆమె ఋతుస్నానమునకై తలకు నూనె రాచికొని యున్నది. మూడు దినముల నుండి స్నానము లేక పోవుట వలన తలలో మాలిన్యము సైతము చేరి యున్నది. ఆ మాలిన్యము ఆ నూనె జిడ్డును ఆ యువకుని ఱొమ్మున కంటుకున్నవి. మూడు దినముల నుండి యింటి పట్టున లేక పోవుటచే తన భర్త పరాయి దానిని తగులు కొన్నాడని ఆమె ఊహించినది. వారు వీరు చెప్పగా విన్నది. ఆమె భర్త ప్రియురాలితో సంగమించి వచ్చియు భార్యకు తెలియకుండ వలెనని ఆమె యందు గాఢానురాగమున్నదని తెలుపుటకు ఆమె నాశ్చర్య పఱచుటకు వెనుక నుండియే కౌగలించుకొన్నాడు. భర్త వియోగముచే ఇది వఱకే దుఃఖితయైన యా నాయిక ఇపుడు మరింత దుఃఖితురాలైనది. ఆమె ఓయి శఠుడా! నన్నాలింగించుకొని దుర్నయము చేసినావు. ప్రియురాలి చనుల రక్త చందనము నీ ఱొమ్మునకంటు కొన్నది. అది నీ సౌభాగ్యము. కాని వెనుక నుండి కౌగిలించుకొని నా జడలోని మాలిన్యమును నూనె

జిడ్డును అంటించుకొన్నావు. ఇప్పుడు నీ ప్రియురాలు చూచిన మరల నిన్నాదరించునా? నీ దుర్నయము చేత నీ సౌభాగ్యమునకీ దురవస్థ వచ్చి పడినది. అను అర్థము నొసగుమాటలీ శ్లోకమున నిబంధింపబడినది. **2.** మలతైలపంక శబ్దము ఆమె ఛాందసుల యింటి యాడ పడుచని అందుకే ఋతు కాలమున స్నానము లేక యున్నది. మూడు దినముల పిమ్మట నేడు నూనె రాచుకొని స్నానమునకు సిద్ధమై యున్నది. ఆ మూడు దినముల అవకాశము చూచుకొని నాయకుడన్యాంగనా సక్తుడైనాడు అని వ్యంజింపజేయును. శఠులనగా నాయికకు తెలియకుండగా తప్పు చేసి నాయిక కప్రియ మొనరించువారు. శఠ అను సంబోధనముచే నీవెంత గూఢముగా ప్రవర్తించినను నాకు తెలిసిపోయినదిలే అని వ్యంగ్య మొనరించును. **3.** నాయకుడాలింగన మొనర్చినందున నిందు సంభోగ శృంగారమే యున్నదని చెప్పరాదు. నాయికానాయకుల కిరువురకు పరస్పరానుకూల్యము లేనప్పుడు నిందు సంభోగ శృంగారమున కవకాశము లేదు. అట్లని శృంగార ప్రతీతియే లేదనరాదు. నాయిక పరాఙ్ముఖియైనను తనను కౌగిలించుకొన్నది, నాయకుడే అని యెఱిగి యున్నందున అతని పరాంగనా సంగముచే కలిగిన ఆ పరాఙ్ముఖత్వము తాత్కాలికమే కావున నీ శ్లోకమున నీర్ష్యామాన విప్రలంభ శృంగార మున్నదని వ్యాఖ్యాత అర్జునవర్మదేవుడు తెలిపినాడు. **4.** వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పై శ్లోకమున ఈర్ష్యామానముగల నాయిక నాయకునెత్తి పొడుచు కోపము వర్ణింపబడినది. ఈ శ్లోకమున చేష్టలతోనే వ్యక్తమగు కోపము వర్ణింపబడుచున్నది.

శ్లో॥ ఏకత్రాసన సంస్థితిః పరిహృతా ప్రత్యుద్గమాద్దూరతః
తామ్బూలాహరణచ్ఛలేన రభసాశ్లేషోఽపి సంవిఘ్నితః।
ఆలాపోఽపి న మిశ్రితః పరిజనం వ్యాపారయన్త్యాన్తికే
కాన్తం ప్రత్యుపచారత శ్చతురయా కోపః కృతార్థీకృతః॥ 18

ప్ర॥ దూరతః- దూరమునుండి; ప్రత్యుద్గమాత్-ఎదురు వచ్చుట వలన; ఏకత్ర- ఒక చోట; ఆసనసంస్థితిః- కూర్చొను అవకాశము; పరిహృతా- తప్పింపబడినది; తామ్బూలాహరణచ్ఛలేన- తామ్బూలమిచ్చునెపమున; రభసాశ్లేషఃఅపి- సంభ్రమముతో ఆలింగనము; సంవిఘ్నితః- అడ్డుకొనబడినది; అన్తికే- సమీపమున; పరిజనమ్ -పరిచారకాగణమును; వ్యాపారయన్త్యా- పురమాయించు; చతురయా- జాణచేత; ఆలాపఃఅపి- మాటకూడ; నమిశ్రితః- కలుపబడలేదు; కాంతమ్‌ప్రతి- నాయకుని గూర్చి; ఉపచారతః- పరిచర్యవలన; కోపః- కోపము; కృతార్థీకృతః- గెలిపింపబడినది.

తా॥ దూరము నుండి ఎదురువచ్చు నెపమున నాతో కలిసి కూర్చొనుటను, తామ్బూల మిచ్చు నెపమున సంభ్రమాలింగనమును, పరిచారికలను నా సమీపమునకు సేవకై పంపు నెపమున తనతో మాట్లాడుటను తప్పించుకొన్న ఈ జాణ తనకోపమును సార్థకమొనరించు కొన్నది.

వి॥ 1. నాయకుని అన్యాసంగమును శంకించిన నాయిక నాయకుడు వచ్చినప్పుడు మామూలుగానే ఉండి ఉపచారముల నొనర్చినది. నాయకుడు వచ్చి ఆమె కూర్చొన్న ఆసనముపై కూర్చొన దలచినాడు. కాని ఆమె దూరము నుండియే నాయకునకెదురు వచ్చినది. కలసి కూర్చొను నవకాశమట్లు పోగొట్టినది. అమాంతము కౌగిలించుకొన దలచినాడు నాయకుడు. కాని తామ్బూల మిచ్చుచు ఆ అవకాశమును పోగొట్టినది. ఆమెతో ఏకాంతముగా మాట్లాడ వలెనను కొన్నాడు నాయకుడు. కాని ఆమె ఆతనికది ఇచ్చి రమ్ము, ఇది యిచ్చిరమ్ము అని నాయకుని కడకు సేవికా గణ మునుపంపి ఆ అవకాశమును కూడ పోగొట్టినది. అని కోపించిన జాణ తనకోపమును బయల్పఱచు కొనకుండగనే తనను శిక్షించి సార్థక పఱచు కొన్నదను నర్థము నొసగు వాక్యములీ శ్లోకమున నున్నవి. 2. కోపమును దాచుకొను వృత్తాంత మందు వర్ణింపబడుటచే మీలితాలంకారమున్నది. వృత్తము శార్దూల విక్రీడితము. 3. 14వ శ్లోకములోని భావ మీ శ్లోకములోని భావమును కొంత సంవదించుచున్నది.

అవ॥ పూర్వశ్లోకమున ఏకకాలమున నాయకుని యందుపైకి ఆదరమును ప్రకటించుచునే లోనగల గూఢ కోపమును వ్యక్తమొనర్చిన నాయిక వృత్తాంతము వర్ణింపబడినది. ఈ శ్లోకమున ఏక కాలమున ఇరువురు కాంతలందు ప్రీతిని ప్రదర్శించు నాయకుని వృత్తాంతము వర్ణింపబడు చున్నది.

శ్లో॥ దృష్ట్వైకాసన సంస్థితే ప్రియతమే పశ్చాదుపేత్యాదరా
దేకస్యా నయనే నిమీల్య విహిత క్రీడానుబన్ధచ్ఛలః।
ఈ షద్వక్రిత కన్ధరః సపులకః ప్రేమోల్లసన్మానసా
మంతర్హాస లసత్కపోల ఫలకాం ధూర్తోఽపరాం చుమ్బతి॥ 19

ప్ర॥ విహితక్రీడాను బన్ధచ్ఛలః- వినోదముతో కూడిన కపటముగల; ధూర్తః- ధూర్తుడు; ఏకాసన సంస్థితే- ఒకే ఆసనమందు కూర్చొన్న; ప్రియతమే- ఇరువురు ప్రియురాండ్రను; దృష్ట్వా- చూచి; ఆదరాత్- ఆదరమువలన; ఏకస్యాః- ఒకతె యొక్క; నయనే- కన్నులను; నిమీల్య- మూసి; సపులకః- పులకితుడై; ఈషద్వక్రిత

కన్ధరః- కొంచెము వంచిన మెడగలవాడై; ప్రేమోల్లసన్మానసామ్- ప్రేమతో ఉల్లసించిన మనస్సుగల; అంతర్హాసలసత్కపోల ఫలకామ్- లోని నవ్వుచే ప్రకాశించు చెంపలుగల; అపరమ్- మరొకతెను; చుమ్బతి- ముద్దుబెట్టుకొనుచున్నాడు.

తా॥ ఒక ఆసనమున కూర్చొని యున్న ఇరువురు ప్రియురాండ్రను చూచి ఆదరముతో వెనుక నుండి వచ్చి వినోదమును కపటమును చేయదలచిన యొక ధూర్తుడు ఒకతె యొక్క కన్నులను మూసి పులకితుడై ప్రేమోల్లాస మానసయైన లోని నవ్వుతో ప్రకాశించు చెంపలుగల మరొకతెను ముద్దుగొను చున్నాడు.

వి॥ 1. అనుకూలుడు, దక్షిణుడు, ధృష్టుడు, శఠుడు అని శృంగారనాయకులు నాలుగు విధములుగ నుందురు. ఒక స్త్రీ యందను రాగము కలవాడు అనుకూలుడు, అనేక నాయికలం దనురాగము గలవాడు దక్షిణుడు, అపరాధము బయటపడగా భయము వీడినాడు ధృష్టుడు, గూఢముగా నాయిక కప్రియముచేయువాడు శఠుడు. అనుకూల ధృష్టశఠులు వెనుక శ్లోకములలో కొన్నింటిలో పరిచితులైన వారే. ఈ శ్లోకమున దక్షిణ నాయకుని ధూర్తత్వము వర్ణింప బడుచున్నది. 2. ఒకతెయొక్క కన్నులు మూసి పులకలు గలవాడై మరొకతెను కొంచెము మెడవంచి ముద్దిడి యిరువురి యందు ప్రేమను ప్రదర్శించినందున నాయకుడు దక్షిణుడు. అయినను రెండవ కాంత ప్రేమోల్ల సన్మానస కావున మొదటి కాంత యందు కన్న నధిక ప్రేమ కలిగి యున్నాడు. ఒక కాంత యందధిక ప్రేమను చూపుట, మరొక కాంత యందు గౌరవము కలిగి యుండి లోపలనున్న కించిత్ప్రేమనే అధికముగా నున్నట్లు ప్రదర్శించుట కూడ దాక్షిణ్యమనబడును. దక్షిణ నాయకుని యందిట్టి దాక్షిణ్యము కూడ నుండును. ఈ శ్లోకమున ఇట్టి దాక్షిణ్యము కలనాయకుడు వర్ణింపబడినాడు. 3. ఇరువురు కాంతలు యువతులే యైనను వయసులో కొంచెము పెద్దదైన నాయిక కన్నులు మూసి కొంచెము చిన్నదైన నాయికను ముద్దుగొనుట నాయకునికి కొత్తగాదు గావున కొత్త కాంత యాకర్షించినంత నా పాతకాంత యాకర్షింప జాలదని తెలియు చున్నది. 4. ఇరువురు ప్రియతమలే అని చెప్పి నూతన కాంతయందు విశేష ప్రీతి వర్ణింపబడుటచే నీ శ్లోకమున విశేషాలంకారమున్నది. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పూర్వ శ్లోకమున ఇరువురు నాయికలను సంతోషింప జేసిన నాయకుని దాక్షిణ్యము చెప్పబడినది. ఇందు నాయకుడు కలహాంతరిత చే తిరస్కరింపబడి దాక్షిణ్యమును కొంత కోల్పోవుట చెప్పబడినది.

శ్లో॥ చరణ పతన ప్రత్యాఖ్యాన ప్రసాద పరాఙ్ముఖే
నిభృతకిత వాచా రేత్యుక్తే రుషా పరుషీ కృతే।

వ్రజతి రమణే నిఃశ్వస్యోచ్చైః స్తనార్పిత హస్తయా
నయన సలిలచ్ఛన్నా దృష్టిః సఖీషు నిపాతితా॥ 20

ప్ర॥ చరణ పతన ప్రత్యాఖ్యాన పరాఙ్ముఖే - పాదములపైపడినను తిరస్కరించుటచే అనుకూల్యమును కోల్పోయిన; నిభృతకితవాచార ఇతి- రహస్యకపటాచారముగల వాడాఅని; ఉక్తే- చెప్పగా; రుషా- కోపముచేత; పరుషీకృతే- కాఠిన్యము నొందిన; రమణే - నాయకుడు; వ్రజతి- పోవుచుండగా; ఉచ్చైః- పెద్దగా; నిశ్వస్య- నిట్టూర్చి; స్తనార్పిత హస్తయా- చనులయందు చేతులనుంచుకొనిన నాయిక చేత; నయన సలిలచ్ఛన్నా- కన్నీటితో కప్పబడిన; దృష్టిః-చూపు; సఖీషు-చెలికత్తెలందు; నిపాతితా- ప్రసరింపజేయబడినది.

తా॥ తన పరస్త్రీ సంపర్కమును నాయిక గ్రహించినది అని నాయకుడు రాగానే నాయిక పాదములపై పడినాడు. అప్పటికిని నాయిక కోపముతో తిరస్కరించినది. దానితో నాయకున కామెపై కొంత విరక్తి కలిగినది. అప్పుడు నాయిక రహస్య కపటాచారము గలవాడా అని సంబోధించినది. అప్పుడు నాయకుడు రోషముతో కాఠిన్యమును పొందిన వాడై వెడలిపోవు చుండగా బిగ్గఱగా నిట్టూర్చి చనులపై చేతుల నుంచుకొని కన్నీటితో కప్పబడిన తన దృష్టిని నాయిక చెలికత్తెల యందు బఱపినది.

వి॥ 1. ఈ శ్లోకమున పదునైదవ శ్లోకమునందు వలె కలహాంతరితా నాయికా వృత్తాంతమే వర్ణింపబడుచున్నది. పాదములపై బడినచో తన అపరాధమును మన్నించునని నాయకుడను కొన్నాడు. కాని అప్పటికిని ఆమె కోపముతో నాయకుని తిరస్కరించినది. నాయకునకు విరక్తి కలుగక యెట్లుండును. పైగా నాయిక ''విభృతకితవాచార'' అని సంబోధించిన నాయకు నపరాధమును చెలికత్తెల ముందు వెల్లడించినది. నాయకునకు రోషము పొడుచుకొని వచ్చినది. ఇక ఈమెనను నయించుట సాధ్యము కాదని వెడలిపోవు చుండగా అభిమానముతో నాతని నడ్డగించ లేక చూచుచు ఊరుకొన్నది. ఆయన వెను దిరిగి చూడనేలేదు. అప్పుడు బిగ్గఱగా నిట్టూర్చినది. తప్పు తనదే అని ప్రియతముని దూరము చేసి కొన్నానని గుర్తించగానే కన్నులలో నీరు నిండినది. హృదయము నందు హెచ్చిన పరితాపము నణచు కొనుటకు చనులపై చేతులనుంచుకొని కన్నీటితో మసక బారిన తన చూపును చెలికత్తెలపై ప్రసరింప జేసినదను నర్థమును వ్యంగ్య మొనర్చు వాక్యములీ శ్లోకమున నిబంధింప బడినవి. 2. కన్నీటితో నిండిన చూపుతో చెలికత్తెలను చూచిన దనగా మీరే నాయకుని వెనుకకు రప్పింపుడని దీనముగా వేడుకొన్నదని వ్యంగ్యము. కావున నామె

చెలికత్తెలందు బఱపిన దృష్టి దీనదృష్టియని వ్యాఖ్యాతయగు అర్జున దేవునిచే చెప్ప బడినది. 3. ప్రత్యాఖ్యాన ప్రసాద రుషా పరుషీకృతే నిభృత కితవ అను పదములందు వృత్త్యను ప్రాసమను శబ్దాలంకారమున్నది. వృత్తము హరిణి.

అవ॥ పై శ్లోకమున నాయిక కోపము కారణముగా కలిగిన మదనవైఫల్యము చూపబడినది. ఈ శ్లోకమును కొంచెము పొద్దుపోయి వచ్చిన నాయకునిపై కలిగిన కోపమును తగ్గించుకొని నాయిక కనబఱచిన సంభోగాను కూల్యము ప్రదర్శింప బడుట సూచింపబడుచున్నది.

శ్లో॥ కాంచ్యా గాఢతరావనద్ధవసన ప్రాన్తా కిమర్థ మ్పునః
ముగ్ధాక్షీ స్వపితీతి తత్పరిజనం స్వైర మ్ప్రియే పృచ్ఛతి।
మాతః స్వప్తు మపీహి వారయతి మామిత్యాహితక్రోధయా
పర్యస్య స్వపనచ్ఛలేన శయనే దత్తోఽవకాశస్తయా॥ 21

ప్ర॥ కాంచ్యా-మొలనూలుచేత; గాఢతరావనద్ధవసన ప్రాన్తా-గట్టిగాబిగించిన కొంగుగల; ముగ్ధాక్షీ-అందమైన కన్నులు గలచిన్నది; పునః-మరల; కిమర్థమ్-ఎందుకు; స్వపితి-నిద్రించు చున్నది; ఇతి-అని; స్వైరమ్-మెల్లగా; తత్పరిజనమ్-ఆమె పరిచారికా గణమును; ప్రియే-ప్రియుడు; పృచ్ఛతి-అడుగుచుండగా; మాతః-అమ్మా; ఇహ-ఇక్కడ; మామ్-నన్ను; స్వప్తుం అపి-నిద్రించుటకు కూడ; వారయతి -నిరోధించుచున్నాడే; ఇతి-అని; ఆహితక్రోధయా-కోపముతెచ్చుకొనిన; తయా-ఆ ముగ్ధాక్షిచేత; పర్యస్య-పక్కకొదిగి; స్వపనచ్ఛలేన-నిద్రించు నెపమున; శయనే-తల్పమునందు; అవకాశః-అవకాశము; దత్తః-ఈయబడినది.

తా॥ ఒక యింటి కోడలు భర్త వచ్చుట ఆలస్యమయినదని అలిగి భర్తకై యెదిరి చూచుచు కొంగును మొలనూలుతో గట్టిగా బిగించిపడుకొన్నది. ప్రియుడు వచ్చి మరల అట్లు పడుకొన్నదేల? అని మెల్లగా ప్రశ్నించు చుండగా, ఈ యింట పడు కొనుట గూడ నిషేధమేమో అని పలుకుచునే ఆ యింటి కోడలు ముగ్ధాక్షి ప్రక్క కొదిగి ఆ తల్పము నందు ప్రియునికి సరిపడు నంత అవకాశమిచ్చినది.

వి॥ 1. కొంగును మొలనూలికి బిగించు కొన్న నాయిక పడుకొన్నది అనుట అది నిద్రకు సహజ ప్రయత్నము కాదని వ్యంజింప జేయు చున్నది. ఈ యింట పడుకొనుట కూడ నిషేధించు చున్నాడని కోపము తెచ్చుకొన్న దనుట భర్త ఆలస్యముగా వచ్చినాడని కోపము నభినయించుటను వ్యంజింప జేయుచున్నది. 2. ప్రక్కకొదిగి అనుట చేత అంతకు ముందు భర్త ప్రక్కకు వచ్చి తనకు తెలియకుండ

నిద్రించుటకవకాశము లేకుండ శయ్య యొక్క నడుమ పడుకొన్నదని వ్యంజింపజేయు చున్నది. ఇట్లీల పడుకొన్నదని మెల్లగా నడిగినాడనుట నాయకునకు గల నాయిక నిద్రాభంగ భయమును వ్యంజించును. భర్త వచ్చి నాడని గమనించిన వెంటనే పక్కకొదిగినదని చెప్పుటచే భర్త రాకకై వేగిరపడు చున్నదని సంభోగ కాంక్షతో తహతహలాడు చున్నదను నంశము వ్యంగ్యమగు చున్నది. 3. మొల నూలితో నితంబ వస్త్రమును బిగించినదని చెప్పుటచే తొడలను నాయకుడు స్పృశించవలెనను నాయికా తౌల్యము, పడుకొనుటచే నాయిక యొక్క మదనావస్థ కాని, కపటనిద్రకాని వ్యంగ్య మగుచున్నదని వ్యాఖ్యాత అర్జునవర్మ దేవుడు తెలిపినాడు. 4. పూర్వకాలమున స్తనములపై నొక వస్త్రము నితంబములపై మరొక వస్త్రము స్త్రీలు కట్టుకొను వారు. మొదటి దాని నుత్తరీయమని రెండవదాని నంతరీయము అని పేర్కొనెడివారు. 5. మాతః అనుట ఆమె పుట్టింట నుండుటను తెలుపదు ఆడువారు వాక్యాంత మందు అమ్మ అను పదమును చేర్చుదురు. అటువంటిదే ఈ మాతః అనుపదము. 6. పక్క కొదుగుట అను ఇంగితము సూక్ష్మముగా నాయిక యొక్క సంభోగాభిలాషను తెలుపు చున్నందున ఈ శ్లోకమున సూక్ష్మాలంకార మున్నది. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పై శ్లోకమున తన శయ్యపై పడుకొనుటకు నాయకునకు నాయిక అవ కాశమిచ్చుటచెప్పబడినది. ఈ శ్లోకమున తన శయ్యపై పరుండి సవతి నామము ను కలవరించిన నాయకుని యెడల నాయిక ప్రవర్తించిన తీరు వర్ణింపబడు చున్నది.

శ్లో॥ ఏకస్మిన్ శయనే విపక్షరమణీ నామగ్రహే ముగ్ధయా
సద్యః కోప పరాఙ్ముఖం గ్లపితయా చాటుని కుర్వన్నపి।
ఆవేగాదవధీరితః ప్రియతమ స్తూష్ణీం స్థిత స్తత్క్షణా
న్మా భూన్మ్లాన ఇవేత్యమన్దవలిత గ్రీవ మ్పునర్వీక్షితః॥ 22

ప్ర॥ ఏకస్మిన్- ఒక; శయనే- శయ్యయందు; విపక్షరమణీ నామగ్రహే- సవతిని కలవరించుట యందు; సద్యఃకోప పరాఙ్ముఖమ్- వెంటనేకోపముతో పరాఙ్ముఖు రాలైన; గ్లపితయా- నిందించిన; ముగ్ధయా- ముగ్ధానాయికచేత; చాటుని- ప్రియములను; కుర్వన్ అపి- పలుకుచున్నను; ఆవేగాత్- ఆవేగము వలన; అవధీరితః- తిరస్కరింప బడిన; ప్రియతమః- ప్రియతముడు; తూష్ణీం- మౌనముగా; స్థితః- నిలచినాడు; తత్క్షణాత్- వెంటనే; మ్లానఇవ- వాడినవానివలె; మాభూత్- కాకుండు గాక; ఇతి- అని; పునః- మరల; అమన్దవలిత గ్రీవమ్- వేగముగ మెడ త్రిప్పబడుటతో; వీక్షితః- చూడబడినాడు.

తా॥ చిన్నదానితో కూడి ఒక శయ్యయందు పడుకొనియున్న నాయకుడు సవతి పేరును కలవరించగానే ఆ ముగ్ధ వెంటనే కోపముతో పరాఙ్ముఖియై నాయకుని నిందించి ఆవేగముతో తిరస్కరించినది. ప్రియుడు మౌనముగా నిలబడినాడు. ఆతడింకను వాడిపోకూడదని వెనుదిరిగి ప్రియుని సౌమ్యముగా చూచినది.

వి॥ ఒక నాయకున కిద్దఱు భార్యలున్నారు. అందు చిన్నది ముగ్ధ. నాయకుడు తన సవతి పేరును కలవరించుటతో ఆమెకు దయ్యము పట్టినట్లైనది అని 'విపక్షరమణీ' నామగ్రహ అను సమాసము నందలి గ్రహశబ్దము వ్యంజింపజేయును. నాయకుడు చాటూక్తులు పలుకుచున్నను అవి మిథ్యావచనములని భావించి ఆమె వెంటనే పరాఙ్ముఖురాలై నాయకుని నిందించిన దనుట నాయకుని ముఖము చూచుచు ఆమె నిందించలేదను అంశము, దానితో ఆమె హృదయమున నాతని నింకను ప్రేమించు చున్నదన్న అంశమును వ్యంగ్యమగు చున్నవి. తాను ఆవేగముతో తిరస్కరించినను అక్కడ నుండి వెడలిపోకుండ అక్కడనే నిలువబడి యున్న నాయకున కింకను తనపై ప్రేమ యున్నదని అప్పటికే మౌనముతో తన యపరాధము నంగీకరించి తాను నిందించుచున్నను మాఱు పలుకని నాయకుని మరింత చులకన చేయుట తగదని ఆమె భావించినట్లు వేగముగా వెనుదిరిగి ఆతని చూచుటచే వ్యక్తమగును. **2.** తాను నిందించిన పిదపను మౌనముగా నిలువబడియున్న నాయకుని ముఖమెట్లున్నదో చూడవలెనను నాయిక యొక్క ఔత్సుక్యమను వ్యభిచారభావము యొక్క ఉదయమిట వ్యంగ్యము. అది ఆమెకు నాయకుని యందు గల ప్రీతికి అంగియగు ఈర్ష్యామాన విప్రలంభము. అంగముగా గల శృంగార రసమునకు పరికరమగుచున్నది. **3.** సాధారణముగా స్త్రీలు తమ భర్తలతో అనుకూలముగా నుండుట కవసరమైన ఏ చిన్న ఉపాయమున్నను భర్తపట్లకోపమును చూపరు. కాని రాత్రి తనతో శృంగారము నెఱపిన భర్త తనను సవతిపేరున పలుకరించిన( అదికలవరింత కావచ్చును, అది ఆమెకు తెలియదుకదా) ఎట్లు సహింపగలదు. అందుకే ఆవేగముతో భర్తను తిరస్కరించినది. **4.** ఈ శ్లోకమున నాయకుడు శఠుడు (గూఢముగా నాయికకు అప్రియమును కలిగించువాడు అని) ఆతడు చాటువులను పలుకుటచే నాయికనూరడించుటకు నాయకుడు చేయదగిన సామదానభేదములను నుపాయములలో నాతని సామో పాయ ప్రయోగము తెలియుననని వ్యాఖ్యాత అర్జునవర్మదేవుడు తెలిపినాడు. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పై శ్లోకమునందు వలె ఈ శ్లోకమునందును దర్శనాత్మక సంభోగ శృంగారము దానితో పాటు స్పర్శనాత్మక శృంగారమును వర్ణింపబడుచున్నది.

శ్లో॥ ఏకస్మిన్ శయనే పరాఙ్ముఖతయా వీతోత్తరం తామ్యతో
రన్యోన్యం హృదయస్థితేఽప్యనునయే సంరక్షతోర్గౌరవమ్।
దంపత్యోః శనకై రపాఙ్గ వలనా న్మిశ్రీభవ చ్చక్షుషో
ర్భగ్నో మానకలిః సహాసరభసం వ్యావృత్త కణ్ఠగ్రహః॥ 23

ప్ర॥ ఏకస్మిన్- ఒక; శయనే- శయ్యయందు; పరాఙ్ముఖతయా- ఎడపెడముఖము లుండుటచే; వీతోత్తరమ్- బదులు పలుకుట లేక; తామ్యతోః- బాధపడుచున్న; అన్యోన్యమ్- ఒకరియందొకరికి; అనునయే- ఓదార్పు; హృదయస్థితే అపి- మనసున నున్నను; గౌరవమ్- గౌరవమును; సంరక్షతోః- కాపాడుకొనుచున్న; శనకైః- మెల్లగా అపాఙ్గవలనాత్- చూపుల చలనమువలన; మిశ్రీభవచ్చక్షుషోః- కన్నులుకలియుచున్న; దంపత్యోః- దంపతుల యొక్క; వ్యావృత్తకంఠగ్రహః- నివృత్తకంఠగ్రహముగల కౌగిలింతను దూరమొనర్చిన; మానకలిః- అభిమాన దోషము; సహాసరభసమ్- నవ్వు తీవ్రమగునట్లు; భగ్నః- విఱిగిపోయినది.

తా॥ ఏక శయ్యయందు దంపతులు ఎడమొగము పెడమొగముగా పడుకొని యున్నారు. నీవిట్లేల చేసితివను తమప్రశ్నలకు సమాధానములు లేక బాధపడుచున్న దంపతులకు ఊరడిల్లవలెనని యున్నది. కాని ఎవరు ముందూరడిల్లినట్లు కనబడవలెననునది తేలక బెట్టుగానే యుండి పోయినారు. కొంతసేపటికిరువురును మెల్లగా మరొకరిని చూచుటకు యత్నించు చుండగా ఇరువురి చూపులు కలసికొని పట్టలేనంత నవ్వు వచ్చినది. కౌగిలింతకు దూరము చేసిన వారిప్రణయకలహము విరిగి పోయినది.

వి॥ ఈ శ్లోకమునందు దర్శన స్పర్శన రూపములైన సంభోగ శృంగార రస ప్రభేదములు వ్యంగ్యములగు చున్నవి. ఏ సంభోగరస విశేషమైనను వియోగ పూర్వకముగానున్నప్పుడే అది పుష్టికలిగియుండును. కొంతకాలము పరాఙ్ముఖులుగా నున్న వారభిముఖులగుట చెప్పబడగా నిందు సంభోగ రసపుష్టి వియోగము వలన జనించినదే యనుట స్పష్టము. 2. పరాఙ్ముఖతయా వీతోత్తరం తామ్యతోః అను పాదాంశమున తకారావృత్తి యున్నది. కావున వృత్త్యను ప్రాసమను శబ్దాలంకార మిందున్నదని చెప్పవచ్చును. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పై శ్లోకము నందు వలె ఈ శ్లోకమునందు మాన (ప్రణయకోప) భంగము వర్ణింపబడుచున్నది.

శ్లో॥ పశ్యామో మయి కిం ప్రపద్యత ఇతి స్థైర్య మ్మయాలమ్బితమ్
కిమ్మాం నాలపతీత్యయం ఖలు శఠః కోపస్తయాఽప్యాశ్రితః

ఇత్యన్యోన్య విలక్ష దృష్టి చతురే తస్మిన్నవస్థాన్తరే
సవ్యాజం హసిత మ్మయాధృతిహరో బాష్పస్తు ముక్తస్తయా॥ 24

ప్ర॥ మయి- నాయందు; కిమ్- ఏమి; ప్రపద్యతే- వ్యవహరించునో; పశ్యామః- చూచెదము; ఇతి- అని; మయా- నాచేత; స్థైర్యం- బెట్టు; ఆలమ్బితమ్- అవలంబించ బడినది. అయమ్- ఈ; శఠః- మొండివాడు; మామ్- నన్ను; కిమ్- ఎందుకు; న ఆలపతి - పలుకరించడు; ఇతి- అని; తయాఅపి- ఆమె చేతను; కోపః- కోపము; ఆశ్రితః- ఆశ్రయింపబడినది. ఇతి- ఇట్లు; అన్యోన్యవిలక్షదృష్టిచతురే- ఒకరినొకరు ఉపేక్షాదృష్టి చే నిపుణమైన; తస్మిన్- ఆ; అవస్థాంతరే- అవస్థనడుమ; మయా- నాచేత; సవ్యాజమ్- మిషతో; హసితమ్- నవ్వబడినది; తయాఅపి- ఆమెచేతను; ధృతిహరః- (నా యొక్క) ధైర్యమును హరించు; బాష్పఃతు- కన్నీరు మాత్రము; ముక్తః- విడువబడినది;

తా॥ ఆమె ఏమి చేయునో చూతమని నేను బెట్టు చేసితిని. ఆమెయు ఈ మొండి వాడు నాతో మాట్లాడడేమి యని కోపించినది. ఒకరినొకర మిట్లు పేక్షించు కొన్న ఆ విచిత్ర పరిస్థితిలో ఏదో మిషతో నేను నవ్వితిని. నాబెట్టు ఊడి పోవునట్లు ఆమెయు కన్నీరు విడచినది.

వి॥ 1. ఇచ్చట స్థైర్యశబ్దము ఏమి చేయక అనగా మాట్లాడుట స్పృశించుట మొదలగు పనులేమి చేయక ఉండుట అను నర్థమున ప్రయోగింప బడినది. 2. నాయకుడు మాట్లాడ లేదు అను కోపముతో నాయికయు మాట్లాడలేదు. ఇట్లెంతో నిపుణతతో మేమొకరి నొకరము పేక్షించు చున్నప్పుడు ఏదో మిషతో నేను నవ్వగా ఆమె కన్నీరు విడచినది. నా నవ్వునకు కారణము లేకున్నను నాయకుడు నవ్వినాడు. కావను ఈ నవ్వు సవ్యాజము. కారణము లేకున్నను ఏదోకారణ మున్నట్లు కల్పించు కొని నవ్వుట నాయిక తనను అపహసించుటకే నవ్వినాడని భావించి కన్నీరు విడచినది. దానితో నాయకుడు తన స్థైర్యమును మాని ఆమె పట్ల ప్రేమతో ప్రవర్తించుటతో కథ సుఖాంత మైనది. ఈ అర్థమొసగు వాక్యములీ శ్లోకమున నిబంధింప బడినవి. 3. సాధారణముగా నాయిక ఏడ్చుటతో నాయకుడు కరిగి పోవుట జరుగును. నాయిక ఏడ్చునట్లు చేసి నాయకుడు ఆమెను లాలించుట జరుగును. ఇది పురుషునకు వినోదము. నాయిక కన్నీరు విడుచుట ఆమె యొక్క ఓటమి కాదు. పైగా నాయకుని మరింత విధేయునిగా నొనర్చి ఆమెకును పిమ్మట మరింత సంతోషమును కలిగించుటకు సాధనమే అగును. ఈ సామాన్యార్థమీ శ్లోకములోని ప్రస్తుత విశేషాంశోపన్యాసమునే బోధించినది కావున ఇటు వ్యంగ్యముగా అప్రస్తుత ప్రశంసా

లంకారమున్నదన వచ్చును. 4. పశ్యామః అను క్రియ బహువచనాంతము, అసత్పదము యొక్క ఏకవచనముచే కర్త బోధింపబడినందున క్రియయు నేక వచనాంతము నసే ఉండ వలసి యుండగా బహువచనాంతమున నుండుట వచన భేద దోషము. దీనిని నిరాకరించుటకు పశ్యేయమ్ అనిని చదువుకొన వలెనని అట్లే రెండవ పాదమున శశ శబ్దానంతరము ప్రయోగింపదగిన ఇతి శబ్దము వాక్యమధ్యమున ప్రయోగింపబడినదని చతుర అను విశేషణము జడమగు నవస్థాంతరమున కనుప పన్నము. కావున దానిని దంపతుల యందు పర్యవసించునట్లు లక్షణ మాశ్రయింప వలెనని వ్యాఖ్యాత అర్జున వర్మదేవుడు తెలిపినాడు. ఇటువంటి లక్షణను ఆంగ్లమున 'ట్రాన్స్ఫర్ ఆఫ్ ఎపిథెట్' అని యందురు. ఈ లక్షణ నాశ్రయింపగా ఫలించిన యర్థము విలక్షద్దృష్టియే. అవస్థాంతరమనుట దీని తాత్పర్యము అనియు వ్యాఖ్యాత చెప్పినాడు. 5. ఈ శ్లోకము యొక్క అర్థము, విమనస్కుడవై యున్నట్లు కనబడు చున్నావేమి యని యడిగిన వానికి నాయకుడిచ్చిన సమాధానము అని వ్యాఖ్యాత అవతారికగా చెప్పినాడు. కాని బాష్పమోక్షము తన ధృతిని హరించినదని చెప్పుట నాయకుని తదనంతర సురతఫలప్రాప్తివ్యంజ్య మానమగుటచేత వ్యాఖ్యాత యొక్క అవతారిక సముచితముగా నున్నట్లు తోచదు. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పై శ్లోకమున నాయకుని సవ్యాజహాసముచే నాయిక యొక్క కోపము, నాయిక కన్నీటిచే నాయకుని ధృతి తొలగినట్లు చెప్పబడినది. ఈ శ్లోకమున కాలము చేతనే ఇరువురి బెట్టు స్వాభావికముగనే సడలినదని చెప్పబడు చున్నది.

శ్లో॥ పరిమ్లానే మానే ముఖశశిని తస్యాః కరధృతే
మయి క్షీణోపాయే ప్రణిపతనమాత్రైక శరణే।
తయా పక్ష్మప్రాంత ధ్వజపుట నిరుద్ధేన సహసా
ప్రసాదో బాష్పేణ స్తన తటవిశీర్ణేన కథితః॥ 25

ప్ర॥ మానే- కోపము; పరిమ్లానే- వాడిపోగా; తస్యాః- ఆమెయొక్క; ముఖశశిని - ముఖచంద్రుడు; కరధృతే- చేతియందు ధరింపబడగా; క్షీణోపాయే- క్షీణించిన ఉపాయములుగల; మయి- నేను; ప్రణిపతనమాత్రైకశరణే - పాదములపై పడుట యొక్కటియే దిక్కుగల వాడనయియుండగా; సహసా- క్షణ కాలము; పక్ష్మప్రాంత ధ్వజపుట నిరుద్ధేన- జెండాలవంటి ఱెప్పల చివరల అడ్డగింపబడిన; స్తనతట విశీర్ణేన- స్తనముల పై భాగములలో పడి చెదరిన; బాష్పేణ - కన్నీటితో; తయా- ఆమె చేత; ప్రసాదః - చిత్తనైర్మల్యము లేక కోపము తొలగుట; కథితః- చెప్పబడినది.

తా॥ కోపము తనకుతానే వాడిపోగా ఆమె ముఖ చంద్రుని తనచేత పట్టుకొనగా అన్ని ఉపాయములు విఫలములు కాగా పాదములపై పడుట ఒక్కటే మిగిలి యుండగా విశాలములైన ఆమె ఱెప్పలలో క్షణమాగి కఠినములైన స్తనములపై బడి చెదరి పోయిన కన్నీటితో తనకోపము తొలగిపోవుటను చెప్పినది.

వి॥ 1. కాలమే కొన్ని సమస్యలను పరిష్కరించును. నాయిక కోపముతో విముఖముగానున్నప్పుడు నేనెన్ని యుపాయముల పన్నినను ఆమె కోపమును మాన్పలేక పోయినాను. చివరికామె పాదములపై పడుట యొక్కటే మిగిలినది. మరి కొంచెము సేపయినచో తాళలేక ఆమె పాదములపై పడిపోయి యుండెడి వాడినేమో కాని అంతలోనే ఆమె నేత్రముల నుండి కన్నీరు స్తనములపై పడి నాకు కనిపించినది. ఆమెకు కోపము పోయినదని అశ్రుపాతము హేతువుగా అనుమానించి నాను; అను నర్థమును వ్యక్తమొనర్చు వాక్యములీ శ్లోకమున నున్నవి. 2. ముఖము నందరి శశిత్వాకోపము ముఖశశి యను సమాసముచే చెప్పబడుటచే రూపకాలంకారము ఈ శ్లోకమున నున్నది. పక్ష్మప్రాంతధ్వజపుట అను సమాసమును ధ్వజముల ఆరోపము, పక్ష్మప్రాంతములందు చెప్పబడుటచే నేర్పడిన రూపకాలం కారము ఆమె కన్నుల ధైర్యమును వ్యంజింప జేయును. ముఖచంద్రుని చేత బట్టు కొనుట ఆమె ధైర్యమును వ్యంజింపజేయును. రాహువుచేత చంద్రుడు పట్టుకొన బడినట్లు ముఖచంద్రుడు ఆమె పడగవంటి చేత పట్టు కొనబడినదని ముఖచంద్ర రూపకము వ్యంజింపజే యును. 'స్తనతట' అను సమాసములోని తట శబ్దము స్తనముల అహీనత్వమును 'విశీర్ణిన' అను పదము వాని కాఠిన్యమును వ్యంజింప జేసి నాయిక యొక్క స్తనసౌభాగ్యము నభివ్యంజింప జేయుచున్నది. అశ్రుపాతము హేతువుగా అనుమేయమైన నాయికకోపత్యాగము నాయకుడను మానించుటచే నీ శ్లోకమున ననుమానాలంకారమున్నది. మేఘముల నుండి కొండలపై నీరు పడునట్లు మేఘముల వంటి కన్నుల నుండి కొండల వంటి స్తనములపై బాష్పము పడినట్లు వర్ణించుటకు శిఖరిణీ వృత్తమును కవి యుపయోగించుట సముచితముగా నున్నది.

అవ॥ పై శ్లోకమునందు నాయిక యొక్క నిర్హేతుక మానము తచ్ఛాంతియు వర్ణింపబడినది. ఈ శ్లోకము నాయిక యొక్క సహేతుక మానము నాయకుని ఆలింగనము అను హేతువు చేతనే శాంతించుట చెప్పబడుచున్నది.

శ్లో॥ తస్యాః సాన్ద్రవిలేపన స్తనయుగ ప్రశ్లేషముద్రాంకితం
కిం వక్షశ్చరణానతి వ్యతికర వ్యాజేన గోపాయ్యతే।

ఇత్యుక్తే క్వ తదిత్యుదీర్య సహసా తత్సంప్రమార్ష్టుం మయా
సాశ్లిష్టా రభసేన తత్సుఖవశా త్తస్యాశ్చ తద్విస్మృతమ్॥ 26

ప్ర॥ తే-నీ యొక్క; వక్షః-ఱొమ్ము; తస్యాః-ఆమెయొక్క; సాంద్రవిలేపన స్తనయుగ ప్రశ్లేషముద్రాంకితమ్-దట్టమైన పూతగల చన్నుదోయి ఆలింగనముచేత కలిగిన చిహ్నముచే అంటుకొన బడిన; వక్షః-ఱొమ్ము; చరణానతి వ్యతికరవ్యాజేన-పాదములపై బడుట అనుపని యొక్క మిషచేత; గోపాయ్యతే కిమ్-దాచబడుచున్నదా యేమి; ఇతి-అని; ఉదీర్య-పలికి; సహసా-వెంటనే; తత్ -దానిని; సంప్రమార్ష్టుమ్-తుడుచుటకు; రభసేన-గట్టిగా; మయా-నాచేత; సా-ఆమె; ఆశ్లిష్టా-కౌగలించుకొన బడినది; తత్సుఖవశా త్-ఆ సుఖమునకు లోనగుటవలన; తస్యాఃచ-ఆమెకును; తత్-అది; విస్మృతమ్-మరపునకు వచ్చినది.

తా॥ అన్యాంగనా లింగనము చేత నాయకుని ఱొమ్మున చిహ్నమేర్పడినది. దానిని దోచుటకు ఆమె పాదములపై బడుటకు నాయకుడు ప్రయత్నించగా అది గమనించిన నాయిక దాచుచున్నావా అని నాయకునడుగ నాతడు అది యెక్కడ అనుచునే ఆమెను గట్టిగా(ఆ చిహ్నము రాలిపోవునట్లుగా) ఆమెను కౌగలించు కొన్నాడు. ఆ సుఖముచే ఆమె ఆ చిహ్నము సంగతి మఱచినది.

వి॥ 1. నాయిక నాయకుని అపరాధమును గుర్తించినను నాయకుడు భయపడ లేదు కావున ఇచట నాయకుడు ధృష్టుడు. అన్యాంగనాస్తనాంగరాగ చిహ్నితమైన నాయకుని వక్షము చూచినది. నాయకుడు దాచదలచి ఆమె పాదములపై పడ బోయినాడు. అంతలోనే ఆమె గుర్తించినది. నాయకుడు సమయస్ఫూర్తితో ఆమెను గట్టిగా కౌగిలించుకొని ఆ అంగరాగము రాలిపోవునట్లు చేసెను. ఆమెయు ఆలింగన సౌఖ్యమునకు లోబడి ఆ సంగతే మఱచినది అనునర్థమొసగు వాక్యములీ శ్లోకమున నున్నది. 2. ఈ శ్లోకమున పిహితాలంకారమున్నదని వ్యాఖ్యాత అర్జునవర్మదేవుడు చెప్పినాడు. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పై శ్లోకమున ధృష్ట నాయకుడు వర్ణింప బడినాడు. ఈ శ్లోకమున అనుకూల నాయకుడు వర్ణింపబడుచున్నాడు.

శ్లో॥ త్వమ్ముగ్ధాక్షి! వినైవ కంచులికయా ధత్సే మనోహారిణీం
లక్ష్మీమిత్యభిధాయిని ప్రియతమే తద్వీటికా సంస్పృశి
శయ్యోపాంతనివిష్ట సస్మిత సఖీ నేత్రోత్సవానన్దితో
నిర్యాతః శనకైరలీకవచనోపన్యాస మాలీజనః॥ 27

ప్ర॥ ముగ్ధాక్షి- ఓ అందమైన కనులగలదానా; త్వమ్- నీవు; కంచులికయా- రవిక; వినైవ- లేకుండనే; మనోహారిణీమ్-హృదయమునాకర్షించు; లక్ష్మీమ్- కాంతిని; ధత్సే- ధరించుచున్నావు; ఇతి- అని; అభిధాయిని-చెప్పు; ప్రియతమే- ప్రియతముడు; తద్వీటికా సంస్పృశి- దానిముడిని తాకువాడుకాగా; శయ్యోపాన్తనివిష్టసస్మిత సఖీనేత్రోత్సవానన్దితః- శయ్యదగ్గఱ కూర్చొన్న చిరునవ్వుతో కూడిన చెలికత్తెల యొక్క కనువిందుతో అనందింప జేయబడిన; ఆలీజనః-చెలికత్తెల గుంపు; శనకైః- మెల్లగా; అలీకవచనోపన్యాసమ్- అసత్యవచనములనుచు; నిర్యాతః- బయటుకు వెడలి పోయినది.

తా॥ ఓ ముగ్ధాక్షీ! నీవు రవిక లేకుండగనే శోభించెదవని ప్రియురాలి యొక్క రవిక ముడిని తాకినాడు నాయకుడు. అప్పుడు నాయిక తన చెలికత్తెలవైపు చూచినది. దాని సంకేతమును గ్రహించి అక్కడి నుండి చెలికత్తెలు ఏదో పని యున్నదని అసత్యము పలుకుచు బయటికి వెడలిపోయినారు.

వి॥ 1. ఒక యజమానురాలికి కొందఱు చెలికత్తెలున్నారు. వారు నాయిక రవిక చీర సొమ్ములు మొదలుగవానితో నలంకరించుచునో లేక యామె చెప్పిన శయ్యాగృహము నలంకరించుట మొదలగు పనులలోనో యున్నారు. ఇంతలో నాయకుడు మదనతాపుడై వచ్చి నాయికను సమీపించి రవిక లేనప్పుడే నీయందము మనము నపహరించునని పలుకుచు ఆమె రవిక ముడిని తాకినాడు. ఆ గది లోనే ఉన్న ఆమె చెలికత్తెల నాతడు చూడనేలేదు. నాయిక మాత్రము వారి వైపు చూచినది. దాని యర్థమే మనగా నాయకుడు మదనాతురుడై యున్నాడు. మీరు గది నుండి వెడలిపోకముందే నామీద అనురాగమును బహిరంగ పఱచుచున్నాడు. చూచితిరా ఆయన తొందఱ; ఇక మీరు బయటకు పొండు అనుట, అపుడు చెలికత్తెలే ఏదో పని యున్నదని చెప్పుచు ఒక్కొక్కతే బయటకు పోయినారు. అను నర్థము వ్యంజింపజేయు వాక్యములీ శ్లోకమున నున్నవి. 2. ఈ శ్లోకమున కొందఱు చెలికత్తెలు చూచినదే అభిధేయమ్మై యున్నందున విభావనాలంకార మేర్పడినదని సఖీజనులు అసత్యములు చెప్పుచు వెడలి పోయినారని చెప్పుటచే నాయకుని సంభోగేచ్ఛ అర్థశక్తి మూలమున వ్యంగ్యమైనదని వ్యాఖ్యాత చెప్పినాడు. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పూర్వశ్లోకమున సఖీజన సమక్షమున కూడమానమును ప్రదర్శింప లేక సఖీజనమునే బయటికి పంపు నాయిక యొక్క వృత్తాంతము వర్ణింపబడినది. ఈ శ్లోకమున సఖీజనులు లేని యేకాంతమున మాన ప్రదర్శనమున విఫలత నొందిన నాయిక యొక్క అశక్తత వర్ణింపబడుచున్నది.

శ్లో॥ భ్రూభఙ్గే రచితేఽపి దృష్టిరధికం సోత్కణ్ఠముద్వీక్షతే
రుద్ధాయామపి వాచి సస్మిత మిదం దగ్ధాననం జాయతే।
కార్కశ్యం గమితేఽపి చేతసి తనూ రోమాంచ మాలంబతే
దృష్టే నిర్వహణ మ్భవిష్యతి కథ మ్మానస్య తస్మిఞ్జనే॥ 28

ప్ర॥ భ్రూభఙ్గే - కనుబొమముడి; రచితే అపి-చేయబడినను; దృష్టిః-చూపు; అధికమ్-మిక్కిలి; సోత్కణ్ఠమ్-ఉత్కణ్ఠతో; ఉద్వీక్షతే-పైకిచూచును; వాచి-వాక్కు; రుద్ధాయామ్ అపి-అడ్డగింపబడినను; ఇదమ్-ఈ; దగ్ధాననమ్-పాడు మొగము; సస్మితమ్-చిఱునవ్వుతోకూడినది; జాయతే-అగుచున్నది; చేతసి-మనస్సు; కార్కశ్యమ్-కఠినత్వము; గమితే అపి-పొందింపబడినదను; తనుః-శరీరము; రోమాంచమ్-గగుర్పాటును; ఆలమ్బతే-అవలంబించు చున్నది; తస్మిన్-ఆ; జనే-మనుష్యుడు(ప్రియుడు); దృష్టే-చూడబడగా; మానస్య-కోపముయొక్క; నిర్వహణమ్-కొనసాగించుట; కథమ్-ఎట్లు; భవిష్యతి-కాగలదు.

తా॥ మీరు చెప్పినట్లు కనుబొమ్మలను ముడివేసితిని, కాని నా చూపు ఆతని చూచుటకే తహతహతో యత్నించుచున్నది. మాట నోటి నుండి బయటకు రాకుండ అడ్డగించినాను, కాని నా యీపాడుమొగము చిఱునవ్వును పులుముకొనుట మాన లేదు. మనసును రాయిచేసి కొన్నాను, కాని దేహము రోమాంచ కంచుకితము కానే అయినది. ప్రియుని చూచిన పిమ్మట ప్రణయ కోపమును కొనసాగించుట నా తరమా!

వి॥ 1. ప్రియే అనుటకు బదులుగా తస్మిన్ జనే అనుట అనిర్వచనీయ చమత్కారము (మహిమ) కలవాడా ప్రియుడు అని వ్యంగ్యమగును. దగ్ధాననమ్ అను సమాసములోని దగ్ధ శబ్దము ముఖము పట్ల తన ధిక్కారమును ప్రకటించుటను సూచించునే కాని కాలిన అను నర్థము నొసగదు. ఉద్వీక్షతే పైన చూచుచున్నదనుట చేత నాయిక కన్న పురుషుడు పొడవుగ ఉన్నాడని వ్యంగ్యమగును. కోపమును ప్రదర్శింపుమని చెలికత్తెలు చెప్పిరి. నాయిక అట్లు చేయుటకే నిశ్చయించుకొన్నది. కావున ప్రియుడు కనబడగానే కోపమును నటించుటకు నాయిక కనుబొమ్మముడి వేసినది కాని అతని చూచు నుత్కణ్ఠను అణుచుకొనలేక పోయినది. మాట్లాడుటకు నోరు తెఱవలేదు కాని తన నటన తనకే చిఱునవ్వును కల్గించినది. తన బలహీనత తనకే చిఱునవ్వు కలిగించినది. నాయకుని చూడక ముంద అతడు చేసిన అపరాధముల తలచుకొని కాని లేక చులకన కాకుండుటకై కాని బెట్టు చూపవలెనను కొందును,

కాని ఆతడెదురు పడగానే మంత్రము వేసినట్లు నా కోపము పారిపోవునను అర్థము నిచ్చు నాయిక వాక్యములీ శ్లోకమున నున్నవి. 2. చెలికత్తెల ప్రశ్నల కుత్తర మిందుండుటచే నుత్తరాలంకారమేర్పడి యున్నది. కపట కోపమును ప్రదర్శించుటకే చేత కాకుండ నున్నది అనునర్థము వ్యంగ్య మగుచు నాయిక యందలి ప్రేమోత్కర్షము ను వ్యంజింప జే యుచున్నది. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పై శ్లోకమున ప్రియుని దర్శనమున నాయిక కోపము మాయమగుట చెప్పబడినది. ఈ శ్లోకమున కోపమును ప్రదర్శింపలేని నాయిక యొక్క అశ్రుపాతము వర్ణింప బడుచున్నది.

శ్లో॥ సా పత్యుః ప్రథమేఽపరాధ సమయే సఖ్యోపదేశం వినా
నో జానాతి సవిభ్రమాంగ వలనా వక్రోక్తి సంసూచనమ్।
స్వచ్ఛై రచ్ఛకపోలమూలగలితైః పర్యస్త నేత్రోత్పలా
బాలా కేవల మేవ రోదితి లుఠల్లోలోదకై రశ్రుభిః॥29

ప్ర॥ సా-ఆ; బాలా-బాల; పత్యుః-భర్తయొక్క; ప్రథమే-మొదటి; అపరాధ సమయే-తప్పుచేసిన సమయమున; సఖ్యోపదేశమ్‌వినా-చెలికత్తె యుపదేశము లేక; సవిభ్ర మాంగ వలనావక్రోక్తి సంసూచనమ్-విలాసపు శరీరపు కదలికలను వక్రోక్తిని సూచించుటను; నోజానాతి-ఎఱుంగదు; పర్యస్త నేత్రోత్పలా-త్రిప్పినకలువల వంటి కన్నులు కలదై; స్వచ్ఛైః-నిర్మలములైన; అచ్ఛకపోల మూలగలితైః-నిర్మలములైన కపోలముల మూలములందు రాలిన; లుఠల్లోలోదకైః-జారుచున్న చంచలములైన నీరుగల; అశ్రుభిః-కన్నీళ్ళచేత; కేవలం-కేవలము; రోదితి ఏవ-ఏడ్చుట మాత్రము చేయు చున్నది.

తా॥ తొలిసారి భర్త అపరాధము చేసిన సమయమున విలాస ప్రదర్శనముతో కూడిన ఎత్తి పొడుపు మాటలను పలుకుట యెఱుంగని ఆ బాల చూపు మరల్చి స్వచ్ఛ మైన కన్నీరు చెంపలపై కారు నట్లేడ్చుట కన్న ఆమె ఏమి చేయుగలదు.

వి॥ 1. బాల అనుటచే నాయిక ముగ్ధయని సూచించ బడినది. కావున భర్త మొదటిసారి అపరాధము చేసి వచ్చినప్పుడు కసరుకొన లేకపోయినది. అట్లని భర్త అపరాధమును సహింపను లేక పోయినది. బేలయై కన్నీరు కార్చినదను అర్థమొసగు వాక్యములీ శ్లోకమున నున్నవి. 2. రెండవ పాదమందలి దీర్ఘసమాసముచేత భర్త అపరాధము చిన్నది కాదని చాలసేపు దానిని గూర్చి ఆలోచించినదని ప్రియుడు సవిభ్రమాంగవలనములను వక్రోక్తులను ఎఱుంగక పోవుట అను ముగ్ధ యొక్క

స్వభావమును తెలియును. 'స్వచ్ఛైః' అనుటచేత ఏడ్చుటచే కాటుక పోయినదని తెలియును. రోదితి ఏవ- ఏడ్చుచునే యున్నదనుట చేత భర్త అనునయము దీర్ఘముగా నున్నను భర్త ఆలస్యముగా వచ్చుటయను అపరాధమునే గుర్తించినది. కాని పరాంగనా సంగమము నామె పసికట్టలే దని వ్యంగ్యమగు చున్నది. సఖ్యోపదేశం వినా అనుటచే చెలికత్తెలామె కింకను ఏర్పడ లే దని వారేర్పడి, భర్త యొక్క ప్రథమాపరాధము చేసి వచ్చు సమయమున ఎట్లు ప్రయత్నింపవలెనో ఉపదేశించి యుండక పోవుటచే ఆమె స్వాభావికముగా ప్రవర్తించినదను నర్థము వ్యంగ్యమగు చున్నది. (సా) 'పత్యుః' అని యనుట చేత ఈ శ్లోకార్థము యొక్క వక్త తటస్థుడని వ్యంగ్యమగు చున్నదని అందుచేతనే కాంతస్య అను పాఠము సముచితముగా నుండునని వ్యాఖ్యాత అర్జున వర్మ దేవుడు చెప్పినాడు. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పై శ్లోకమున భర్త అపరాధియైనను ఆయన నెత్తిపొడవని మాట్లాడుట చేతగాని ముగ్ధ యొక్క వృత్తాంతము వర్ణింపబడినది. ఈ శ్లోకమున ప్రౌఢ యొక్క ఎత్తి పొడుపు మాటలు చెప్పబడుచున్నవి.

శ్లో॥ భవతు విదితం వ్యర్థాలాపై రల మ్ప్రియం గమ్యతాం
తనురపి న తే దోషోఽస్మాకం విధిస్తు పరాఙ్ముఖః।
తవ యది తథారూఢ మ్ప్రేమ ప్రపన్నమిమాం దశాం
ప్రకృతి తరలే కా నః పీడా గతే హతజీవితే॥ 30

ప్ర॥ ప్రియ- ఓ ప్రియుడా; విదితమ్-తెలియబడినది; భవతు-ఉండనిమ్ము; వ్యర్థాలాపలైః-వృథా ప్రసంగములు; అలమ్-చాలును; గమ్యతామ్-పొమ్ము; తనుః అపి-అల్పముకూడ; తే-నీయొక్క; దోషః-తప్పు; న-లే దు; అస్మాకమ్-మాకు; విధిః తు-దైవమే; పరాఙ్ముఖః-ప్రతికూలము(గానున్నది); యది-ఒకవేళ; తథా-ఆవిధముగా; ఆరూఢః-మిక్కిలిలోతుగానాటుకొన్న; ప్రేమ-ప్రేమ; ఇమామ్-ఈ; దశామ్-దశను; ప్రపన్నమ్-పొంది యున్నచో; ప్రకృతి తరలే -సహజముగా చంచలమైన; హతజీవితే-పాడుజీవితము; గతే-పోయినను; నః-మాకు; పీడా-బాధ; కా-ఏది;

తా॥ యదార్థమేమో నాకు తెలిసినది. అది అట్లుండనీ, ఇప్పుడు నీయొక్క వ్యర్థాలాపములు చాలించి ఇక్కడ నుండి వెడలిపొమ్ము నీ దోషము కొంచెము కూడ లే దు. మా దురదృష్ట మిట్లున్నది. అంతలోతుగా నాటుకొన్న నీప్రేమ యిప్పుడీ దశకు చేరుకొన్నది. సహజముగా చంచలమైన మాజీవితము పోయినను మాకు బాధలే దు.

వి॥ నిన్ను విడిచి బ్రతుక లేను అను నిట్టి నీ మాటలు వ్యర్థాలాపములు. నామీది దాక్షిణ్యముతో చెప్పునట్టివే కాని సత్యములు మాత్రము కావు. యధార్థమేమో నాకిదివఱకే తెలిసిపోయినది. ఇంకను నీ మాటలు నమ్మెద ననుకొన్నావా? ఇకచాలు ఇక్కడి నుండి వెళ్ళి పోవుట నీకును నాకును మంచిది. ఇక్కడనే యుండిన నీకు నటన ప్రయాసమధికమగునే కాని ప్రయోజనమేమియు నుండబోదు. జరిగిన దానిలో నీదోషము కొంచెము కూడ లేదు. నాదురదృష్ట మిట్లుండ పాపము నీవేమి చేయుగలవు. అంతలోతుగా నాటుకొని యుండిన ప్రేమయే ఇప్పుడీ దశకు చేరినప్పుడు సహజచంచలమైన ఈ పాడు జీవితమీ పాటికి పోయి యుండవలసినది. అది యుప్పటికిని పోకున్నను ఇక కొంతకాలమైన పిమ్మట పోవుట నిశ్చయము. మరణమునకు సిద్ధమైన నాకు నీ ప్రవర్తనచేత ఏమి బాధ కలుగును. ఆ బాధ మరణము కన్న గొప్పది. కావుననే మరణమునకు నిశ్చయించుకొన్నాను. నీ అపరాధము నిజముగా అంత తీవ్రమైనదే కాకున్న చావవలె నని నేనేల నిశ్చయించు కొందును. ఈ అర్థము నొసగు వాక్యములీ శ్లోకమున నున్నవి. 2. నీ దోషము కొంచెము గూడలేదు. అను వాక్యము విపరీత (నిషేధ) లక్షణావృత్తిచే నీయపరాధము సహింపరానిది అనునర్థము లక్ష్యమగును. భర్త నేకవచనమున సంబోధించి నాయిక 'అస్మాకమ్'' నః' అని తన విషయమున బహువచనము నుపయోగించుట నీకు నాకు సంబంధము లేదను మాటను వ్యంజింపచేయును. ప్రకృతి తరలైః అను మాట నాయిక వైరాగ్యమును తెలుపును. శృంగారపు రసమునకు వైరాగ్యము విరోధి కావున నిన్ను ప్రియునిగా బొందిన నాజీవితము ధన్యమైనది అనునర్థము నొసగు అకృత విఫలే (విఫలము చేయబడని) అను పాఠాంతరమును చెప్పుచున్నాము. అని వ్యాఖ్యాత అర్జునవర్మ దేవుడు చెప్పినాడు. నాయకుని అన్యాసక్తి లక్షణమునకు నాయిక గాఢ ప్రేమకు అంతరము వ్యక్తమగు చున్నందున ఈ శ్లోకమున భావమను అలంకారమున్నదనియు చెప్పినాడు. వృత్తము హరిణి.

అవ॥ పై శ్లోకమున ఖండితా నాయిక యొక్క నైరాశ్యముతో కూడిన మరణోద్యోగము సూచింపబడినది. ఈ శ్లోకమున ప్రియసంగమ కాంక్షతో అభిసారికా నాయిక యొక్క అభిసరించుట చెప్పబడుచున్నది.

శ్లో॥ ఉరసి నిహితస్తారో హారః కృతా జఘనే ఘనే
కలకలవతీ కాంచీ పాదౌ రణన్మణి నూపురౌ।
ప్రియ మభిసరస్యేవ మ్ముగ్ధే త్వమాహతడిండిమా
యది కి మధిక త్రాసోత్కమ్పం దిశ స్సముదీక్షసే॥ 31

ప్ర॥ ఉరసి-ఱొమ్మున; తారః-ముత్తెములతో కూర్చబడిన; హారః-హారము; నిహితః-ఉంచుకొన బడినది; ఘనే-లావైన; జఘనే-కటియందు; కలకలవతీ-ధ్వనించు; కాంచీ-మొలనూలు; కృతా-చేయబడినది; పాదౌ-పాదములు; రణన్మణి నూపురౌ-ధ్వనించు మణి మంజీరములు కలవి; ముగ్ధే!-ఓ అమాయకురాలా; ఏవమ్-ఇట్లు; యది-ఒకవేళ; ఆహతడిండిమా-నగారాను మోగించు చున్నదానవై; ప్రియమ్-ప్రియుని; అభిసరసి-చేరబోవుచున్నావో; అధికత్రాసోత్కమ్పమ్-మిక్కిలి భయముతోడి వణుకు కలుగునట్లు; దిశః-దిక్కులను; కిమ్-ఏల; సముదీక్షసే-చూచుచున్నావు.

తా॥ వక్షమున ముత్తెముల హారమును కటియందు గజ్జెల ఒడ్డాణమును, పాదములందు హంసకములను, ధరించి ప్రియునికడకు బహిరంగముగా నభిసరించు చున్నావు కదా! భయముతో దిక్కులను వణకుచు చూచెదవేల?

వి॥ 1. ఒక నాయిక ప్రియు నభిసరింపబోవు చున్నప్పుడామె చెలికత్తె యొకతె చూచి ఓసి అమాయకురాలా అభిసరింపబోవు నప్పుడు గుట్టుచప్పుడు కాకుండ పోవలె. ముత్తెముల హారములు వేసికొన్నచో వాని వెలుగుచే నీ అభిసరణ యత్నము బయటపడి పోవును గదా! గజ్జెల యొడ్డాణమును గలగలలాడు మంజీరములను ధ్వనికి నిన్నొరులు చూచెదరుకదా! ఇట్లీల బహిరంగముగ నాయకునికడకు పోవుచున్నావు. నీవు వట్టి అమాయకురాలవు. నీకభిసరించుట తెలిసినట్లు లేదు ఇట్లు నగారా మ్రోగించుచు అభిసరింపవలెనా? పోనీ అట్లు తెగించిన దానవే అగుదువేని, భయముతో వణకుచు దిక్కులను చూచుట యేమి? త్వరగా దిక్కులను చూచుట మాని ప్రియునికడకు పొమ్ము అను నర్థమిచ్చు వాక్యములీ శ్లోకమున నున్నవి. 2. నాయకుడు రమ్మన్నచోటికి పోవు నాయిక అభిసారిక యనబడును. సాధారణముగా పగటిపూట లేక వెన్నెలలో నిర్భయముగా వేశ్యలైన నాయికలభిసరింతురు. పరపురుషునభిసరించగోరు స్త్రీలా పనిని రాత్రిపూట చీకటిలో గుట్టుగా నాయకుని కడకు పోవుదురు. బహిరంగముగానభిసరించు స్త్రీలను ఉజ్జ్వలాభిసారికలందుము. వారు వెన్నెలలో నభిసరించినప్పుడు జ్యోత్స్నాభిసారికలన బడుదురు. చీకటిలో నభిసరించు నాయికలు తమోఽభిసారికలన బడుదురు. వీరు సాధారణముగా ఒంటి నిండ ముసుగు ధరించెదరు. ఈ శ్లోకమున నాయిక ధరించిన హారములు కాంచీ మంజీరముల ననుసరించి ఉజ్జ్వలాభిసారికయే యని చెప్పనగును. అయినను మొదటి సారికా వచ్చును. భయముతో నభిసరించు చున్నది. అనియు చెప్పనగును. కాని చెలికత్తె ఈమె గుట్టుగా పోవలసియున్నదని ఆ గుట్టును రట్టు చేయుటకు హారములు

మెఱయుచు కాంచీ మంజీరములు మెఱయుచు రట్టురట్టు చేయునుగదా అని ప్రశ్నించుటను బట్టి, ఆమె నాయకునందలి గాఢానురాగముతో నాతని విరహమును సహింపలేక తొందఱలో నే సొమ్ములు ధరింపవచ్చునో ఏవి గుట్టురట్టు చేయునో ఏవి అభిసరణో చితములో ఏవి రహస్యమును కాపాడునో అను నంశములు విచారింపకయే బయలు దేరినదని తెలియుచున్నది. ఇట్లు చేయుట వలన అభిసారిక స్వయముగానే అభిసరింప బోవు చున్నానో యని డప్పుగొట్టిచాటినట్లైనది. పక్కింటి చెలికత్తె ఆ సొమ్ముల ధ్వని విని బయటకు వచ్చి ఈ నాయికను నిలువరించి ప్రశ్నించి నట్లును స్పష్టమగు చున్నది. అందువలన ఈమె తమోఽభిసారిక యనియే చెప్పవచ్చును. ఈమె వేశ్య యనుటకు రాత్రి కాలమనుకొను యాధారములు కవి చూపక పోవుటచే ఈ నాటి ఆధునిక కన్య వంటి కన్య కావచ్చునని ఊహించుకొన వచ్చును. కాని ఆధునిక కన్య అటువంటి సొమ్ములు ధరింపదు. కాని ఆమె అహిత కాలపు ధ్వనించు సొమ్ములనే ధరించినదని ఊహించు కొనవచ్చును. 3. ఈ నాయిక పరస్త్రీయని వ్యాఖ్యాత అర్జునవర్మదేవు డూహించి, వ్యభిచరించు స్త్రీల అభిసరణ ము పగలు కాని రాత్రికాని ఉద్యానమునకాని శూన్య ప్రదేశ మున కాని ఇట్టి మరేదైనా రహస్యము దాచుచోటు కావలె నను శృంగార శాస్త్ర వాక్యముల నుదహరించినాడు. ఇందు అలంకారము విషమాలంకార మనియు చెప్పినాడు. 4. తార అను హార విశే షణ మును బట్టి రణ న్మణి, యనునూ పురవిశే షణ మును బట్టి నాయిక సంపత్తి ఘనే అను జఘన విశే షణ ముచే నామె సౌందర్యమును వ్యంజి తములగుచున్నవి. త్రాసోత్కమ్పమ్ అను చెలికత్తె యొక్క ప్రయోగముచే నీవసలు భయము లే ని దానవే కాని భయముతో వణ కు నభినయించు చున్నావని అట్లే ధ్వనించు సొమ్ములను ప్రకాశించు ముత్తెముల హారమును ధరించిన నీవు తెగించిన దానివని జెప్పుచున్నట్లు అనుకొనవలె ను. నీ యీవణ కు హృదయములోని ప్రేమవలన జనించిన సాత్త్విక భావము కావచ్చునని మొత్తము మీద నీవు గడుసు దానవే అను చెలికత్తె మనసులోని భావమును వ్యక్తీకరించుచున్నది. దిక్కులేల చూచు చుంటివను మాటనే పైకి ప్రేమతో వేగముగా ప్రియునికడకు వెడలు మని వ్యక్తమగుచున్నను నీకీ యదృష్టము పట్టినది. కాని నాకిట్టి అదృష్టము పట్టులేదను గూఢమైన అసూయ వ్యక్తమగు చున్నది. వృత్తము హరిణీ.

అవ॥ పై శ్లోకమున సంకే తస్థలమున నెదురు చూచుచున్న నాయకుని సమాగమమునకై స్వయముగా అభిసరించు అభిసారిక వర్ణింపబడినది. ఈ శ్లోకమున దూరదేశగతుడైన నాయకుని రాక కొఱకెదురు చూచుచు మేఘముతో మాట్లాడు చున్న ప్రోషిత భర్తృక వర్ణింపబడు చున్నది.

శ్లో॥ మలయమరుతాం వ్రాతా వాతా వికాసిత మల్లికా
పరిమలభరో భగ్నో గ్రీష్మ స్త్వముత్సహసే యది।
ఘన ఘటయితుం తం నిఃస్నేహం య ఏవ నివర్తనే
ప్రభవతి గవాం కిం నశ్ఛిన్నం స ఏవ ధనఞ్జయః॥ 32

ప్ర॥ మలయమరుతామ్-మలయపర్వతమునుండి వచ్చుగాలుల యొక్క; వ్రాతా-గుంపులు; వాతః-వీచిపోయినవి; వికాసిత మల్లికాపరిమలభరః-పూయించిన మల్లెపూల పరిమల భారముగల; గ్రీష్మః-గ్రీష్మము; భగ్నః-అవమానపడినది; ఘన-ఓ మేఘమా; త్వమ్-నీవు; యది-ఒకవేళ; నిస్స్నేహమ్-స్నేహముకోల్పోయిన; తమ్-అతనిని; ఘటయితుమ్-కూర్చుటకు; ఉత్సహసే-ఉత్సాహము చూపెదవేని; నః-మాకు; కిమ్-ఏమి; ఛిన్నమ్-పోయినదగును; యః-ఎవడు; గవామ్-గోవులయొక్క; నివర్తనే-మఱల్చుట యందు; ప్రభవతిఏవ-సమర్థుడే అగునో; సఃఏవ-వాడే; ధనఞ్జయః-అర్జునుడు.

తా॥ మలయమారుతములు వీచి పోయినవి. వికసింపజేయబడి మల్లెల పరిమళముగల గ్రీష్మము యొక్క తీవ్రత తగ్గినది. ఓమేఘమా! నీవొకవేళ నన్ను నా ప్రియుని కలుపుటకుత్సాహ పడెదవేని నాకేమి నష్టము. ఆవులను మరల్చిన వాడే అర్జునుడుకదా!

వి॥ 1. మలయపర్వతముల నుండి వచ్చు గాలులు మలయమారుతములన బడుచు, ఇవి చైత్రవైశాఖ మాసములలో అనగా వసంత ఋతువులో వీచుచుండును. మలయపర్వతము చందన వృక్షములతో నిండియుండును. చందన వృక్షమునకు మలయజము (మలయపర్వతమున పుట్టునది) అను పేరు కూడ ఉన్నది. పర్వతములపై భాగములలో చల్లగా వుండును. ముఖ్యముగా ఉత్తరమున హిమాలయమునుండి దక్షిణమున మలయ పర్వతమునుండి వీచుగాలులు చల్లగా నుండును. హిమాలయము పైనుండి వచ్చుగాలులలో చల్లదనమున్నను సుగంధిలము లంతగా కాక పోవుటచే వానికి సుగంధ విషయక ప్రాముఖ్యములేదు. మలయపర్వతమున చందన వృక్షముల్ధికములుగా నుండుటచే ఆ పర్వతము నుండి వచ్చు గాలులకు అనగా మలయ మారుతములకు చల్లదనముతో పాటు సుగంధ విషయక ప్రాముఖ్య మున్నది. కావుననే మలయమారుతము ముఖ్యముగా వసంత ఋతువున మదనోద్దీపన విభావముగా ప్రసిద్ధికెక్కినది. చైత్ర శబ్దమునకు వసంతుడను అర్థము కూడ నున్నది. ఆ వసంతుడు మన్మథునకు మిత్రుడు. అందుచేత వసంత ఋతువు పుష్పబహుళమై

సుగంధిలమై యుండుటకు వసంత కాలము కూడా మదనోద్దీపన విభావముగా ప్రసిద్ధి కెక్కినది. మలయమారుతములు వీచిపోయిన వనగా వసంత ఋతువు వచ్చిపోయినదే కాని ప్రియున కొంటరిగా నున్న నాకడకు వచ్చుటకు ప్రేరణ మొసగ లేక పోయినది. గ్రీష్మ ఋతువున మల్లెపూలెక్కువగా పూయును. అందుచే ఆగ్రీష్మకాలము కూడ సుగంధిలమై సమోద్దీపకము. గ్రీష్మకాలమునకు కూడ ప్రియుని నాకడకు వచ్చునట్లు ప్రేరణ మీయ లేక పోయినది. వసంత గ్రీష్మముల తరువాత మబ్బుల కాలము (వర్షా కాలము) వచ్చును. ప్రవాసమేగిన వారందఱు వర్షాకాలము సమీపించగానే తమ స్వగ్రామములకు, స్వగృహములకు చేరుకొందురు. అప్పటికే ప్రవాసమునకేగిన వారికి ప్రియురాలికి దూరముగా ఎనిమిది మాసములు గడచిపోవును. వర్షాకాలము ముగిసిన పిదప వచ్చు శరదృతువులో ప్రవాసమునకై సాహసులు పోవుచుందురు. రాజులు దండయాత్రలకై బయలు దేరుదురు. అట్లు పోయిన వారు భార్యలను వెంట తీసుకొనుట వీలులేని వారు దేశాంతరములలో ధనసంపాదనాది కర్మలలో వ్యగ్రులై భార్యలకు దూరముగా నుందురు. వర్షాకాలము సమీపించు చుండగా అప్పటికే సుదీర్ఘ ప్రయాణము ననుభవించిన నాయకులు ఎప్పుడెప్పుడింటికి చేరి ప్రియురాండ్ర కౌగిళ్ల లో దూరిపోదమా అని యెదురు చూచుచుందురు. కావున మబ్బు వచ్చిన దనగా వారిలోని కామము వృద్ధిచెందును. గ్రీష్మతాపము చేత గ్రీష్మకాలమున నాయకా నాయికలు రాత్రుల చివఱి జాములందో కొంచెము చల్లగానుండు సమయములలో మాత్రమే సంభోగకాంక్షను పొందుదురు. ఇట్లు గ్రీష్మకాలము మల్లెపూల పరిమళముచే భరితమై యుండుటచే కామోద్దీపకమేయైనను వర్షాకాలమంత కామోద్దీపకము గాదు. ఒకవేళ కామోద్దీపకమైనను ప్రవాసులకు ప్రియాశ్లేషము ఘటించు నవకాశము లేదు. వారు ప్రవాసము వీడి స్వగృహముల చేరుకొను కాలము వర్షర్తువు. వర్షర్తువున అనగా మబ్బుల కాలమందు కూడ అప్పటికే ఎనిమిది నెలల విరహముతో గ్రమగ్గిన నాయికా నాయకుల హృదయములలో కామము అధికముగా వృద్ధిచెందును. ఓ మేఘుమా! వసంతగ్రీష్మములు నాప్రియుని నాకడకు చేర్చుటలో వైఫల్యము చెందినను నీవు ప్రయత్నించినచో నాకేమి నష్టము. ప్రయత్నించుము కాని నాప్రియుడు స్నేహము లేనివాడు. బహుమాస విరహము సహింపలేక ఎవతెనో కట్టుకొని యుండినను ఉండవచ్చును. అతడు నా స్నేహమును మఱచి యుండినందున నీ ప్రయత్నము ఫలించునో ఫలింపదో అను సందేహము నాకున్నది. అయినను ప్రయత్నించుటలో నష్టము లేదు కదా! వసంత గ్రీష్మర్తువులే సుగంధిలములగుటచే నధిక కామోద్దీపకములని భావించు వారి దృష్టితో ఓ మేఘుమా నీ ప్రయత్నము ఫలించు నవకాశము మిక్కిలి

తక్కువ. వసంత గ్రీష్మములే విఫలములు కాగా నిక నీ ప్రయత్నమునకు ఎంత విలువ యుండును. అయినను నీ ప్రయత్నము నీవు చేయుము. నీయొక్క నాయొక్క అదృష్టము బాగున్నచో నాయకుని నాకడకు చేర్చిన వసంత గ్రీష్మముల మించిన కీర్తి నీకే దక్కును. ఒక వేళ నీ ప్రయత్నము ఫలింపక పోయినప్పుడు వసంత గ్రీష్మములే విఫలము చెందినప్పుడు నీవు విఫలత చెందినను నీకింతయు అపకీర్తిరాదు. కావున నీ ప్రయత్నము వలన మనకు (నీకు నాకును) నష్టము లేదు. అను నర్థము వచ్చు వాక్యములీ శ్లోకమున నున్నవి. 2. నః అను పదము మేఘుని తనదూతగా నాయిక భావించినట్లు వ్యంజింప జేయును. ఘన అను మేఘసంబోధనము నీవు గొప్పవాడవను అర్థమును వ్యంజింపజేయును. అర్జునుని ధనంజయుడనుటచే గోవులే గొప్పధనమని ఆయన అపజయమును పొందనట్లు నీవును తప్పక యత్నమున సఫలుడవు అగుదువు అను నర్థము వ్యంగ్యమగును. 3. ఆవులను గెలిచి తెచ్చిన వాడే అర్జునుడు అను సామెత తెలుగు దేశమున సుప్రసిద్ధము. భారత దేశమందంతటను ఈ సామెత ఎంతో కొంత ప్రసిద్ధికలిగి యున్నది అని అమరుకుని ఈ లోకోక్తి ప్రయోగము సూచించు చున్నది. ఇట్లు లోకోక్తిని ప్రయోగించుటచే నీ శ్లోకమున లోకోక్త్యలంకార మున్నది. లోకోక్తి మధ్యమున ''కింనశ్ఛిన్నమ్'' అను వాక్యాంతరము ప్రయోగింప బడినది. ఇట్లు వాక్యమధ్యమున వాక్యాంతరము (మరొకవాక్యము)ను ప్రయోగించుట గర్భితమను దోషముగా చెప్పబడినది. కాని వాక్యము పూర్తిగాక మునుపే నాయిక నాయకుడు తప్పక వచ్చునన్న సంతోషాతిశయమును తెలుపుటచే నీ శ్లోకమున నది దోషముగాదని వ్యాఖ్యాత అర్జునవర్మదేవుడు చెప్పినాడు. వృత్తము హరిణి.

అవ॥ పై శ్లోకమున గ్రామాంతర ప్రవాసము ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమున ఏకగ్రామ ప్రవాసము వర్ణింపబడుచున్నది.

శ్లో॥ ప్రాతః ప్రాతరుపాగతేన జనితా నిర్నిద్రతా చక్షుషో
ర్మన్దాయా మమ గౌరవం వ్యపగతప్రోత్పాదితం లాఘవమ్।
కిం తద్యన్న కృతం త్వయా మరణభీ ర్ముక్తా మయా గమ్యతాం
దుఃఖం తిష్ఠసి యచ్చ పథ్య మధునా కర్తాస్మి తచ్ఛ్రోష్యసి॥ 33

ప్ర॥ ప్రాతఃప్రాతః- ప్రొద్దుప్రొద్దుననే; ఉపాగతేన- వచ్చుటచేత; చక్షుషోః- కన్నులకు; నిర్నిద్రతా- నిద్రలేమి; జనితా- కలిగింపబడినది; మన్దయా- మన్దురాలనైన; మమ- నాయొక్క; గౌరవమ్- గౌరవము; వ్యపగతమ్- పోగొట్టబడినది; లాఘవమ్- లాఘవము; ప్రోత్పాదితమ్- కలిగింపజేయబడినది; యత్- ఏది; త్వయా- నీచేత;

నకృతమ్-చేయబడలేదో; తత్-అది; కిమ్-ఏమి; మయా-నాచేత; మరణ భీః-మరణ భయము; ముక్తా-విడువబడినది; గమ్యతామ్-పోవచ్చును; దుఃఖమ్- కష్టముగా; తిష్ఠసి-నిలచియున్నావు; అధునా-ఇప్పుడు; యత్-ఏది; పథ్యమ్‌చ- హితమును కూడ; కర్తాస్మి-చేయగలనో; తత్-దానిని; శ్రోష్యసి-వినగలవు.

తా॥ ప్రొద్దుప్రొద్దుననే వచ్చుట చేత నీకన్నులలో నిద్రలేమి వలన ఎఱుపు కనబడుచున్నది. మన్నురాలనైన నా గౌరవము పోగొట్టబడినది. లాఘవము కలిగింపబడినది. నాకొఱకు నీవు చేయనిది లేదు. నాకిక మరణ భయము నుండి ముక్తి కలిగినది. అతికష్టముగా ఇచట నీవు నిలచియున్నావు. నీవిక పోవచ్చును. ఇప్పుడే పథ్యము చేయుదునో దానిని నీవు వినగలవు.

వి॥ 1. నేను జబ్బుపడినానని నాయోగక్షేమముల తెలసికొనుటకు ప్రొద్దుననే వచ్చినావు. దీనివలన నా మీద నీకెంత ప్రేమ యున్నదో తెలియుచున్నది. జబ్బు పడ్డ నాకిప్పుడు బరువుగా లేదు. మాంద్యము లేదు. తేలికగా నున్నది. కొంచెము చుఱుకుగానే యున్నాను. నీవు నాపట్ల ఇంత శ్రద్ధ కనబఱచుచు చేయగలిగిన దంతయు చేసితివి. నీవు అశ్రద్ధతో చేయని దేమున్నది. ఏప్రియుడైనను ఇంతకన్న ఎక్కువ ఏమి చేయగలడు. ఇక్కడ నిలబడి ఎంత సేపు కష్టపడెదవు. నీవీ జబ్బు పడిన నా శయ్యపై కూర్చొనలేవుగదా! నేను చేయవలసిన పథ్యమును చేయుదును. నేనే పథ్యమును చేసినది నీకు తెలియగలదు, అనునర్థము గల వాక్యములీ శ్లోకమున నున్నవి. 2. సవతితో రాత్రియంతయు కామకేళీ కలాపములతో గడుపుట చేతనే నిద్రలేమి నీకన్నులలో ఎఱుపు రూపమున కనబడుచున్నది. తెలివి తక్కువ దానను కావున నా గౌరవమును గంగలో గలిపి సవతితో గడపినావు. నేను తెలివి గలదాననే అయి యుండినచో నా గౌరవమును సవతితో సంగమించి పోగొట్ట జాలెడి వాడవు కాకుందువు. నా గౌరవమును మంట గలిపి నాకు తేలిక తనమును కలుగ జేసినావు. నలుగురిలో తలెత్తుకొన లేకుండ జేసినావు. నేను కనబడగానే "ఈమె భర్తను సరిగా రంజింప జేయజాలక పోవుట చేతనే ఈమె భర్త ఈమె సవతి తోడనే కాలము గడుపుచున్నాడు" అని లోకమాడి పోసి కొనునట్లు చేసినావు. నా దుఃఖమును పెంచుటకు ఏమేమి చేయగలవో అంతయు చేసితివి. ఇంకేమి చేయగలపని మిగిలి యున్నది. ఇంకను ఇక్కడ నిలబడి యున్నావేమి. అక్కడ నీ ప్రియురాలు పాపము నీకోసమెంత ఎదిరిచూచుచున్నదో. ఇక్కడ నీవు ఆమె ఎదిరిచూపును తలచు కొనుచు కష్టముగానే నిలబడి యున్నావు. ప్రొద్దుప్రొద్దుననే వచ్చితివిగదా! నీవు బయలు దేరునప్పుడు ఆమె మేల్కొన్నదోలేదో, నిద్రపోవుచున్నదో; మేల్కొల్పుట యెందులకు ఆమె నిద్రలేచునంతలో పోయివచ్చెద

నని ఇటుకు వచ్చినావు. ఈ లోపు ఆమె మేల్కొని చెప్పకుండ వెడలి పోయినందుకు నీ భరతము పట్టగలదు. తొందరగా పొమ్ము. నేను చచ్చుటకు నిశ్చయించుకొన్న దానను. కావున నాకు మరణ భయము లేనేలేదు. నాథునకు దూరమై బ్రతుకుట కన్నా చచ్చుటయే మేలని నిశ్చయించుకొన్ననన్ను మరణ భయమెప్పుడో వీడిపోయినది. నేను చచ్చిన వార్తవిని లోకము కొఱకై చెవుల మూసికొందువేమో! దుర్వార్తాశ్రవణము వలన చెవులు మూసి కొన్నట్లు లోకమను కొనునట్లు చేయుదు వేమో? అట్లుచేయక తప్పదుకదా! నేను చచ్చిన వార్తవిని నీవు ఆమెయు కలసి ఆనందించగలరు. అను అర్థము (అర్థాంతరము) వ్యంజించు వాక్యములీ శ్లోకమున నున్నవి. 3. ప్రొద్దుననే వచ్చినాడ వనుటచే రాత్రివచ్చినచో నా సంభోగసుఖము నీకు లభించిన లభించుట కవకాశము కలిగి యుండెడిది గాదా యని, గౌరవము పోయిన దనుటచే నాకురులను సవరించుట మొదలగు నుపచారములు చేయుగౌరవము నీకు లేకపోయినదని, లాఘవము కలిగింప బడినదనుటచే నాకంటె తక్కువ అందగత్తె అయిన సవతితో సరిపుచ్చుకొను నగౌరవము నీకు కలిగనది. నీవేమేమి చేయ లేదనుటచే నాకు తెలియకుండ వలెనను కోరికతో దాచుటకు నీవేమి చేయలేదని అయినను మోటుసరసము చేయగా సవతి యొక్క అధరక్షతాదులచే నాకు తెలిసిపోయినది. ఈ పరిస్థితిలో అపరాధిగా నాముందుపట్టుబడి చేతులు కట్టుకొని యెంతసేపు నిలచి యున్నను నిన్ను ఆదరింతునను కొందువేమి? యని ఏ పథ్యము చేయుదునో దానిని వినగలవనుటచే నీ అపరాధమునకే శిక్షవేసి, ఎట్లు నిన్ను మరల నొకసారి ఆమెకడకు పోకుండ చేయవలెనో చేసిన పిదప నాప్రగల్భతను లోకము కొనియాడు చుండ వినగలవని ఇత్యాది బహ్వర్థములు వ్యంగ్యములగు చున్నవి. 4. ఇంత ప్రేమగల నన్ను అనుకంపనీయురాలిని జబ్బు మొదలగు దయనీయ లక్షణము ల కలదానిని వలె పరాభవించినావను ఉపమాలంకార మిటు వ్యంగ్యమగుచున్నదని వ్యాఖ్యాత అర్జునవర్మదేవుడు చెప్పినాడు. ఈ శ్లోకమున శ్లేషాలంకారము వాచ్యముగా లేదని ప్రకృతార్థమును వాచ్యమొనర్చుటతో అభిధకృతార్థము కాగా శబ్ద శక్తి మూలము న లభించినపై యర్థము(శ్లేషాలంకారము) వ్యంజనచే ధ్వన్యమానమైనది (వ్యత్యమైనది) అనియు తెలిపినాడు. వృత్తము శార్దూల విక్రీడితము.

శ్లో॥ సా బాలా వయ మప్రగల్భమనసః సా స్త్రీ వయం కాతరాః
సా పీనోన్నతిమత్పయోధరయుగం ధత్తే సఖే దావయమ్।
సాక్రాన్తా జఘన స్థలేన గురుణా గన్తుం న శక్తా వయం
దోషైరన్య జనాశ్రయై రపటవో జాతాః స్మ ఇత్యద్భుతమ్॥ 34

ప్ర॥ సా-ఆమె; బాలా-చిన్నది; వయమ్-మేము; అప్రగల్భమనసః- అధీర మనస్కులము; సా-ఆమె; స్త్రీ-ఆడుది; వయమ్-మేము; కాతరాః-పిరికివారము; సా-ఆమె; పీనోన్నతిమత్పయోధరయుగమ్-బలుపు,ఎత్తుగల చనుదోయిని; ధత్తే-ధరించుచున్నది; వయమ్-మేము; గన్తుమ్-నడుచుటకు; శక్తాఃన-శక్తులముకాము; అన్యజనాశ్రయైః-ఇతరజనుల నాశ్రయించిన దోషముల చేత; వయమ్-మేము; అపటవః-అసమర్థులము; జాతాఃస్మః-అయియున్నాము; ఇతి-అనునది; అద్భుతమ్ -వింత.

తా॥ ఆమె బాల కావున ఆమె అధీర మనస్కగా ఉండవలెను. దానికి బదులు మేము అధీరమనస్కులమయి పోయినాము. ఆమె ఆడుది. ఆమె పిరికిది కావలెను కాని మేము పిరికి వారమయి పోయినాము. ఆమె ఎత్తు బరువుగల స్తనముల జంటను మోయుచున్నది. కావున దుఃఖమామెకు కలుగవలెను. కాని మేమే దుఃఖితులమయి పోయినాము. ఆమెకు పెద్ద పిఱుదులున్నవి. గావున నడచుటకామె కష్టపడవలెను. కాని మేమేనడవలేక పోవుచున్నాము. ఈ విధముగా ఇతరుల దోషములచే మాకు అసమర్థత కలుగుట వింతకాదా!

వి॥ 1. బాలా శబ్దముచే నాయిక ముగ్ధయని తెలియుచున్నది. ముగ్ధ లధికముగా మాట్లాడరు. మాకు మాట పెరుగట లేదనగా ఆ ముగ్ధత మాకు సంక్రమించినది. అందుకే మనసు చురుకుగా నుండలేక పోవుచున్నది. భీరువులు స్త్రీలు. భీరు శబ్దము ఆడువారు సాధారణముగా పిఱికివారై యుండు కారణముచే స్త్రీ వాచకముగా నుండును. ఆ భయము (కాతరభావము) మాకు సంక్రమించినది. స్తనభారముచే ఆ బాలకు దుఃఖము కలుగవలసియుండగా ఆ దుఃఖము మాకు సంక్రమించినది. ఆమెకు జఘన భారమున్నందున నడచుటకామెకు కష్టము కావలెను. నడువలేక పోవుట మాకు సంక్రమించినది. పరుల దోషములు వారిని బాధింపవలసి యుండగా మమ్ము బాధించుట వింతకదా! అను నర్థమిచ్చు ముగ్ధను ప్రేమించిన నాయకుని వాక్యములీ శ్లోకమున నున్నవి. 2. శ్రీరామధ్యానమున ఏకపత్నీవ్రతనిష్ఠ, సత్య వచనము, పితృవాక్య పరిపాలనము ఇత్యాది గుణము లుపాసకులకు కలుగును. శ్రీకృష్ణ ధ్యానమున సర్వులను ప్రేమించుట వారిచే ప్రేమింపబడుట నిరంతరము సంతోషము గానుండుట మొదలగు గుణము లుపాసకులకు కలుగును. శివధ్యానమున భోగపరాఙ్ముఖత వైరాగ్యము, జ్ఞాననిష్ఠ, ధ్యాననిష్ఠ మొదలగు గుణము లుపాసకులకు కలుగును. ఈ శ్లోకమున బాలా ధ్యానముచే నాయకునికి సంక్రమించిన ముగ్ధ భావము, చేతకానితనము మొదలగు గుణములు సంక్రమించుట చెప్పబడినవి. అంసు శంకర - 17-5

వలన నాయకునకు ఆ బాల యందు కలిగిన ప్రీత్యతిశయము వ్యంగ్యమగు చున్నది. 'సాపీనోన్నతి మత్పయోధరయుగం ధత్తే' సాక్రాంతాజఘనస్థలే న గురుణా ఇత్యాది వాక్యములా బాలయొక్క యౌవనారంభమును, సౌందర్యాతిశయమును, నాయకు నందలి ప్రీతిచే కించిద్విలాసవిభ్రమ ప్రకటనము వ్యంగ్యములగు చున్నవి. 3. ఎవరి దోషములు వారికసమర్థతను కలిగింపవలసి యుండగా మరొకరి కసమర్థత కలుగుట యసంగతము. ఇట్టి యసంగతము ఈ శ్లోకమున చెప్పబడుట ఇందు అసంగత్యలంకార మున్నది. వృత్తము శార్దూల విక్రీడితము. 4. దోషైః అనుపదము విపరీతలక్షణచే గుణములను బోధించును. శ్లోకమున దోషములుగా చెప్పబడిన కాతరత అప్రగల్భత, స్తనజఘన భారము ముగ్ధల యెడ గుణములే గదా! 5. పయోధరభరమ్ అను పాఠమున వృత్త్యను ప్రాసాలంకారమేర్పడి శ్లోకము యొక్క సౌందర్యము పెంచునని వ్యాఖ్యాత అర్జునవర్మ దేవుడు చెప్పినాడు.

అవ॥ పై శ్లోకమున నాయకుని యందలి ముగ్ధానాయికాసక్తి వర్ణింప బడినది. ఈ శ్లోకమున నాయకుని యొక్క రాబోవు వియోగము భరింపలేని నాయిక యవస్థ వర్ణింప బడుచున్నది.

శ్లో॥ ప్రస్థానం వలయైః కృత ప్రియ సఖై రస్రై రజస్రం గతం
ధృత్యా న క్షణ మాసితం వ్యవసితం చిత్తేన గన్తు మ్పురః।
యాతుం నిశ్చిత చేతసి ప్రియతమే సర్వే సమ ప్రస్థితా
గన్తవ్యేసతి జీవిత! ప్రియ సుహృత్సార్థః కిము త్యజ్యతే॥ 35

ప్ర॥ ప్రియసఖైః- ప్రియునకు స్నేహితులైన; వలయైః- కడియములచేత; ప్రస్థానమ్- ప్రయాణము; కృతమ్- చేయబడినది; అస్రైః- కన్నీళ్ళచేత; అజస్రమ్- నిరంతరము; గతమ్- బయలుదేరబడినది; ధృత్యా- ధైర్యముచేత; క్షణమ్- క్షణకాలము; న ఆసితమ్- కూర్చొనబడలేదు; పురః- ముందుగనే; చిత్తేన- మనసుచేత; గన్తుమ్- పోవుటకు; వ్యవసితమ్- నిశ్చయించుకొనబడినది; ప్రియతమే- ప్రియుడు; యాతుమ్- వెడలుటకు; నిశ్చితచేతసి- మనసున నిశ్చయము చేసికొనగా; సర్వే- అందఱు (అన్నీ); సమమ్- కూడియే; ప్రస్థితాః- ప్రయాణమయినవి; జీవిత- ఓజీవితమా!; గన్తవ్యేసతి- పోవలసిన దానవై యుండగా; ప్రియసుహృత్సార్థః- ప్రియమిత్రుల గుంపు; కిమ్ ఉ- ఎందుకు; త్యజ్యతే- విడువ బడుచున్నది.

తా॥ ప్రియుడు ప్రవాసమేగుటకు నిశ్చయించు కొనగానే నాకడియములు

ప్రయాణించినవి. కన్నీళ్ళును బయలు దేరినవి. మనస్సు ముందే పోవుటకు నిశ్చయించు కొన్నది. నా కడియములు కన్నీళ్ళు మనస్సు ఆయనకు మిత్రములు గదా! ఇట్లు నావను కొన్న వన్నియు బయలు దేరి యుండగా ఓ నా జీవితమా నీవును పోవలసిన దానవై యుండగా నీవొక్కతే వారందఱితో పోకుండ వారిని విడచి ఇక్కడనే ఏలయున్నావు.

వి॥ 1. నావి యనుకున్న కడియములు నా కన్నీళ్ళు మొదలగునవి నా నాయకునికై దగ్గరైనవి. నా నాయకుడు నానుండి దూరమగుటకు నిశ్చయించుకొనగానే అవి యన్నియు అతని కన్న ముందే బయలుదేరి పోయినవి. నాదనుకొన్న జీవితము మాత్రము వారితో బయలుదేరకుండ మిత్రద్రోహము చేయుచున్నది. ఆపత్సమయమున మిత్రులను విడుచుట వారికి ద్రోహము చేయుటయేగదా! అను వస్తువును వ్యంజింప జేయు వాక్యములీ శ్లోకమున నున్నవి. 2. నాయకుడు ప్రవాస మేగిన పిమ్మట, క్రమముగా నాయిక కృశించిపోవుట సాధారణము. అప్పుడు చేతుల నుండి కడియములు జారిపోయి వట్టిచేతులతో నాయికలు కనబడుట జరుగును. కాని ఈ శ్లోకమున నాయికా కార్శ్యకారణమైన నాయిక విరహమున కన్న ముందుగనే కార్శ్యము కలిగినట్లు వ్యంజింప చేయుటచే ఈ శ్లోకమున నతిశయోక్త్యలంకార మున్నది. అస్త్రైరజస్రమ్ అను పదములలో వృత్త్యనుప్రాసాలంకారము వున్నది. 3. నాయకుడు ప్రవాసమేగుటకు నిశ్చయించు కొన్నప్పుడు కన్నీరు కారుట మనసాతనితో నేగుటకు నిశ్చయించుకొనుట సాధారణములే. అవి యన్ని కూడి ప్రయాణించినవని చెప్పుటచే సహోక్త్యలంకారమున్నదని అర్జున వర్మ దేవుడు చెప్పినాడు. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పై శ్లోకమున నాయిక ప్రవాసవిప్రలంభ శృంగార ఆరంభము సూచించ బడినది. ఈ శ్లోకమున నాయిక నాయకుల సంభోగ శృంగార ఆరంభము వర్ణింపబడు చున్నది.

శ్లో॥ సందష్టేఽధర పల్లవే సచకితం హస్తాగ్రమాధున్వతీ
మా మా ముంచ శఠేతి కోపవచనై రానర్తిత భ్రూలతా।
సీత్కారాంచిత లోచనా సరభసం య్యై శ్చుమ్బితా మానినీ
ప్రాప్తం తై రమృతం శ్రమాయ మథితో మూఢైః సురైః సాగరః॥36

ప్ర॥ సందష్టేధరపల్లవే-కొఱుకబడిన లేజిగురు వంటి పెదవి యందు; హస్తాగ్రమ్-అఱచేతిని; ఆధున్వతీ-కదిలించుచున్నదై; ఆనర్తితభ్రూలతా-వంచిన

కనుబొమలు గలదై; శఠ- ఓయిమొండివాడా; మామా- వద్దువద్దు; ముంచ- విడువుము; ఇతి- అని; సరభసమ్-వేగముగా; సీత్కారాంచితలోచనా-సీత్కారముచేత ఒప్పుచున్న కన్నులు గలదై; మానినీ- ప్రణయకోపముగల నాయిక; చుంబితా-చుంబింపబడినదో; తైః-వారిచేత; అమృతమ్-అమృతము; ప్రాప్తమ్- పొందబడినది; మూఢైః- అజ్ఞానులైన; సురైః-దేవతలచేత; సాగరః-సముద్రము; శ్రమాయ-శ్రమకొఱకు; మథితః-మథింపబడినది.

తా॥ నాయకుడు నాయిక పెదవిని పంటనొక్కినప్పుడు ఆమెతన అఱచేతినడ్డు పెట్టుకొనుచు కనుబొమలను త్రిప్పుచు పంట నొక్కు విడువు మనుచు సీత్కారము చేయుచుండగా ఆమెను ముద్దుపెట్టుకొనుచు అధరరసము త్రాగుట యనగా అమృత రసమును త్రాగుటయే. కాంతాధరరసామృత మందుబాటులో నుండగా దేవతలు సముద్రమును మథించి అమృతమును పొందుటకై యత్నించుట శ్రమ మాత్రమే.

వి॥ నాయకుడు నాయిక కోపము నపనయించి ఆమెపెదవిని పంట నొక్కినపుడు ఆమె ఓయి శఠుడా వలదు వలదన్నను పెదవిని పంట నొక్కెదవు. పెదవిని వదలుము అని గట్టిగా పలికినది. కనుబొమలముడి వేసినది. బాధ నభినయించుచు సీత్కార మొనర్చినది. లోపల నాయకునిపై నత్యంత ప్రీతి గల నాయికకు పెదవిని పంట నొక్కినపుడు తీయని బాధ కలిగినది. కాని ఆమె నిషేధించి నాయకుని మరింత రెచ్చగొట్టుటకు యత్నించినది. కనుబొమ్మలతో సైతము కోపము నభినయించినది. ఆమె సీత్కార మొనర్చినది. నోటితోనే కాని ఆ సమయమందలి తీయనిబాధను కన్నులతో అభినయించినది. మూఢులైన వారమృతము త్రావి చిరంజీవిత్వము నొందగోరెదరు. కాని కాంతాధర రసపానము లేక ఎంత కాలము జీవించినను వ్యర్థమే. అను అర్థమును వ్యంజించు వాక్యములీ శ్లోకమునన్నవి. 2. సందష్టేఽధర పల్లవే అను సమాసమున ఆమె పెదవి చిగురువలె మృదువై యున్నదని వ్యంగ్యమగు చున్నది. సందష్ట అనుటచే కొంచెముగట్టిగా నొక్కినప్పుడు చేతులు అడ్డము పెట్టినదని చెప్పక పెదవిపై అఱచేతిని కదలించుచున్నదనుట చేత ఆమెకు మరల మరల చుంబింపబడు కోరిక యున్నదని వ్యంగ్యమగు చున్నది. కోపవచన అను సమాసమునందలి వచన శబ్దము ఆమెకు కోపము లేదని కనబఱచు వచనములు మాత్రమే వ్యంగ్యమగును. 'మామా ముంచశఠ' అనుటచే ఈ పరిస్థితిలో నను వదలి పెట్టకు మనియు వ్యంజింపబడుచున్నది. 'శఠ' అనుటచే అంత గట్టిగా నొక్కక కొంచెము మెల్లగా నొక్కరాదా ఆ మోటుతనమేమి అను ప్రణయకోపము యొక్క వాచికాభినయ మొనరించు చున్నదను అర్థము వ్యంగ్యమగుచున్నది. 3. సీత్కారమనగా పారవశ్యమున లోపలి

నుండి వెడలు నొకవిధమైన మూలుగు. ఈ ధ్వని చలికాలమున వణకు వచ్చినప్పుడు లోపలి నుండి వెడలు ధ్వని వంటిదని సాహిత్య గ్రంథ పరిశీలనము వలన తెలియును. 4. పెదవిని గాయ పఱచుట, గట్టిగా కౌగలించుకొని యుక్కిరిబిక్కిరి యొనరించుట మొదలగు వ్యాపారములు యుద్ధలక్షణ ములవలె నుండుటచే సురతము కలహమన బడును. ఈ శ్లోకమున 'మామా ముంచ శఠ' అనుచు నాయిక నాయకు నాక్షేపించుట చే నిందు ఆక్షేపాలంకారమున్నదని అర్జునవర్మదేవుడు తెలిపినాడు. 'సందష్టేఽధర పల్లవే' అను చోట రూపకాలంకారమున్నది. కాంతాధర రసపానము అమృతపానము నధఃకరించుననుట శ్లోకము యొక్క పరమతాత్పర్యము. 5. కామికా మధరాస్వాదః సంభోగాదతిరేచ్యతే (కాముకులకు సంభోగ సుఖమున కన్న అధరరసపానసుఖమే అతిశయించుచుండును) అను సూక్తి యొకటి యున్నది. ఏదియైనను చతురనాయికా నాయకుల అనురాగము పై నాధారపడి యుండును. సంభోగాంగములైన ఆలింగ నాదులన్నింటి కన్న చివఱకు సంభోగమున కన్నను అధరరసపానము అమృత పానమున కన్న అధిక మని పై సూక్తి ప్రశంసా పూర్వకముగా చెప్పనే కాని సంభోగ సుఖమునది వాస్తవముగా నతిశయింప జాలదు. చుంబనము కూడ సంభోగమున కంగమే. అట్టి చుంబనమే ఈ శ్లోకమున వర్ణింపబడినది.

అవ॥ పై శ్లోకమున నాయకుని నాయికా ముఖచుంబనము వర్ణింపబడినది. ఈ శ్లోకమున నాయిక నాయకుని ముఖమును చుంబించుట వర్ణింపబడినది.

శ్లో॥ సుప్తోఽయం సఖి సుప్యతామితి గతాః సఖ్య స్తతోఽనన్తరం
ప్రేమావేశితయా మయా సరలయా న్యస్త మ్ముఖం తన్ముఖే।
జ్ఞాతేఽలీక నిమీలనే నయనయోర్ధూర్తస్య రోమాంచతో
లజ్జాసీన్మమ తేన సాప్యపహృతా తత్కాలయోగ్యైః క్రమైః॥ 37

ప్ర॥ సఖి- ఓ స్నేహితురాలా; అయమ్- ఈతడు; సుప్తః- నిద్రించినాడు; సుప్యతామ్- నిద్రించని (మనమును నిద్రింతము); ఇతి- అని; సఖ్యః- చెలికత్తెలు; గతాః -వెడలిపోయినారు; తతః అనంతరమ్- అటుపిమ్మట; ప్రేమావేశితయా- ప్రేమచే ఆవేశింపబడిన; సరలయా- కపటమెఱుంగని; మయా- నాచేత; తన్ముఖే - ఆతని ముఖ మందు; మమ- నాయొక్క; ముఖమ్- ముఖము; న్యస్తమ్- ఉంచబడినది. రోమాంచ తః- గగుర్పాటువలన; ధూర్తస్య- ధూర్తుని యొక్క; నయనయోః- కనుల యొక్క; అలీకనిమీలనే- అసత్యపుకనుమూయుట; జ్ఞాతే- తెలియబడగా; లజ్జా- సిగ్గు; ఆసీత్- కలిగియుండెను; తేన- అతనిచేత; సాఅపి- అదికూడ; తత్కాలయోగ్యైః- ఆ కాలము

నకు తగిన; క్రమైః-చర్యలచేత; అపహృతా-తొలగింపబడినది.

తా॥ఓ చెలికత్తెలారా! ఈతడునిద్రించినాడు. నిద్రించనీ, మనమును నిద్రించెదము గాక అని చెలికత్తెలు నాతో చెప్పి వెడలిపోయినారు. ప్రేమావేశమే తప్ప కపటమెఱుగని నేనాతని ముఖముపై నాముఖము నుంచినాను. ఆతనికి రోమాంచము కలిగినది. ఆ కనులు మూసికొనుట నిద్రచేతగాదని ఆతడు నిద్రించుట యసత్యమని నేను తెలిసికొనినప్పుడు నాకు సిగ్గు కలిగిన మాట వాస్తవమే. కాని అప్పుడు చేయదగిన పనులేవో చేసిన నాయకుడు ఆ సిగ్గును కూడ తొలగించినాడు.

వి॥ ఆతడు నిద్రించినాడని నాసఖులన్నారు. అది నిజమని నమ్మి వారు వెడలి పోగానే ప్రేమావేశము పట్టజాలక ఆతనికి తెలియకుండ ఆతని చుంబించవలెనను కోరిక నణచుకొన జాలక నా ముఖము నాతని ముఖమునకు కలిపితిని. ఆతనికి గగుర్పాటు కలిగినది. దానితో నాతడు నిద్ర నటించుటకు కన్నులు మూసికొన్నాడని నిజమైన నిద్రకాదని, దొంగనిద్రయని తెలిసికొనగానే నాకెంత సిగ్గు కలిగినదో చెప్ప జాలను. కాని అంత పెద్ద సిగ్గుకూడ ఆతడేమేమియో చేసి పోగొట్టెను, అను నర్థము నొసగు వాక్యములీ శ్లోకమున నున్నవి. **2.** సరళయా అనుటచేత నాచెలికత్తెలు నా యంత అమాయికలు కారు, చాలాగడుసువారు. కావున కపటు నిద్ర పోవుచున్నాడని యెఱిగియు ఈతడు నిద్రించినాడు అని నాతో చెప్పివెడలి పోయినారు. నేనేమో కపట మెఱుగని దానను. వారిగడుసు తనమెఱుగక ఆతనికి తెలియకుండ ఆతని ముద్దాడి సంతోషింప నెంచితిని కాని అది అట్లుకాలేదు. అను వస్తువు వ్యంగ్యమగు చున్నది. **3.** అది శోభనపురాత్రి. చెలికత్తెలు ఆమెను సింగారించు నెపమున నాయికకు (చెలికత్తెకు) కలుగబోవు సౌఖ్యమును తలచుకొనుచు చాలరాత్రియే గడిపినారు. నాయకుడు కన్నులు మూసి పడుకొన్నాడు. దానియర్థము ఇంకెంత కాలము మా సుఖమునకు అంతరాయము గావించెదరు. ఇక మీరు పోవుట మంచిది. అని ఆ కనుల మూయుటకు అర్థము. అది గ్రహించి మీ ఆయన నిద్రించినాడు. మాకును నిద్రవచ్చు చున్నది. మేమును పోవుచున్నాము అని చెప్పుచు చెలికత్తెలు వెడలి పోయినారు. చెలికత్తెల ఈ గడుసుతనము 'సుప్తోఽయమ్' అను పదములచే వ్యంగ్యమగుచున్నది. **4.** నాయిక ఆతని ముఖముపై తనముఖము చేర్చినది. ఆతనికి రోమాంచము కలిగినది. అది కపట నిద్రయని తెలిసి తొందఱ పడినందు కామెకు లజ్జ (సిగ్గు) కలిగినది. లజ్జా శబ్దము స్త్రీ లింగము దానిచేత ఒక స్త్రీ ఈ గదినింకను విడచిపెట్టలేదు. దానిని బయటకు పంపవలెను. అని నాయకుడా లజ్జ వెడలి పోవునట్లు ఏవేవో చర్యల చేసినాడు. ఇక సిగ్గునకు ఆ గది వీడక తప్పలేదు. ఈ యర్థము లజ్జా శబ్దము యొక్క

స్త్రీలింగ ప్రయోగము యొక్క బలమున వ్యంగ్యమగుచున్నది. చేమకూరవేంకటకవి ఇట్టి సందర్భముననే ఆ సిగ్గుకు సిగ్గులేదె, ఇటు చేసినపిమ్మట ఉండవచ్చునే అని అన్నాడు. 5. సాఽపి అపహృతా (ఆ సిగ్గుకూడ తొలగింపబడినది) అను పదముల లో అనుక్త సముచ్చాయక మగు అపి శబ్దము చేత ఆమె వస్త్రాపహరణము నాయకుడు చేసినాడని వ్యంగ్యమగుచున్నది. 6. సుప్తుడైన నాయకుని ముఖము యొక్క చుంబనము రాగోద్దీపనమని వ్యాఖ్యాత అర్జునవర్మదేవుడు చెప్పినాడు. 7. తత్కాల యోగ్యైః క్రమైః (ఆ కాలమునకు తగిన చేష్టలచేత) అనుటచేత నాయకుని చతురత తెలియవచ్చును. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పై శ్లోకమున నాయిక యొక్క నాయక ముఖచుంబనమువర్ణింపబడినది. ఈ శ్లోకమున నాయిక యొక్క ప్రణయకోపము తగ్గించు యత్నము యొక్క వైఫల్యము వర్ణింపబడినది.

శ్లో॥ కోపో యత్ర భ్రుకుటి రచనా నిగ్రహో యత్ర మౌనం
యత్రాన్యోన్యస్మిత మనునయో దృష్టిపాతః ప్రసాదః।
తస్యప్రేమ్ణ స్తదిద మధునా వైశస మ్పశ్య జాతం
త్వం పాదాన్తే లుఠసి న చ మే మన్యుమోక్షః ఖలాయాః॥ 38

ప్ర॥ యత్ర-ఎచట; కోపః-కోపము; భ్రుకుటిరచనా-కనుబొమవేయుటయో; యత్ర-ఎచట; మానమ్-మాట్లాడకుండుట; నిగ్రహః-శిక్షయో; యత్ర-ఎచట; అన్యోన్యస్మితమ్-ఒకరిని చూచి యొకరు కొంచెము నవ్వుట; అనునయః-ఊరడింపో; దృష్టిపాతః-దృష్టిప్రసారము; ప్రసాదః-అనుగ్రహమో; తస్య-ఆ; ప్రేమ్ణః-ప్రేమకు; అధునా-ఇప్పుడు; తత్-ఆ; ఇదమ్-ఈ; వైశసమ్-నాశము; జాతమ్-కలిగింది; త్వమ్-నీవు; పాదాన్తే-పాదమున; లుఠసి-పొరలాడుచున్నావు; ఖలాయాః-క్రూర మలనైననాకు; మన్యుమోక్షఃచ-కోపముపోవుటకూడ; న-లేదు.

తా॥ కనుబొమ ముడిపేయుటయే కోపముగా; మాట్లాడకపోవుటయే శిక్షగా; ఒకరి నొకరు చూసి కొంచెము నవ్వుటయే ఊరడింపుగా; దృష్టిప్రసారమే అనుగ్రహముగా ఉండవలసిన చోట అట్టిప్రేమకు ఎంత హాని జరిగినదో చూడుము. నీవేమో పాదముల దగ్గర పొరలాడుచున్నావు. నాకు కోపము కూడ పోలేదు.

వి॥ 1. నాయికా నాయకుల మధ్యకోపము మిక్కిలి విచిత్రముగా నుండును. అది యెట్లు, ఎందుకు వచ్చునో, అంతలోనే ఎందుకు మాయమగునో తెలియదు.

ఈ శ్లోకములోని నాయికకు నాయకుని యందు కోపమున్నది. కాని ఆమె కనులెఱ్ఱ చేయదు. కనుబొమల మాత్రము ముడిపేయును. పూవులతోడగాని, జడతోగాని నాయకుని కొట్టదు. కాని ఆమె మౌనము వహించినను అదియే శిక్షించు పద్ధతి. ఈమె నూరడించుటకు నాయకుడేవో ఇచ్చకములు పలుకనక్కఱ లేదు. చూచి నవ్విన చాలు ఆమె కూడ నవ్వును. ఇదియే ఆమె ఊరడిల్లిన దనుటకు చిహ్నము. ఆమెకోపము తగ్గినప్పుడు నాయకుని వైపు చూచును. అదే నాయకు నామెయను గ్రహించుటకు చిహ్నము. ఇంతవఱకు భూతకాలికమైన నాయిక యొక్క ప్రణయకోపము వర్ణింప బడినది. ఇప్పుడేమో భర్త పాదములకడ పొరలాడినను ఆమె కోపము తగ్గలేదు. తగ్గకుండుటకు తప్పునాదే నేను చాలదుష్టురాలను. నాది దీర్ఘ కోపము అనునయాప నేయముకాదు. అను నర్థము వ్యంజించు వాక్యములీ శ్లోకమున నున్నవి. 2. భూత కాలికమైన కోపము సులభాపనేయమని ఇప్పటి నాకోపము నీవు పాదములపై పడినను తొలగించుట లేదు. అను నాయిక వాక్యముల చేత నీవు ఇప్పుడు చేసిన అపరాధమెంత అసహ్యమో తెలిసినదా, సులభముగా అలుక చాలించు నాకే కోపము తగ్గకున్నది అనునర్థము వ్యంగ్యమగు చున్నది. పాదాస్తే అనుటచేత ఇప్పటికి నా పాదసమీపముననే ఉన్నావు. కాని పాదములపై పడుటలేదు. అనగా పాదములపై బడునంతటి అపరాధము చేయలేదను కొనుచున్నావా అనునర్థము వ్యంగ్యమగు చున్నది. ఆ ప్రేమకు హానికలిగిన దనుటచేత నాకోపము తగ్గుటకు చాలినంతగా అనునయింప లేక పోవుచున్నాను. అని నేను ఖలురాలను అనుట చేత తనకోపము ఉచితము కాదని నాయిక పైకి చెప్పుట వ్యంగ్యమగుచున్నది. ఈ శ్లోకమున అవసరా లంకారమున్నదని అర్జున వర్మదేవుడు చెప్పినాడు. ఆక్రమణము మన్దమగుట (తగ్గుట) ను వర్ణించుటకు మన్దాక్రాంతావృత్తమును పయోగించుట యుచితముగా నున్నది.

అవ॥ పై శ్లోకమున నాయకుని పాద సమీపస్థితి చెప్పబడినది. ఈ శ్లోకము పాదములపై పడుట చెప్పబడుచున్నది.

శ్లో॥ సుతను జహిహి మౌన మ్పశ్య పాదానత మ్మాం
న ఖలు తవ కదాచిత్కోప ఏవం విధోఽభూత్।
ఇతి నిగదతి నాథే తిర్యగామీలితాక్ష్యా
నయనజల మనల్ప మ్ముక్త ముక్తం న కించిత్॥ 39

ప్ర॥ సుతను- ఓచక్కని సన్నని దేహముకలదానా! ; మౌనమ్- మౌనమును; జహిహి- విడువుము; పాదానతమ్- పాదములపై వ్రాలిన; మామ్- నన్ను; పశ్య-

చూడుము; కదాచిత్-ఎప్పుడును; తవ-నీయొక్క; కోపః-కోపము; ఏవంవిధః-ఇట్టిది; నఅభూత్-లేదు; ఇతి-అని; నాథే-భర్త; నిగదతి-చెప్పుచుండగా; తిర్యగా మీలితాక్ష్యాః-అడ్డముగా మూసిన కన్నులు గల ఆమెచేత; అనల్పమ్-అధికమైన; నయన జలమ్-కన్నీరు; ముక్తమ్-విడువబడినది; కించిత్-ఏమియు; నఉక్తమ్-చెప్ప బడలేదు.

తా॥ ఓ ప్రియురాలా! అందమైన సన్నని శరీరము కలదానా! మౌనమును వీడుము. పాదములపై పడిన నన్ను చూడుము. నీకోపమిది వరకెప్పుడు ఇంత తీవ్రముగా నుండలేదు. అని భర్త పలుకుచుండగా అడ్డముగా కనులు మూయుచు కన్నీరు విడచినది. కాని మౌనమును వీడలేదు. కొంచెము గూడ మాట్లాడలేదు.

వి॥ 1. సౌందర్యమును ప్రశంసించి స్త్రీల కోపము తగ్గించవచ్చునను కొన్న నాయకుడు 'సుతను' అని సంబోధించినాడు. చక్కని శరీరము కలదానా అని ఆ మాట కర్థము. దుఃఖము సహింపజాలదు అని ఈ సంబోధనము వ్యంజింప జేయుచున్నది. ఇది వఱకెప్పుడు నీవింత తీవ్రముగా కోపింపలేదనుట చేత నీ వింత తీవ్రముగా కోపించుట ఇది వఱకున్నచో దానిని సహించు శక్తియు నాకుండెడిది. నీకిదివఱ కింత తీవ్రమైన కోపము లేదు. కావున ఇప్పటి ఈ తీవ్రకోపమును సహింప జాలకున్నాను అను నర్థము వ్యంగ్యమగుచున్నది. 2. ముక్తముక్త అను అక్షరముల జంట అవ్యవధానముగా ఆవర్తింపబడుటచే ఇచట ఛేకాను ప్రాసాలంకారమను శబ్దాలంకారమున్నది. 3. నయనజలమ్ముక్తమ్ (కన్నీరు విడచినది) అనుటచేత కన్నీటి కొంత కోపము కఱగినదనుట వ్యంగ్యమగుచున్నది. మౌనమును వీడుము. నీ వాగమృతముచే తప్తమైన నా హృదయమును చల్లబఱపుము. లేనిచో కనీసము పాదములపై పడిన నన్ను చూడుము. అను నర్థము ప్రథమ పాదములందలి రెండు వాక్యములచే వ్యంగ్యమగు చున్నది. 4. విరహసమయమున స్త్రీలు విరహతాప శాంతికై మాలాధారణ మొనర్తురు. అట్టి (మాన) విరహముగల మానిని మాలిని యైన నాయికను వర్ణించుటకు మాలినీ వృత్తము నుపయోగించుట యుచితముగా నున్నది.

అవ॥ పై శ్లోకమున మానవిరహిణి యొక్క మానము తగ్గుట వర్ణింపబడుట ఈ శ్లోకమున మానినిని ధ్యానించు విరహనాయకుడు వర్ణింపబడు చున్నాడు.

శ్లో॥ గాఢాలింగన వామనీకృత కుచప్రోద్భూత రోమోద్గమా
సాంద్ర స్నేహరసాతిరేక విగలచ్ఛ్రీమన్నితమ్బామ్బరా।
మా మా మానద మాతి మామలమితి క్షామాక్షరోల్లాపినీ
సుప్తా కిం ను మృతా ను కిమ్మనసి కిం లీనా విలీనా ను కిమ్॥ 40

ప్ర॥ గాఢాలింగన- బిగికౌగిలింతచేత; వామనీకృత- అణచివేయబడిన; కుచ- స్తనములయందు; ప్రోద్భూత-పుట్టిన; రోమోద్గమా- గగుర్పాటు కలిగిన; సాన్ద్ర- దట్టమైన; స్నేహరస- ప్రేమరసము యొక్క; అతిరేక- అతిశయముచేత; విగలత్ - జారుచున్న; శ్రీమత్- కాంతిగల; నితమ్బ- పిరుదులపైనున్న; అమ్బరా- వస్త్రముగల; మానద- ఓ మానమును పోగొట్టువాడా; అలమ్-చాలును; అతి-ఎక్కువగా; మామ్ -నన్ను; మామా(పీడయ)- వద్దు(పీడించ) వద్దు; ఇతి- అని; క్షామాక్షరోల్లాపినీ- లోగొంతుకతో మాట్లాడుచున్న ఆ నాప్రియురాలు; సుప్తాకిమ్‌ను-నిదురించినదా యేమి; మృతాకిమ్- మరణించినదా యేమి; మనసి- మనసునందు; లీనాకింను- లీనమయినదా యేమి; విలీనా-లేక విలయమును పొందినదో.

తా॥ స్తనములందు కలిగిన గగుర్పాటు గల ప్రేమాధిక్యముచే జాఱిన కటి వస్త్రముగల నన్ను- ఓమానమును పోగొట్టువాడా-చాలు నన్ను (ఎక్కువగా) పీడించవద్దు. వద్దు వద్దు-అనుమాటలను లోగొంతుకతో పలుకు నా ప్రియురాలు నిదురించినదా మరణించినదా మనసున లీనమయినదా, విలయము నొందినదా!

వి॥ 1. ప్రియురాలితో తాను గడిపిన మధుర క్షణముల నీ శ్లోకమున నాయకుడు తలచుకొనుట ఈ శ్లోకమున వర్ణింపబడినది. 2. మరణించినదా అను భావము నాయకునకు గలుగుట అమంగళమును సూచించును. అదిగాక మరణము కలిగి నప్పుడు సంభోగ విప్రలంభ రసము కరుణ రసవ ులో పర్యవసించును. విప్రలంభము నకు కరుణము అంగముగా నుండవచ్చును. నాయికా నాయకులలో నొకరికి మరణము సంభవించినప్పుడు శృంగార స్థాయి యగు రతికి విచ్ఛేదమే కలుగుటచే నిక శృంగారరసమే యుండదు. కావున మ్లానాకిం శయితాను కిమ్మనసి లీనా విలీనానుకిమ్ పాఠాంతరము బాగుండునని వ్యాఖ్యాత అర్జునవర్మదేవుడు చెప్పినాడు. 3. దీర్ఘసమాసములచే సురతము వర్ణింపబడినందున నాయకుని సురతము యొక్క దైర్ఘ్యము వ్యంజితమై నాయకుని సామర్థ్యము వ్యంజింపబడును. 4. విలయము మరణము ఒకటి కావు. సర్వజీవులతో పాటు అవ్యక్తము, ప్రకృతి, మాయ అను నామాంతరములుగల అజ్ఞానమున స్థూలసూక్ష్మ శరీరములు చేరుట విలయ మనబడును. జీవుడు స్థూల శరీరమును మాత్రమే విడుచుట మరణమనబడును. కావున ఈశ్లోకమున మృతానుకిమ్, విలీనా ను కిమ్ అను వికల్పమును విడిగా చేయబడినది. విలయము, సుప్తి అనునవి ఏకరూపములే కాని సుప్తి మిక్కిలి అల్పకాలికము. సుప్తినుండి పునరుత్థానము నాలుగయిదు గంటల పిమ్మట కలుగును. విలయమున నుండి పునరుత్థానము పెక్కు యుగముల పిమ్మట కలుగును. ఇచట

నాయిక విలయమునొందుట ఆత్మజ్ఞానము కలిగి స్థూలసూక్ష్మ కారణ ములు నశించి పునరావృత్తి రహితమైనదా అని వికల్పింపబడినదనియు భావింపవచ్చును. 'మనసి కింలీ నాను' అను వికల్పము ఆమె దేశాంతర లోకాంతరములకు పోక నామీద ప్రేమతో నా వియోగమును సహింపలేక నామనసులోనే దాగి యున్నదా- ఆమె ఎక్కడ దాగి యున్నదో వెదకి వేసారినవాడు కావున నాయకుడు తాను వెదకలేని చోటు తనమనసే కావున తనమనసునందే ఏమూలనో దాగియున్నదా, అని వికల్పించుకొన్నాడు. 'మ్లానాకిమ్' అనుపాఠాంతరము నంగీకరించినప్పుడు తనకు తెలియక నాయిక బంధువులయింట నాయిక జబ్బుపడి లేవలేని పరిస్థితిలో యున్నదా! అను వికల్పము చేయబడినది అని అనుకొనవలెను. ఇట్లు వికల్పములు పెక్కులుండుట అనగా కోటిబహుత్వ ముండుట, ఇది బహుకోటిక సంశయము. బహుకోటిక సంశయము నంగీకరింపక సంశయము ద్వికోటికమేయను వారి అభిప్రాయమున ప్రతి వికల్పమున భావా భావకోటి ద్వయమూహించు కొనవలెను. తన మనసు నందే ఏమూలనో దాగి యున్నదా! యను వికల్పము భూతాకాశము కంటెను విశాలమైన చిత్తాకాశమున నే మూలనో యుండుట చేత వెదక లేక పోవుటను వ్యంజింపజేయును. అలంకారము సంశయము. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పై శ్లోకమున నాయకుని నాయికా విరహ పరిదేవనము వర్ణింపబడినది. ఈ శ్లోకమున ముగ్ధానాయికా ప్రణయము వర్ణింపబడుచున్నది.

శ్లో॥ పటాలగ్నే పత్యౌ నమయతి ముఖం జాతవినయా
హఠాశ్లేషం వాంఛత్యపహరతి గాత్రాణి నిభృతమ్।
న శక్నోత్యాఖ్యాతుం స్మిత ముఖ సఖీదత్తనయనా
హ్రియా తామ్యత్యంతః ప్రథమపరిహాసే నవవధూః॥ 41

ప్ర॥ నవవధూః- క్రొత్తగా పెండ్లైనపడుచు; ప్రథమపరిహాసే-మొదటి పరిహాసమున; పటాలగ్నే- కొంగును పట్టుకొనగా; జాతవినయా- వినయము కలిగి నదై; ముఖమ్- ముఖమును; నమయతి- వంచును; హఠాశ్లేషమ్-మొండిగా కౌగి లింతను; వాంఛతి- కోరుచుండగా; నిభృతమ్- రహస్యముగ; గాత్రాణి - అవయవములను; అపహరతి- తొలగించును; స్మితముఖ సఖీదత్తనయనా- ముఖములందు చిరునవ్వుగల చెలికత్తెలందు చూపును ప్రసరించినదై; అఖ్యాతుమ్- మాట్లాడు; నశక్నోతి- లేకపోవుచున్నది; అంతః- లోపల; హ్రియా- సిగ్గుతో; తామ్యతి - బాధపడుచున్నది.

తా॥ క్రొత్తగా పెండ్లియైన పడుచు మొదటి కలయిక యందు కొంగును భర్త పట్టుకొనగానే వినయము కలిగినదై ముఖమును వంచును. మొండితనమున

కౌగిలించు కొనబోగా తన అవయవములను కౌగలింతలో నుండి తొలగించుకొను చున్నది. ఈ పరిస్థితికి నవ్వుకొనుచున్న చెలికత్తెలను చూచుచు ఆయనకు బదులీయ లేక పోవుచున్నది. సిగ్గుతో తనమనసులో తనే బాధపడుచున్నది.

వి॥ ప్రథమ సమావేశమున చెలికత్తెల సమక్షమున భర్త కొంగును పట్టుకొనగా మధ్య నాయికవలె కనులెఱ్ఱ చేయలేదు. ప్రౌఢ నాయికవలె కసరికొట్టలేదు. వినయమును చూపుచు తలవంచు కొన్నది. అట్లే భర్త బిగియార కౌగిలించు కొనబోవునప్పుడు కూడ మెల్లగా విడిపించు కొన్నదే కాని యింకేమియు చేయలేదు. భర్త పలుకరించి నప్పుడు నాయిక ముగ్ధావస్థ చూచిన చెలికత్తెలు నవ్వుకొను చుండగా వారివైపు చూచినదే కాని బదులు పలుకలేదు. చెలికత్తెల యెదుట భర్త ప్రవర్తనకు ఆమె సిగ్గుతో మాత్రమే బాధపడినది కాని భర్త చేష్టలకు కోపింపలేదు. అను నర్థమొసగు వాక్యములీ శ్లోకమున నిబంధింపబడినవి. వీనివలన ముగ్ధానాయిక యొక్క మనోహరిత చక్కగా వ్యంగ్య మగుచున్నది. సఖులు లేని యెడ ఆమె మాట్లాడి యుండెడిదే, కౌగిలింతను విడిపించుకొనుటకు యత్నింపకుండెడిది. భర్త పలుకరించి నపుడు ఏదైన బదులు పలికెడిదే అనునర్థము వ్యంగ్యమగుచున్నది. 2. ప్రియసఖులేల వచ్చినారు? ఆమెకు ప్రియునితో నవసంగమ సమయమున ఆమె బెదరకుండుటకు వారు తోడు వచ్చినారు అని ప్రథమపరిహాసే అను సమాసముచే సమాధానము వ్యంగ్యమగు చున్నది. 3. ఈ శ్లోకమున జాతియను అలంకారమున్నదని, విహృతమను నాట్యాలంకారమున్నదని వ్యాఖ్యాత అర్జున వర్మ దేవుడు చెప్పినాడు. ప్రథమ సంగమమున లజ్జయే వైరిణి యైనదనియు చెప్పినాడు. శిఖరిణీ వృత్తము.

అవ॥ పై శ్లోకమున నాయిక యొక్క లజ్జ వర్ణింపబడినది. ఈ శ్లోకమున నాయికా నాయకుల కోపము యొక్క శాంతి చెప్పబడు చున్నది.

శ్లో॥ నాపేతోఽనునయేన యః ప్రియ సుహృద్వాక్యైర్న యః సంహృతో
యో దీర్ఘం దివసం విషహ్య విషమం యత్నాత్కథంచిద్ధృతః।
అన్యోన్యస్య హృతే ముఖే నిహితయో స్తిర్యక్కథంచిద్దృశోః
స ద్వాభ్యామతివిస్మృత వ్యతికరో మానో విహాస్యోజ్ఝితః॥ 42

ప్ర॥ యః- ఏది( ప్రణయకోపము); అనునయేన- ఓదార్పుచేత; నఅపేతః- తొలగింపబడలేదో; యః- ఏది; ప్రియసుహృద్వాక్యైః- ప్రణయసఖుల వాక్యములచే; నసంహృతః- తొలగింపబడలేదో; యః- ఏది; విషమమ్- ప్రతికూలమైన; దీర్ఘమ్- పొడవైన; దివసమ్- పగలు; విషహ్య- సహింపబడి; యత్నాత్- ప్రయత్నమువలన;

కథంచిత్-ఎట్లో; ధృతః-ధరింపబడినదో; సః-ఆ; మానః-ప్రణయకోపము; హృతే-అపహరింపబడిన; అన్యోన్యస్య-ఒకరొకరి; ముఖే-ముఖమునందు; కథంచిత్-ఎట్లో; నిహితయోః-ఉంచబడిన; దృశోః-చూపుల యొక్క; అతివిస్మృత వ్యతికరః- మిక్కిలి మఱచిన సంబంధముకలదై; విహస్య-నవ్వి; ఉజ్ఝితః-విడువబడినది.

తా॥ ఏమానము ఊరడింపులచేతను, చెలుల వాక్యములచేతను తొలగింపబడలేదో ప్రతికూలమైన పొడవైన పగలంత ఎట్లో ధరింపబడిన ఆ కోపము ఒకరి ముఖమునకు మరొకరి ముఖము ఎదురు పడి నవ్వగనే విడిపోయినది.

వి॥ 1. సాధారణముగా ప్రియులు చేసిన చిన్న అపరాధముకూడ ప్రియలకు కోప కారణమగు చుండును. ఒకప్పుడా అపరాధము నాయకునిచే బుద్ధి పూర్వకముగా చేయబడినదై యుండవచ్చును. పొరపాటున చేయబడినదై యుండ వచ్చును. ఒకప్పుడు ప్రియుడెట్టి అపరాధము చేయక పోయినను పురుషులకు సహజముగా నుండు బహు స్త్రీ ప్రణయము తన నాయకునకు లేక పోయినను నాయిక తనలో ఊహించుకొనినదై యుండవచ్చును. కొన్ని సందర్భములలో నాయిక యందీర్ష్యా కోపములుగల ఇతర నాయికలచేతగాని, కపట సఖ్యము నటించు చెలికత్తెల చేతగాని చెప్పబడిన చాడీలు కారణముగా నాయికకు నాయకుని యందు మానము కలుగు చుండును. పెక్కు సందర్భములలో అట్టి నాయిక కోపము నాయకుడు వచ్చి సత్యమును నమ్మించి చెప్పుట వలన గాని అపరాధము చేయనే లేదని అసత్యము చెప్పుట వలన గాని నాయికకు నాయకుని సుదీర్ఘవిరహము నోర్వలేక సర్దుకొని పోవలెనను కోరిక పుట్టినప్పుడు గాని కోపము తగ్గుచుండును. కొన్ని సందర్భములలో పురుషులకు ఒక స్త్రీ సంగము అంతగా చెప్పుకొన దగిన దోషము కాదని స్త్రీలు (తల్లి, చెలికత్తెలు మొదలగు ఆప్తులు) నచ్చ చెప్పినప్పుడు కాని నాయిక కోపము తగ్గును. ఒక్కొక్కప్పుడు నాయికా నాయకుల మధ్య యేర్పడిన కోపము ఏ ప్రయత్నము లేకయే కాలము చేతనే తగ్గింపబడు చుండును. ఇంతకును ఇక్కడ ప్రస్తావింపబడినది ప్రణయకోపమే కాని ఇతర విధమైన కోపముకాదు. ప్రణయకోపము నాయికా నాయక సంపూర్ణ నిరవధిక వియోగమునకు దారితీయుట యనునది అరుదుగానే జరుగును. ఒక్కొక్క వేళా విశేషమున కలిగిన ప్రణయ కోపము సులభాపనేయము గాను, మరొక వేళా విశేషమున కలిగిన ప్రణయకోపము ఎంతో కష్టము మీద అపనేయము గాను ఉండును. చాలా సందర్భములలో నాయిక కోపమును నాయకుడే తొలగించుట సాహిత్య గ్రంథములలో గనుపించు చుండును. కొద్ది సందర్భములలో నాయిక నాయకుని కోపము నపనయించుట కూడ కనబడును. ప్రణయ కోపమొ

కప్పుడు నాయకునిచే నాయికకు కలిగించబడు చుండును. కోపము వచ్చినప్పుడు ముఖ మెఱ్ఱబడును. సహజముగనే కొంత యెఱుపు ఇది వఱకే యుండినది. ఇప్పుడు నాయకుడేదో విధముగ రెచ్చగొట్టుటచే నది పెఱుగును. ఆ కోపముతో కూడిన ముఖము నాయకునకు చూడ ముచ్చటగా నుండును. అరుదుగా స్త్రీలు కూడ ఇట్లు చేయుదురు. అట్లు కోపము కలిగించి వారికోపము నాస్వాదించుట యొక రసికత. ఇందు కోపమునకు ఎక్కువగా గుఱియైన వారు మాత్రము మానసికముగా ఎక్కువగా ఎదిగిన వారని చెప్పలేము. 2. ఈ శ్లోకమున నాయికా నాయకు లిరువురొ కరిపై మరొకరికి కోపము కలిగినది. అయినను వారిరువురు ఒకే యింటిలో ఒకే గదిలో ఉండికూడ ఒకరితో నొకరు మాట్లాడలేదు. ముందుగా నాయకుడామె కోపమును పోగొట్టుటకు బహువిధముల ప్రయత్నించినాడు. కాని ఆమె కోపము తగ్గలేదు. నాయకు డపరాధము చేసినాడన్న ఆరోపణము కూడ ఆమె చేయలేదు. చేసిఉన్నను అది చాల స్వల్పమైనదే కాని పెద్దది మాత్రము కాదు. శ్లోకమున కోపకారణము పేర్కొనబడలేదు. కావున అది బలీయమైనదే అనుకొందము. నాయకుడనునయించినాడు. ఆ అనునయము చేతను నాయిక యొక్క ఆ కోపము అపనేయము కాలేదు. నాయకునికి దీర్ఘకోపము కలిగించి అది చూచి నాయికయు నాయకుననునయించినది. దానిచేత నాయకునికి ఆకోపము అపనేయము కాలేదు. వీరిరువురి యీ ముఖావమును జూచి యిరువురకును వారివారి యాప్తులైన ప్రియ సుహృజ్జనము జోక్యము చేసికొనవలసి వచ్చినది. వారును ఇరువురికి చెప్పి యున్నారు. కాని కోపము తగ్గలేదు. ఇరువురకును ఒకరిపై నొకరికి గాఢానురాగ మున్నది. వారుకోపమును తగ్గించుకొని ఒకరితో నొకరు మాట్లాడవలెనని యను కొనుచున్నారు. ఎవరు ముందు మరొకరిని పలుకరించిన వారోడినట్లగునేమో బెట్టుసడలినట్లగునేమో సంగమకాంక్ష బయటపెట్టుకొన్నట్లగునేమో విరహవేదనను భరింపలేక పోయినానని అంగీకరించినట్లు అగునేమో! అట్లు భీష్మించి కూర్చున్నంత మాత్రమున వారిలోని సంగమ కాంక్ష యేమాత్రము తగ్గలేదు గదా అది మరింత హెచ్చసాగినది. రాత్రి లోపల ఎవరు మాట్లాడినను ఇంటి వారెవరు ముందు మాటాడిరో తెలిసి పోవును. అది వారిరువురుకిని ఇష్టముకాలేదు. ఆ యింట నాయికా నాయకు లిరువురు మాత్రమే కాపురముండు ఇల్లుకాదు. పెద్దలు చిన్నలు దాసదాసీ జనమునున్నారు. ఇప్పుడు గతేమి రాత్రివరకు వేచియుండవలసినదే. రాత్రి వచ్చిన కొంత సేపటివరకు అందఱునిద్రించు చుండగా అప్పుడెవరో ఒకరు ముందుగా మాట్లాడి స్వచ్ఛందముగా నోటమినంగీకరింప వచ్చును. కాని రాత్రి యెప్పుడు

వచ్చును. అది ఎన్ని యుగముల తరువాత వచ్చును. గడియ యొక యుగమైనది కాదు కాదు నిముషమొక యుగమైనది. అట్లువారు ప్రణయతపోదీక్షతోనే కాలము గడుపు చున్నారు. విషమమైన సుదీర్ఘమైన పగలు పరిణమించి సాయంకాలముగా మారుచున్నది. ప్రచండ భానుని తాపజ్వాలలు చల్లారుటకారంభించినవి. రాత్రి వచ్చు చున్నకొలది కాలము మఱింత మందగమన మొనర్చినది. ఒకరికి తెలియకుండ ఒకరు ఒకశయ్యపైకి ఎట్లు వచ్చిరో వారికే తెలియలేదు. శయ్యమీదికి వచ్చి ఎడమొగము పెడమొగముగా పడుకొన్నారు. ఒకరేమి చేయుచున్నది మరియొకరికి తెలిసికొనవలె నని యున్నది. వారి కన్నులు తిర్యక్ దృష్టికలిగియున్నవి. మెల్లగా ఒకరు వెను తిరిగినారు. ఒకరట్లే మార్పు లేనట్లు పడుకొన్నారు. ఇట్లే మరియొకరు చేసినారు. అట్లు చేయుచున్నప్పుడు ఒకప్పుడాకస్మికముగా ఇరువురి దృష్టులు కలుసుకొన్నవి. ఇంతవరకు వారొనర్చినది వారికే వింతగా నున్నది. విస్మృతి కోపమును కప్పివేసినది. చూపులు కలసి కొనగానే ఎందుకు వచ్చినదో, ఎవరు పిల్చినారో, పిల్చినట్లే నవ్వు ఒకే మారు ఇరువురకు వచ్చినది. కోపము ఇరువురి చేతను విడువబడినది. అను నర్థమును వ్యంజించు వాక్యములీ శ్లోకమున నున్నవి. అసంభావ్యమైన కోపము వహించుటచే నీశ్లోకమున విషమాలంకార మున్నదని వ్యాఖ్యాత అర్జున వర్మదేవుడు చెప్పినాడు. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ ॥ పై శ్లోకమున మాన (ప్రణయ కోప) త్యాగము చెప్పబడినది.

శ్లో॥ గతే ప్రేమాబన్ధే ప్రణయ బహుమానే విగలితే
నివృత్తే సద్భావే జన ఇవ జనే గచ్ఛతి పురః।
తదుత్ప్రేక్ష్యో త్ప్రేక్ష్య ప్రియసఖి గతాం స్తాంశ్చ దివసాన్
న జానే కో హేతు ర్దలతి శతధా యన్న హృదయమ్॥ 43

ప్ర ॥ ప్రియసఖీ- ఓ ప్రియమైన చెలీ!; ప్రేమాబన్ధే- ప్రేమయను గొప్పబన్ధము; గతే- పోగా; ప్రణయబహుమానే- ప్రణయ గౌరవము; విగలితే- జారిపోగా; సద్భావే- మంచితనము; నివృత్తే- మరలిపోగా; జన ఇవ- జనునివలె; జనః- ప్రియుడు; పురః- ముందు; గచ్ఛతి- పోవుచుండగా; తత్- దానిని; ఉత్ప్రేక్ష్య- చూచి; గతాన్- గడచిన; తాన్- ఆ; దివసాన్ చ- దినములను కూడ; ఉత్ప్రేక్ష్య- తలచుకొని; యత్- ఎందువలన; హృదయమ్- హృదయము; శతధా- నూరుభాగములుగా; నదలతి- విఱుగుటలేదో; తస్య- దానికి; కః- ఏది; హేతుః- కారణమో; నజానే- ఎఱుగను.

తా ॥ ఆ ప్రేమబంధము ఆ ప్రణయము ఆ గౌరవము ఆ సద్భావము అన్నియు

పోగా నాప్రియుడు ఇతర జనుని వలె ముందు నుండి పోవు చండగా అది చూచి గడచిన ఆ దినములను తలచుకొని నా హృదయము నూరు ముక్కలెందుకు కాలేదో కాక పోవుటకు కారణమేమో తెలిసికొనలే కున్నాను.

వి॥ ఒకప్పుడు ఒకనాయికను గాఢముగా ప్రేమించిన యువకుడు ఈనాడు అపరిచితుని వలె ముందు నుండి వెడలి పోవుచుండుట చూచి తన హృదయమేల నూరు ముక్కలు కాలేదని నాయిక చెలికత్తె చెప్పిన వాక్యములీ శ్లోకమున నున్నవి. ఈ శ్లోకమున ఉత్ప్రేక్ష్య అను పదము ఉత్ప్రేక్షను గాని ఉత్ప్రేక్షాలంకారమును గాని చెప్పదు. అది ఇప్పటి దుఃఖము యొక్క అసహ్యతకు అప్పటి మధురానుభూతికి తారతమ్యమును తలచుకొనుటను చెప్పును. ఇచట నాయిక నాయకునికి తన్పై ప్రేమ ఇప్పుడు లేదనుకొనుచున్నది. అంత మాత్రమున నాయకునకు ప్రేమలేదని అర్థము కాదు. పరహృదయము అప్రత్యక్షము కదా మరొక నాయికను ప్రేమించు చున్నాడని ఊహించుకొని ఆమె దుఃఖించుచున్నది. ఆ నాయకుడును నాయిక యొక్క యీ సాధింపు వలన తనను నిరంతరము అనుమానించుట వలన ఈ నాయికను పట్టించు కొనుట మానివేసినాడు. ఈమెను మార్చుటకు నాయకుడు పరస్త్రీలతో తిరుగుటను నటించు చున్నాడు. ఈర్ష్యతో నాయిక నాయకునకు తనమీద ప్రేమ లేదను కొను చున్నది. నాయికా నాయకులిరువురిలో నొకరికి మాత్రమే ప్రేమ యున్నచో అది శృంగార రసాభాసమే యగును కాని అది శృంగారము కాజాలదు. అయినను రసము వలె రసాభాసము కూడ కావ్యములలో నిబంధింప బడుచుండును. ఆ రసాభాసము రసమున కంగముగా నిబంధించుట కూడ కావ్యములలో కాన వచ్చును. రసాభాసము రసమువలెనే ఒక్కొక్కప్పుడు సహృదయునలరించు చుండును. అయినను రసాభాసమును అంగిగా నిబంధించిన వారు గొప్పకవులలో కానరారు. శిఖరిణీ వృత్తము. జన ఇవ జనే యనుటలో ఔపమ్యమున్నను ఉపమాలం కారమున్నదని చెప్పజాలము. ఉత్ప్రేక్ష్య ఉత్ప్రేక్ష్య అను ద్విరావృత్తియున్నను యమకాలంకారమున్న దనియు చెప్పజాలము.

అవ॥ పై శ్లోకమున నాయికానాయకుల వియోగ దుఃఖము వర్ణింపబడినది. ఈ శ్లోకము నాయికానాయకుల సంయోగము వర్ణింపబడు చున్నది.

శ్లో॥ చిరవిరహిణో రత్యుత్కంఠా శ్లథీకృత గాత్రయో
ర్నవమివ జగజ్జాత మ్భూయ శ్చిరాదభినందతోః।
కథమివ దినే దీర్ఘే యాతే నిశామధిరూఢయోః
ప్రసరతి కథా బహ్వీ యూనో ర్యథా న తథా రతిః॥ 44

ప్ర॥ చిరవిరహిణోః- చిరకాలమునుండి విడివిడిగానున్న; అత్యుత్కణ్ఠాశ్లథీకృత గాత్రయోః- తీవ్రమైన తహతహతో పట్టుకోల్పోయిన అవయములుగల; భూయః- మరల; జగత్- జగము; నవమివ- కొత్తదానివలె; జాతమ్- అయినట్లు; చిరాత్- చిరకాలమునకు; అభినందతోః- అభినందించుచున్న; కథమివ- ఎట్లో; దీర్ఘే- పొడవైన; దినే- పగలు; యాతే- గడచిపోగా; నిశామ్- రాత్రిని; అధిరూఢయోః- ఎక్కిన (చేరుకొన్న); యూనోః- యువజంటకు; యథా- ఎట్లు; బహ్వీ- ఎక్కువ; కథా- ప్రసంగము; ప్రసరతి- జరుగుచున్నదో; తథా- అట్లు; రతిః- రతి; న- జరుగుటలేదు.

తా॥ నాయికా నాయకులు చాలకాలమొకరికొకరు దూరముగా నుండి చివఱికి కలిసికొన్నారు. ప్రపంచము కొత్తగా పుట్టినట్లు వారికి కన్పించినది. వారికి రతికొరకు తహతహయున్నది. కాని ఆ తహతహతోనే వారి అవయవములు పట్టు కోల్పోయినవి. మిగుల పొడవైన పగలు గడచిపోయినది. రాత్రి వచ్చినది. వారి మధ్య ప్రసంగము జరిగినంతగా రతిజరుగలేదు.

వి॥ చిరకాలపు వియోగము తరువాత నాయికానాయకులు ఒకఇంటిలో చేరినారు నాయికయున్న చోటికి నాయకుడే వచ్చినాడో లేక నాయకుడున్న చోటికి నాయిక వచ్చినదో ఏమైననేమి యిరువురొకయింట చేరినారు. ప్రపంచము వారలకు కొత్త అందముతో కనిపించినది. అయినను వారి కలయికకు పగలు అడ్డముగానే యున్నది. చివఱకు రాత్రివచ్చినది. పగటి అడ్డుతొలగినది. ఎప్పుడెప్పుడు రాత్రియగునా యని వారింత వరకెదురు చూచిన రాత్రి రానే వచ్చినది. అప్పుడు వారి మధ్య సంభోగమున కంటె ముచ్చట్లే ఎక్కువగా సాగినవి అను అర్థమును వ్యంజింపజేయు వాక్యములీ శ్లోకమున నున్నవి. **2.** 'అధిరూఢయోః' అనుటచే కొండనెక్కువారు మెట్లు వరుస నిచ్చెన నెక్కువారు ఎక్కుటు పూర్తియగుటకెంతో శ్రమపడి చివరికి గమ్యము చేరుకొన్నట్లు ఏకాంత సమాగమ రాత్రిని చేరుకొన్నవారు అనుఅర్థమును వ్యంజింపజేయును. 'జగత్ నవమివ జాతమ్' అనుటచే దుఃఖ కాలమున జగము శూన్యముగా కనిపించును. అది ప్రేమ విహీనముగా కనిపించును. కాని ఈనాడు వారి దుఃఖము దూరమైనందున జగమంతయు కొత్తగా అందముతో వారికి కనిపించినది. అను అర్థమును వ్యంజింపజేయును. 'ఉత్కణ్ఠాశ్లథీకృత గాత్రయోః' అనుటచే ఎంతకాలమునుండియో కలిసికొనవలెనను తహతహ యున్నను వారి అవయవములు పట్టుకోల్పోయి యున్నవని తమ పరోక్షమున ఎదుటివారెట్లు గడిపిరో తెలిసికొనవలెనను తహతహతో వారు జరిగిన సంగతులను ముచ్చటించుకొనుటలో చూపినంత శ్రద్ధ సంభోగమున జూపుటలేదని వ్యంజింపబడును.

యథాతథా అనుశబ్దములు అసలు సంభోగమే జరుగలేదనరాదు. కాని దానికన్న ముచ్చట్లే ఎక్కువ జరిగినవి అను అర్థమును వ్యంజింపజేయును. ముచ్చట్లు సంభోగము మరల ముచ్చట్లు మరల సంభోగము ఇట్లు రాత్రియంతయు నిద్రించకయే నాయికా నాయకులు గడిపినారని మొత్తము శ్లోకము యొక్క సారమని గమనింపవలెను. వృత్తము హరిణి. ప్రపంచము క్రొత్త దానివలె కనబడుచున్నట్లు కనబడుటచే అతిశయోక్త్యలంకార స్ఫూర్తియున్నది. కాని వలె అను ఔపమ్యవాచకమే అతిశయోక్త్యలంకార విరోధమగుచున్నది. అందుచే ఇచటి అతిశయోక్తి వ్యంగ్యమే, కవి వాచ్యము కాదు.

అవ॥ పై శ్లోకమున చిరవిరహానంతర సంగమకాలిక కథా ప్రసంగములు వర్ణింపబడినవి. ఈ శ్లోకమున చిరవిరహానంతర సంగమ కాలిక నాయికాకృత నాయక స్వాగతసత్కారము వర్ణింపబడుచున్నది.

శ్లో॥ దీర్ఘా వందనమాలికా విరచితా దృష్ట్యైవ నేన్దీవరైః
పుష్పాణాం ప్రకరః స్మితేన రచితో నో కున్దజాత్యాదిభిః।
దత్తః స్వేదముచా పయోధర భరేణార్ఘో న కుమ్భామ్భసా
స్వైరేవావయవైః ప్రియస్య విశత స్తన్వ్యా కృతమ్మఙ్గలమ్॥ 45

ప్ర॥ దీర్ఘ-పొడవైన; వన్దనమాలికా-నమస్కారతోరణము; దృష్ట్యైవ-చూపుచేతనే; విరచితా-చేయబడినది; ఇందీవరైఃన-కలువలతోకాదు; పుష్పాణామ్-పూవుల యొక్క; ప్రకరః-సమూహము; స్మితేనఏవ-చిరునవ్వుచేతనే; రచితః-చేయబడినది; కుందజాత్యాదిభిఃన-మొల్లలు జాజులు మొదలైన వానితో కాదు; స్వేదముచా-చెమటను చిలుకరించు; పయోధరభరేణ ఏవ-స్తనభారముతోడనే; అర్ఘః-అర్ఘ్యము; దత్తః-ఈయబడినది; కుమ్భామ్భసా న-కుండలోని జలముతో కాదు; స్వైః-తన; అవయవైఃఏవ-అవయవములతోడనే; తన్వ్యా-కాంతచేత; విశతః-ప్రవేశించుచున్న; ప్రియస్య-ప్రియునకు; మఙ్గలమ్-మఙ్గలము; కృతమ్-చేయబడినది.

**తా॥ తనగృహమున ప్రవేశించు నాయుకునకు చూపుచేతనే వన్దనమాలిక నర్పించినది. కలువలతో కాదు. చిరునవ్వుతోనే పూవుల సమూహము నర్పించినది. మొల్లలు జాజులు మొదలుగు పూలతో కాదు. స్తనములందలి చెమట బిందువుల చేతనే అర్ఘ్యము సమర్పించినది. జలముతో కాదు. నాయిక తన అవయవముల తోడనే నాయకునకు స్వాగత సత్కారము చేసినది.**

వి॥ 1. తన్వ్యా అనుటచేత నాయకుడు ఇక వచ్చును ఇక వచ్చును అని ఎదురు చూచుచున్న విరహముతో కృశించియున్న నాయిక వాసకసజ్జిక యని వ్యంగ్యమగు చున్నది. మొదటి పాదమున వందనము, రెండవపాదమున పుష్పోపహారము మూడవపాదమున అర్ఘ్యము అను స్వాగత సత్కార సందర్భమున చేయబడు మూడు ఉపచారములు వర్ణింపబడినవి. స్వైరేవ అనుటచే ఒకడు తన కుటుంబము లోని వ్యక్తులనే అన్నికార్యములలో నియోగించు వానివలె నీ నాయిక తన యధీనము లోని వానినే స్వాగత సత్కారోపచారము లొనర్ప నియోగించినదని వ్యంగ్యమగుచున్నది. 2. ముఖ్యులైన వారు వచ్చునప్పుడు వారి స్వాగత సత్కారమునకై ద్వారములకు తోరణములు కట్టెదము. రెండువైపుల నుండి వచ్చిన తోరణార్థములు మధ్య ఎత్తు భాగమున కలుపబడును. ఇది ఒక విధముగా రెండు చేతులనెత్తి జోడించినట్లుండును కావున నిది వందన మాలిక యనబడును. (సాష్టాంగనమస్కారము చేయునప్పుడు కన్నులతో కూడ నమస్కారము చేయబడును. చేతులతో నేదైన పనిచేయు చున్నప్పుడు వారికి కన్నుల తోడనే మనము నమస్కరించెదము.) 3. ఇచట నాయిక తోరణము ద్వారమున కట్టియుండక పోయినను తనచూపు ద్వారమున నిల్పినది. ఆ చూపు పొడవుగా నుండుటచే నదియే ద్వారతోరణముగా ప్రకాశించుచున్నది. ఆమె చూపు కాటుక పూయబడిన తెల్లని నల్లని రంగులు కల కన్నుల నుండి వచ్చినది. కాన అది పొడవుగా నున్నది కావున ఆ చూపులతోరణము కలువపూల మాలికా తోరణము వలె నున్నది. ఆమె కన్నులు నమస్కార ముద్ర కలిగి యున్నవి. కనుక అది వందన మాలిక యైనది. నాయకుని రాకతో నాయికముఖము వికసించినది. పెదవుల పై చిరునవ్వు విరిసినది. దాని కాంతులే నాయకుడు వచ్చు దారిలో పూలు జల్లుచుండగా ఇక వేరుగా మొల్లలో జాజులో చల్లుట యెందులకు ఆమె చిరునవ్వే పూలజల్లైనది. నాయకుని రాకతో ఆమె హృదయమున సాత్త్విక భావముత్పన్నమై స్తనములందు చెమటపట్టినది. ఆ చెమట బిందువులతోడనే అర్ఘ్యమిచ్చినది. కానివేరే అర్ఘ్యము నామె నాయకునికై యొసగలేదు. 4. మొదటి మూడు పాదములలో అపహ్నవాలంకారములున్నవి. దీనిచేత ఆ సందర్భమును గమనించిన వారికి కలిగిన నల్ల కలువ పూల మాలతోరణము కుందమాలతీ పుష్పములసమూహము జలము అను భ్రాంతిని నివారించుట వ్యంగ్యమగుచున్నది. దీనిచేత చూపుల యొక్క కలువల తోడి పోలిక, చిరునవ్వు యొక్క పుష్పసమూహము తోడి పోలిక, స్తనముల యొక్క కుంభముల తోడి పోలిక, వ్యంగ్యములగు చున్నవి కావున ఇందుపమాలంకార ధ్వని యున్నది. వృత్తము శార్దూల విక్రీడితము. 5. మాలికా శబ్దములోని కప్రత్యయము

స్వార్థమున వచ్చిచేరినదే కాని అల్పార్థమున (వ్యాసార్థమున) వచ్చినది కాదని ఈ శ్లోకమున ఆక్షేపాలంకారవ్యక్తి యున్నదని వ్యాఖ్యాత అర్జున వర్మ దేవుడు చెప్పినాడు.

అవ॥ పై శ్లోకమున దృష్టిచ్ఛలమున వన్దనమాలిక, స్మితచ్ఛలమున పువ్వులజల్లు స్వేదచ్ఛలమున అర్ఘ్యము చెప్పబడినది. ఈ శ్లోకమున ప్రియసఖీచ్ఛలమున నాయకుని నాయికాలింగనము వర్ణింపబడుచున్నది.

శ్లో॥ కాంతే సాగసి శాపితే ప్రియసఖీవేషం విధాయాగతే
భ్రాంత్యాలింగ్య మయా రహస్యముదితం తత్సంగమాకాంక్షయా।
ముగ్ధే! దుష్కరమేతదిత్యతితమా ముద్దామహాస మ్బలా
దాశ్లిష్య చ్ఛలితాస్మి తేన కితవేనాద్య ప్రదోషాగమే॥46

ప్ర॥ సాగసి- అపరాధియై; శాపితే- తిట్టబడిన; కాంతే- నాయకుడు; ప్రియసఖీ వేషమ్ - ప్రియసఖియొక్క వేషమును; విధాయ-వేసికొని; ఆగతే- రాగా; భ్రాంత్యా- (ప్రియసఖీ) భ్రాంతిలో; ఆలింగ్య- కౌగలించుకొని; తత్సంగమాకాంక్షయా- అతని సంగమము నందాసక్తిగల; మయా- నాచేత; రహస్యమ్- రహస్యము; ఉదితమ్- చెప్పబడినది; ముగ్ధే- అమాయకురాలా; ఏతత్- ఇది; దుష్కరమ్-చేయరానిది; ఇతి- అని; కితవేన-మోసగాడైన; తేన- వానిచేత; ఉద్దామహాసమ్- బిగ్గరగానవ్వుచు; అతిత మామ్- మిక్కిలి; బలాత్-మొండిగా; ఆలింగ్య- కౌగలింపబడి; అద్య-నేటి; ప్రదోషా గమే- ప్రదోషసమయమున; ఛలితా- మోసగింపబడినదాననై; అస్మి- ఉన్నాను.

తా॥ అపరాధము చేసి తిట్లుబడి పోయిన నాయకుడు ఒకనాటి రాత్రి యొక్క ఆరంభకాలమున ప్రియసఖి వేషమున వచ్చినాడు. ప్రియసఖి కదా యని అనుకొన్న నాయిక అతనిని కౌగలించుకొని నాయకుని సంగము కోరుచున్నానని రహస్యము చెప్పివేసినది. అప్పుడా నాయకుడు ఇది చేయుట కష్టమే యనుచు బిగ్గరగా నవ్వుచు ఆమెను కౌగలించుకొన్నాడు. నేనీవిధముగా మోసపోయితినని చెలికత్తెతో నాయిక చెప్పినది.

వి॥ నాయిక యింటికొక నాటి సాయంకాలము పరాంగనాసంగ చిహ్నములు తన శరీరమున నున్నను గమనింపక నాయిక యందాసక్తుడై వచ్చినాడు. అప్పుడా నాయిక వానిని చీవాట్లు వేసి వెడలగొట్టినది. ఆ సమయమున ప్రియసఖి ఇది యంతయు చూచినది. ఆ తరువాత ఆ ప్రియసఖి వెడలి పోయినది. ఇది యంతయు గమనించి చీకటి పడిన పిమ్మట ఆ ప్రియసఖి వేషము వేసుకొని నాయకుడు వచ్చినాడు. అప్పుడు నాయిక నేను నాయకుని యందు కనబడిన పరాంగనా సంగమ చిహ్నముల

జాచుటచే కలిగిన కోపముతో వెడల గొట్టినానే కాని వాని సంగమము నందిచ్చ లేకపోలేదు. అను తన హృదయములోని రహస్యమును ప్రియసఖి యనుకొని నాయకుని తోడనే చెప్పినది. ఆ నాయకుడోసి అమాయకు రాలా ఇది కష్టమే యని బిగ్గఱగా నవ్వుచు ఆమెను గట్టిగా కౌగలించు కొన్నాడు అని నాయకుడు వెడలి పోయిన తరువాత వచ్చిన ప్రియసఖి 'మీరిరువురొకటే' నీ కోపము నాటకమే నన్ను మోసగించుటకే అని సూచించు చిరునవ్వుతో నాయికను చూచి పలుకరింపగా నాయిక జరిగిన వాస్తవమును ప్రియసఖికి వెలిబుచ్చుట ఈ శ్లోకమున వివరింపబడినది. 2. నాయక సంగమానంతరము ప్రియసఖి నాయిక కడకు మరల వచ్చినప్పుడు నాయిక యీమాటలన్నది. ఆ రాత్రి ప్రియసఖి రాక యనుచితము అసమంజసము. ప్రియసఖి తెల్లవారి వచ్చినదనవలెను. అట్లగుచో అద్య అనుటెట్లు అను ప్రశ్నను వేసికొని అద్య అను మాట లోకసాధారణముగా వాడబడినది. దానికి నిన్నటి రాత్రి అనియే అర్థము చెప్పకొనవలసియున్నదని, 'శాపితే' అనగా మరల వచ్చినచో నామీద ఒట్టే మరలరావలదు అని ఒట్టు వేయబడినవాడు అని అర్జునవర్మ దేవుడు చెప్పినాడు. 'ప్రదోషే' అనుటచే అడుదానినైన నేను రాత్రి భర్త ప్రియసఖి వేషమున వచ్చి బలాత్కారముగా కౌగలించు కొన్నప్పుడేమి చేయగలను. దురదృష్ట వంతురాలను అను అర్థము వ్యంగ్యమగును. వ్యంగ్యము సఖికే తోచవలెను. వాస్తవ మునకు తాను సౌభాగ్యవంతురాలే. తిట్లుదిని పోయినవాడు మరల వచ్చుటకు భయపడి నాయిక మీది ఆసక్తినణచు కొనజాలక సఖి వేషమున వచ్చినాడు. ఇంతకన్న నాయికకు కావలసిన సౌభాగ్యమేమున్నది. ఆమె నాయకుని ప్రియసఖియని పొరబడి తనకు నాయకుని సంగమ మందిచ్చ యున్నదని నాయకునితో చెప్పక పోయినచో ఆమె కోపమును పోగొట్టుటకు పాదములపై నాయకుడు బడియుండు వాడే యనుటలో నాయికకెట్టి సందేహము లేదు. ఇక పరాఙ్గనా సంగమ చిహ్నాముల మాట. ఆమె నాయికకు పరకావచ్చును కాని నాయకునకు ద్వితీయ భార్యకావచ్చును. ద్వితీయ భార్య ఆమె సంగమునకు సుముఖ కావున సంగమించి వచ్చినాడు. ఐనను మరల తిట్టి పంపిన ఈ నాయిక కడకే వచ్చినాడు. కావున ఈ నాయిక సవతులలో కూడ అత్యంత సౌభాగ్యవతి యని చెప్పవలెను.

అవ॥ పై శ్లోకమున నాయకుని ఛలము వర్ణింపబడినది. ఈ శ్లోకమున ఛలము-లేని నాయకుని యొక్క ప్రియురాలి కోపమునందును రమ్యతాదర్శనము చెప్పబడు చున్నది.

శ్లో॥ ఆశంక్య ప్రణతి మ్పటాన్త పిహితౌ పాదౌ కరోత్యాదరాత్
వ్యాజే నాగత మావృణోతి హసితం న స్పృష్ట ముద్వీక్షతే।

ప్రత్యాలాపయతి ప్రతీపవచనం సఖ్యా సహాభాషతే
తన్వ్యాస్తిష్ఠతు నిర్భరప్రణయితా మానోఽపి రమ్యోదయః॥ 47

ప్ర॥ ప్రణతిమ్-ప్రణామమును; ఆశంక్య-ఊహించి; పాదౌ-పాదములను; పటాన్తపిహితౌ-అంచులో దాచబడినవానినిగా; కరోతి-చేయుచున్నది; ఆగతమ్-వచ్చిన; హసితమ్-నవ్వును; వ్యాజేన-మిషతో; ఆవృణోతి-దాచుచున్నది; ప్రత్యాలాపయతి-మాట్లాడింప బోవునపుడు; ప్రతీపవచనమ్-వేఱుప్రసంగమును; సఖ్యా సహ-చెలికత్తెతోకూడి; ఆభాషతే-ఎక్కువగా మాటాడుచున్నది; స్పృష్టమ్-దాకినను; నడుద్వీక్షతే-చూచుటలేదు; తన్వ్యాః-కాంతయొక్క; నిర్భరప్రణయితా-గొప్ప అనురాగము; తిష్ఠతు-ఉండని; మానఃఅపి-కోపముకూడ; రమ్యోదయః-అందమైన పుట్టుక కలది.

తా॥ నాయకుడు పాదములపై పడునేమోయని నాయిక ఆదరముతో పాదములను చీరఅంచుతో కప్పుకున్నది. నాయకుని ఈ అవస్థకు వచ్చిన నవ్వునే దోమిషతో ఆపుకొన్నది. నాయకుడు తాకినప్పుడు తలయెత్తి యాతనిని చూడలేదు. తిరస్కారవచనము చెప్పించబోవునపుడు దానిని విననట్లు స్నేహితురాలితో మాట్లాడు చున్నది. ఆమె నిర్భరప్రణయము అటుండనీ ఆమెకోపము కూడ ఎంతో అందము గానున్నది.

వి॥ 1.నాయకుని చేష్టలతో తన పాదములపై పడబోవుచున్నాడని నాయిక యెఱిగి ఆదరముతో తన చీరతో పాదములను కప్పుకొన్నదే కాని అటునుండి వెడలిపోలేదు. పరిహాస ప్రసంగము జ్ఞప్తికి రాగా వచ్చుచున్న నవ్వును కప్పిపుచ్చుకొనుచున్నది. తాకినను నాపై దృష్టిని ప్రసారించుట లేదు. నేను మాట్లాడించినపుడు అవి విననట్లు ఏమియో చెలితో ఎక్కువ సేపు మాట్లాడు చున్నది. ఈ చేష్టల వలన నాయిక కోపము కూడ నాయకునికి మధురముగానే యున్నదను అర్థ మొసగు వాక్యములీ శ్లోకమున నున్నవి. ఈ శ్లోకమున నాయకుడు తన నాయిక యొక్క కోపోదయమును స్మరించు చున్నాడు. 2.నాయిక కోపలక్షణములు దోషములే అయినను వానిని గుణములుగా భావించు నాయకుని ఉత్తమ సంస్కారమును తెలుపును. ఇట్లు దోషములలో గుణదర్శనము చేయుటచే ఈ శ్లోకమున లేశాలంకారమున్నది. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పై శ్లోకమున నాయకుని యొక్క నిష్కపటము ఉదారమునైన స్వభావము వర్ణింపబడింది. ఈ శ్లోకమున నాయిక యొక్క మనోహర ముగ్ధత్వము వర్ణింపబడుచున్నది.

శ్లో॥ యావన్త్యేవ పదాన్య లీకవచనై రాలీజనైః పాఠితా
తావన్త్యేవ కృతాగసో ద్రుతతరం సంలప్య పత్యుః పురః।
ఆరేభే పరతో యథా మనసిజస్యేచ్ఛా తథా వర్తితుమ్
ప్రేమ్ణో మౌగ్ధ్య విభూషణ స్య సహజః కోఽప్యేష కాన్తః క్రమః 48

ప్ర॥ యావన్తి-ఎన్ని; పదాని- మాటలు; ఏవ- మాత్రము; అలీకవచనైః- అసత్య వచనములుకల; ఆలీజనైః-సఖీజనముచేత; పాఠితా-నేర్పబడినదో; తావన్తి (పదాని) ఏవ- అన్నిమాటలను మాత్రము; కృతాగసః- అపరాధముచేసిన; పత్యుః- భర్తయొక్క; పురః-ఎదుట; ద్రుతతరమ్- మిక్కిలి వేగముగా; సంలప్య- చక్కగా పలికి; పరతః- పిమ్మట; మనసిజస్య- మన్మథుని యొక్క; ఇచ్ఛా- కోరిక; యథా-ఎట్లో; తథా- అట్లు; వర్తితుమ్- ప్రవర్తించుటకు; ఆరేభే - ఆరంభించినది; మౌగ్ధ్యవిభూషణ స్య- ముగ్ధత్వ మలంకారముగా గల; ప్రేమ్ణః- ప్రేమయొక్క; సహజః- సహజమైన; కాంతః- అందమైన; ఏషః- ఈ; క్రమః- పరిపాటి; కఃఅపి- ఏదో (చెప్పరానిది).

తా॥ నాయకుడపరాధము చేసినాడని చెలికత్తెలె రుగుదురు. దాని యొక్క పునరావృత్తి నివారించుటకు నీ విట్లు మాట్లాడవలె నని ఎన్ని పదములు చెలికత్తెలు నేర్పినారో అన్ని పదములను పాఠమప్పగించినట్లు వేగముగా పలికి ఆ పిమ్మట మన్మథు నిచ్ఛానుసారము ప్రవర్తింపనారంభించినది. ఆహా! ప్రేమకు ముగ్ధత యెట్టి సహజమైన అందమైన అలంకారమై యున్నదో మాటలలో చెప్పరాదు.

వి॥ 1. ఈ శ్లోకమున నాయిక ముగ్ధ కావున స్వయముగా నాయకుని దోషముల ను కనిపెట్టలేక పోయినది. సఖులు అతని చేష్టితములను నాయికతో చెప్పినారు. నాయిక అమాయిక కావున ఏమిచేయవలెనో తెలియనిది. ఆమె ఇట్టిదని చెలికత్తెలకును తెలియును. నాయకుడు వచ్చినపుడే మేమి మాట్లాడ వలె నో చెప్పినారు. నాయకుడు వచ్చినప్పుడు ఆ మాటల మాత్రమే పలికినది. ఆ పలుకుట కూడ వేగముగా అప్పగించినట్లు మాత్రమే చేసినది. ఆ పని చేసి నేను సఖీ జనము చెప్పినమాటలు చెప్పుట అను అసాధారణ కర్మ మొనర్చిన దాననైతినని తనపని ముగిసినదని అనుకొన్నది. ఆ పిమ్మట మన్మథుని కోరిక ప్రకారమే వర్తించినది. ఆ నాయకునితో సంభోగించుట కారంభించినది. ప్రేమకు మౌగ్ధ్యము సహజమైన మనోహరమైన అలంకారము అనగా ముగ్ధ ప్రేమకు నోచుకొనుట గొప్ప అదృష్టము అను అర్థమును వ్యంజింపజేయు వాక్యములీ శ్లోకమున నున్నవి. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పై శ్లోకమున ముగ్ధానాయిక యొక్క అమాయికత వర్ణింపబడినది. ఈ

శ్లోకమున ప్రౌఢానాయిక యొక్క అపరాధము చేసిన ప్రియుని చూచిన చూపు వర్ణింపబడుచున్నది.

శ్లో॥ దూరాదుత్సుక మాగతే వివలితం సమ్భాషిణీ స్ఫారితమ్
సంశ్లిష్యత్యరుణం గృహీతవసనే కోపాంచిత భ్రూలతమ్।
మానిన్యాశ్చరణానతి వ్యతికరే బాష్పామ్బు పూర్ణేక్షణం
చక్షుర్జాతమహో ప్రపంచ చతురం జాతాగసి ప్రేయసి॥ 49

ప్ర॥ మానిన్యాః-మానిని యొక్క; చక్షుః-చూపు; జాతాగసి-అపరాధము కలిగిన; ప్రేయసి-ప్రియుడు; దూరాత్-దూరమునుండి(దూరమున నుండగా) ఉత్సుకమ్-ఉత్కంఠ కలది; ఆగతే-రాగా; వివలితమ్-త్రిప్పబడినది; సమ్భాషిణి-మాట్లాడు చుండగా; స్ఫారితమ్-విప్పుకొనబడినది; సంశ్లిష్యతి-కౌగిలించుకొనుచండగా; అరుణం-ఎఱ్ఱబడినది; గృహీతవసనే-కొంగుపట్టుకొనగా; కోపాంచితభ్రూలతమ్-కోపమున కనుబొమ్మలను త్రిప్పుకొన్నది; చరణానతి వ్యతికరే-పాదములపైపడుచుండగా; బాష్పామ్బుపూర్ణేక్షణమ్-కన్నీళ్ళతోనిండినది; ప్రపంచ చతురమ్-ప్రపంచమున నేర్పుకలది; జాతమ్-అయినా; అహో-ఆహా.

తా॥ అపరాధము చేసిన నాయకుడు దూరమున నుండగా ఉత్సుకముగా నున్నది. సమీపింపగా త్రిప్పబడినది. మాట్లాడుచుండగా విప్పుకొన్నది. కౌగలించుకొనుచుండగా ఎఱ్ఱబడినది. కొంగులాగగా కనుబొమముడిపెట్టినది. పాదములపై పడుచుండగా కన్నీటితో నిండినదియునైన మానిని యొక్క చూపు ప్రపంచమునసే నిపుణమైనది.

వి॥ నాయకుడపరాధి యని ఇప్పుడు తనననునయింప జేయవచ్చుచున్నాడని ఎఱిగిన నాయిక నాయకుడు దూరముననుండగా దానికి తగినట్లు మరొక పర్యాయము అపరాధము చేయకుండ శిక్షించెదను వచ్చి ఏమి చేయునో అని మానిని యొక్క చూపు ఉత్సుకమై యున్నది. దగ్గఱకు రాసే వచ్చినాడు. తిరస్కారముతో చూడకుండ అపుడామె ముఖము త్రిప్పుకున్నది. వాడూరకున్నాడా మాట్లాడుట కారంభించినాడు. ఇంత అపరాధము చేసియు సిగ్గులేక యింకను మాట్లాడు చున్నాడే అను ఆక్షేపణతో ఆమె చూపు విప్పారినది. నాయకుడు కౌగలించుకొను చుండగా ఆక్రమించుకొను చున్నాడే అని ఆమె చూపు ఎఱ్ఱబడినది. కొంగు పట్టుకొని లాగుచుండగా కనుబొమ ముడివైచినది. అనగా నాయిక యొక్క మానము (ప్రణయ

కోపము) తారాస్థాయికి చేరియున్నది. తన ఈ ప్రయత్నములు (కౌగలించుట కొంగు లాగుట) బెడిసికొట్టుచున్నవని యెఱిగిన నాయకుడు ఇక పాదములపై పడబోయి నాడు. ఇంతవరకు ఆమె కోపమును నిలుపుకొన్నది. ఆతడు పాదములపై పడునప్పుడు మాత్రమిక కోపమును నిలుపుకొనలేక పోయినది. ఆ కోపము తాపముగా పరిణ మించి కన్నులలో నీరు నిండినది. మానిని యొక్క చూపు ప్రపంచమున సమయోచిత ప్రవర్తనలో ఎంతో నిపుణము అంతకు మించిన చతురత మఱిదేని యందును లేదు. అను నర్థమును వ్యంజించు వాక్యములీ శ్లోకమున నున్నవి. 2. 'చక్షుః' అను ఏకవచ నాంత ప్రయోగము నాయకుని యెడ కలిగిన అనాదరమును వ్యంజింప జేయును. 3. 'కోపాంచిత భ్రూలతమ్' అను పాఠమునకు బదులుగా 'కేశాంచిత భ్రూలతమ్' అను పాఠమును కల్పించుట అసమంజసమని వ్యాఖ్యాత అర్జునవర్మ దేవుడు చెప్పినాడు. వృత్తము శార్దూల విక్రీడితము. ప్రతివాక్యము నందును చక్షువే కర్తయై యుండుటచే నీ శ్లోకమున కర్త క్రియా దీపకాలంకారమున్నదని వ్యాఖ్యాత అర్జునవర్మ దేవుడు చెప్పినాడు.

అవ॥ పై శ్లోకమున నాయిక నాయకునికి కనబడునట్లు కన్నీరు పెట్టుకున్నట్లు చెప్పబడినది. ఈ శ్లోకమున నాయకుడు చూడకుండ కన్నీరు పెట్టుకొనుట వర్ణింపబడు చున్నది.

శ్లో॥ అఙ్గానామతితానవం కుత ఇదం కస్మాదకస్మాదిదమ్
ముగ్ధే పాణ్డుకపోల మాననమితి ప్రాణేశ్వరే పృచ్ఛతి।
తన్వ్యా సర్వమిదం స్వభావత ఇతి వ్యాహృత్య పక్ష్మాన్తర
వ్యాపీ బాష్పభర స్తయా వలితయానిఃశ్వస్య ముక్తోఽన్యతః॥ 50

ప్ర॥ ముగ్ధే- ఓ అమాయకురాలా; ఇదమ్- ఈ; అంగానామ్- అవయువముల యొక్క; అతితానవమ్- అధికకృశత; కుతః- ఎందువలన; పాణ్డుకపోలమ్- తెల్లబాఱిన చెంపలుకలదిగా; ఇదమ్- ఈ; ఆననమ్- ముఖము; అకస్మాత్- హఠాత్తుగా; కస్మాత్- ఎందువలన (అయినది); ఇతి- అని; ప్రాణేశ్వరే- ప్రాణనాథుడు; పృచ్ఛతి- అడుగగా; ఇదమ్- ఇది; సర్వమ్- అంతయు; స్వభావత- స్వభావమువలన; ఇతి- అని; వ్యాహృత్య- పలికి; పక్ష్మన్తరవ్యాపీ- రెప్పలలోపలవ్యాపించిన; బాష్పభరః- కన్నీటి భారము; అన్యతః- మరొక దిక్కునకు; వలితయా- తిరిగిన; తన్వ్యా- కాంతచేత; నిఃశ్వస్య- నిట్టూర్చి; ముక్తః- విడువబడినది.

తా॥ ప్రాణేశ్వరుడు వియోగముచే కృశించిన అవయవములు, తెల్లబాఱిన

కపోలములుగల నాయికను చూచి ఇట్లేల జరిగినదని ప్రశ్నింపగా నాయిక ఇదంతయు స్వాభావికముగానే జరిగినదని పలికి మరొకవైపు తిరిగి నిట్టూర్చి కంటి రెప్పల( నుండి) నిండియున్న నీటిని విడచినది.

వి॥ 1. నాయిక సహజముగ సన్నని శరీరము కలది. అందును ప్రియవిరహముచే ఆమె అవయవములు మరింత సన్నబడినవి. నీ అవయవములిట్లేల సన్నబడినవని తెల్లబాఱిన ప్రియురాలి చెంపలను చూచి ఎఱుపునేల నీ చెంపలు కోల్పోయినవని ప్రశ్నించినాడు. అప్పుడామె ఇదియంతయు స్వాభావికముగనే జరిగినదని పైకి నాయకునితో చెప్పినది. శరీరము అప్పుడప్పుడు లావగుటయో సన్నబడుటయో జరుగుచుండును. ఇందు విశేషమేమున్నదను అర్థము వచ్చునట్లు పైకి పలికినను నేనొకనాటనే ఇట్లైతినా! నీవు నన్ను విడచి ఎన్నాళ్లైనది? ప్రాణేశ్వరుడవైన నీవే నాయీస్థితికి కారణమైయుండి తెలియకుండినట్లు నటించుచు నన్నే కారణమడుగుట నీ గడుసుతనమా నా దౌర్భాగ్యమా అని మనసున ననుకొనుచు కన్నుల నిండ కన్నీరు తిరుగగా అది భర్తకు తెలియకుండునట్లు మరొక ప్రక్కకు తిరిగి నాయిక నిట్టూర్చి కన్నీరు విడచినది. అను నర్థమొసగు వాక్యములీ శ్లోకమున నున్నవి. 2. నీ అవయవములేల ఇట్లు మిక్కిలి సన్నబడినవి. పూర్వము ఎఱ్ఱని కపోలములు గల నీ ముఖమిప్పుడేల తెల్లబాఱినదని నాయకుడు ప్రశ్నించినాడు. ఇది స్వాభావికము గానే జరిగినదని చెప్పినది. ఒక్క నాటిలోనే నిట్లైతినా? నన్ను నీవు విడిచి ఎన్నాళ్లైనది. ప్రాణేశ్వరుడవైన నీవే నా యీస్థితికి కారణమై యుండి నీవేమరల నన్నడుగుట కంటె నాదౌర్భాగ్యము ఇంకేముండును అని పైకి చెప్పక యధార్థస్థితిని దాచుటచే ఈ శ్లోకమున వ్యాజోక్త్యలంకారమున్నదని నీవేకారణ మని దాని తాత్పర్యమని వ్యాఖ్యాత అర్జునవర్మ దేవుడు చెప్పినాడు. వృత్తము శార్దూల విక్రీడితము. 'కస్మాదకస్మాత్' కించిద్వ్యవధానముతో 'కస్మాత్' అను అక్షరద్వయము యొక్క ఆవృత్తియుండుటచే ఛేకోక్త్యలంకారచ్ఛాయ ఉన్నదనియు కించిదర్థభేదముతో కూడిన శబ్దావృత్తి యున్నందున యమకాలంకారచ్ఛాయ యున్నదనియు మాత్రము చెప్పవచ్చును.

అవ॥ పై శ్లోకమున నాయిక తన దుఃఖమును దాచుకొనుటలో సఫలురాలగుట చెప్పబడినది. ఈ శ్లోకయుగలమున లోనదాగియున్న అన్యాఙ్గనా ప్రణయ పరాకాష్ఠ అప్రయత్నముగా నాయకుడు బయట పెట్టుకొనుట చెప్పబడుచున్నది.

శ్లో॥ పురస్తన్వ్యా గోత్ర స్ఖలన చకితో౽హం నతముఖః
ప్రవృత్తో వైలక్ష్యా త్కిమపి లిఖితుం దైవహతకః॥

స్ఫుటో రేఖాన్యాసః కథమపి సతాదృక్ పరిణతో
గతా యేన వ్యక్తిం పునరవయవైః సైవ తరుణీ॥ 51

శ్లో॥ తతశ్చాభిజ్ఞాయ స్ఫురదరుణ గణ్డస్థలరుచా
మనస్విన్యా రూఢప్రణయ సహసోద్గద్గద గిరా।
అహో చిత్రం చిత్రం స్ఫుటమితి నిగద్యాశ్రు కలుషం
రుషా బ్రహ్మాస్త్రం మే శిరసి నిహితో వామ చరణః॥ 52

ప్ర॥ తన్వ్యాః-సుకుమారశరీరము గల నాయిక యొక్క; పురః-ఎదుట; గోత్రస్థలన చకితః-పేరు పొరబడుటచే భయపడిన వాడనై; నతముఖః-ముఖము వంచుకొన్న వాడనై; శ్లేషాత్-మనసుమనసులో లేకపోవుటవలన; కిమపి-ఏదో; లిఖితం-వ్రాయుటకు; దైవహతకః-దైవహతుడనైన నేను; ప్రవృత్తః-పూనినాను; కథమపి-ఎట్లో; స్ఫుటః-స్పష్టమైన; రేఖాన్యాసః-గీతలుగీయుట; యేన-ఏవిధమున; పునః-మరల; అవయవైః-అవయవములచేత; సా-ఆ; తరుణీ ఏవ-యువతియే; వ్యక్తిమ్-ప్రకటనమును; గతా-పొందినదైయుండునో; సః-అది(ఆవిధము); తాదృక్-అట్లు; పరిణతః-పరిణమించినది. తతఃచ-ఆ పిమ్మటను; అభిజ్ఞాయ-గుర్తించి; స్ఫురదరుణ గణ్డస్థలరుచా- మెఱయు నెఱ్ఱని కపోలతలములకాంతిగల; మనస్విన్యా- బుద్ధిమంతురాలిచేత; రూఢ ప్రణయ సహసోద్గద్గద గిరా-అత్యున్నత ప్రణయముతో వెంట నే డగ్గుత్తిక వడిన వాక్కుగల; అహో-ఆహా; చిత్రమ్-చిత్రము; చిత్రమ్-చిత్రము; స్ఫుటమ్-స్పష్టము; ఇతి-అని; అశ్రుకలుషమ్-కన్నీటితో మలినమగుచున్నట్లు; నిగద్య-పలికి; రుషా-కోపముతో; వామచరణః-ఎడమపాదము(అనెడి); బ్రహ్మాస్త్రమ్-బ్రహ్మాస్త్రము; మే-నాయొక్క; శిరః-శిరమున; నిహితః-ఉంచబడినది.

తా॥ విరహిణియగు నొక నాయిక కడకు దాక్షిణ్యముతో పోయిన నాయకుడు ఆమెను మరొక పేరున పిలచి భయపడి ముఖము వంచుకొన్నాడు. తోచక అక్కడనున్న గుడ్డపై ఏవో గీతలు గీచినాడు. గీతల విన్యాసము ఏప్రియురాలి పేరు నాయకుడు పొరపడి చెప్పెనో ఆ ప్రియురాలి అవయవములే కన్పడి ఆచిత్రము ఆ ప్రియురాలిదే అని స్పష్టమైనది. ఆ తరువాత ఆనాయిక దానిని గుర్తించి ఎఱ్ఱబారిన కపోలతలములు గలదైన ఆ బుద్ధిమంతురాలు అత్యున్నతమైన తనలోని ప్రణయము చే డగ్గుత్తిక వడిన కన్నీళ్ళు నిండిన, కణ్ఠము నుండి వచ్చిన ఆహా స్పష్టమైనది చిత్రము చిత్రము అని పలికి ఎడమకాలు అను బ్రహ్మాస్త్రమును నాతలపై మోపినది.

వి॥ ఒక నాయిక ఉత్తమురాలు మనస్విని మరొకతె ప్రియురాలు. ప్రియురాలితో కులుకుచున్నాడని నాయిక చిక్కి శల్యమైనదని నాయకుడు విని దాక్షిణ్యముతో ఆమె నూరడించుటకు వచ్చి ప్రియురాలి పేరనే నాయికను పిలిచి నాలుక కఱచు కొన్నాడు. నాయికకు దొఱకి పోయినాడు. కల్లబొల్లిమాటలు చెప్పి యిప్పుడామెను ఊరడించు నవకాశమును పోగొట్టుకొన్నాడు. తలవంచుకొని నిలువబడినాడు. అతనికేమియు తోచక అక్కడ నున్న ఒక గుడ్డపై ఏవో గీతలు గీచినాడు. అవి సరిగా ప్రియురాలి అవయవములనే చిత్రించినవి. గోరుచుట్టుపై రోకటి పోటన్నట్లు ఇది గుర్తించిన నాయిక వెక్కివెక్కి యేడ్చుచు చూచినారా మీరందఱీ వరకు నా నాథున కన్యాసంగమ రసికత యున్నదని అందుకే నాకు దూరమై పోవుచున్నాడని నే నన్నప్పుడు ఊరు కోవమ్మ అదంత నీ అనుమానమే అని నన్నే మందలించితిరి గదా. ఇప్పుడు చూడుడు. ఈయన ఆ ప్రియురాలి చిత్రమును నాముందఱనే గీచి నాకు చూపించు చున్నాడు. మీరును చూడుడు- అని గద్గద స్వరముతో కన్నీళ్ళతో వెక్కుచు చెప్పి నా తలపై తన ఎడమకాలు అనే బ్రహ్మాస్త్రము పెట్టినది అను అర్థమిచ్చు వాక్యములను నాయకుడు తన సహచరునితో పలుకు చున్నట్లీ శ్లోకమున చెప్పబడినది. 2 . పని అనుకూలముగా ఫలించక పోగా అనర్థకముగా పరిణమించినట్లు చెప్పుటచే నిట విషమాలంకారమున్నదని వ్యాఖ్యాత అర్జునవర్మదేవుడు చెప్పినాడు. కొండంతలైన నాయకుని అపరాధముల రెంటి నీ శిఖరిణీ వృత్తద్వయమున నిబంధించుట యుచితముగా నున్నది.

అవ॥ పై శ్లోకమున అనునయింప బోయిన నాయకునికి దైవవశమున కలిగిన భంగపాటు వర్ణింపబడినది. ఈ శ్లోకమున భంగపాటు లేని నాయకుని అనునయము వర్ణింపబడుచున్నది.

శ్లో॥ కఠినహృదయే ముఞ్చ భ్రాన్తిం వ్యలీక కథాశ్రితాం
పిశున వచనై ర్దుఃఖం నేతుం న యుక్త మిమం జనం।
కిమిద మథవా సత్యమ్ముగ్ధే త్వయాద్య వినిశ్చితం
యదభిరుచితం తన్మే కృత్వా ప్రియే సుఖమాస్యతామ్॥ 53

ప్ర ॥ కఠినహృదయే- ఓ కఠినహృదయురాలా!; వ్యలీక కథాశ్రితాం - అసత్య కథల నాశ్రయించిన; భ్రాన్తిమ్- భ్రాంతిని; ముంచ- విడువుము; పిశునవచనైః- చాడీలచేత; ఇమం- ఈ; జనం- మనుష్యుని; దుఃఖం- దుఃఖమును; నేతుమ్-

పొందించుట; నయుక్తమ్- తగినదికాదు; అథవా- లేక; ముగ్ధే- ఓ అమాయకురాలా; ఇదమ్- ఇది; సత్యమ్- సత్యముగా; త్వయా- నీచేత; అద్య-నేడు; నిశ్చితమ్ కిమ్- నిశ్చయింప బడినదా యేమి; ప్రియే- ఓ ప్రియురాలా; యత్- ఏది; అభిరుచితమ్ - ఇష్టమో; తత్- దానిని; మే- నాకు; కృత్వా-చేసి; సుఖమ్- సుఖముగా; ఆస్యతామ్ - కూర్చొన బడుగాక।

తా॥ ఓ కఠినహృదయురాలా! అసత్య కథనాశ్రయించిన భ్రాన్తిని విడువుము. చాడీలను నమ్మి నన్నీ దశకు తెచ్చుట నీకు తగదు. ఓ అమాయకురాలా ఒకవేళ దీనిని సత్యమని నిశ్చయించుకొంటివేని నీ యిష్టము వచ్చినది చేసి ఓ ప్రియురాలా! సుఖముగా నుండుము.

వి॥ 1. నాయకుని గూర్చి నాయికకు చాడీలు చెప్పినారు. అవి సత్యమని నమ్మి నాయిక నాయకుని యెడ ముభావముగా నున్నది. దీనిని సహించలేని నాయకుడు ఓ కఠినహృదయురాలా! నీకు చెప్పిన చాడీలలో సత్యమెంత మాత్రము లేదు. వారి మాటల వలన నేను చెడ్డపని (పరస్త్రీసంగము) చేసినానని నీవు భ్రాన్తిపడినావు. ఆ భ్రాన్తి విడువుము. అయినా ఎవరో ఏదోచెప్పిన దానిని వెంటనే నమ్ముట యేనా? కొంచెము వెనుక ముందఱ నాలోచింపనక్కఱ లేదా? నీభ్రాన్తి వలన నీవు నన్నేదశకు తెచ్చినావో? నన్నింకను దుఃఖింపజేయుట పాడికాదు. నా మానసమునకే కష్టము కలుగుట నోర్వలేని నీవు నాకింత దుఃఖము కలుగుచున్నను పట్టించుకొనవేమి? ఓ అమాయకురాలా! కొంత మంది కొంపలను కూల్చదలచిన వారేవేవో మాటలు జెప్పుదురు. వానిని నీవు నమ్ముటయే విచిత్రము. ఇప్పటికిని ఆమాటలే సత్యమని నీవు నిశ్చయించు కొన్నచో నన్ను శిక్షించుము. అంతేకాని నీయీ యుపేక్ష నాకు సహింపరానిదై యున్నది. నన్ను శిక్షించి కోపతాపములను వీడి నీవైన ప్రశాంతముగా సుఖముగా నుండుము. అను నర్థమొసగు వాక్యములీ శ్లోకమున నున్నవి. 2. కఠినహృదయే ముగ్ధే ప్రియే అను మూడు సంబోధనముల చేత సాధారణముగా ముగ్ధలకు కఠిన హృదయముండదని ఒకవేళ ఎప్పుడైన ముగ్ధలు కఠిన హృదయులు కావచ్చును. అట్టివారు ప్రియురాండ్రెట్లగుదురు. ప్రేమయున్న చోట కాఠిన్య ముండుట విపరీతము కదా అను అర్థము వ్యంగ్యమగును. వృత్తము హరిణి.

అవ॥ పై శ్లోకమున నాయికా సమక్షమున నాయకుని విరహదుఃఖము వర్ణింప బడినది. ఈ శ్లోకమున నాయికా పరోక్షమున ప్రవాసియైన నాయకుని దుఃఖము వర్ణింపబడుచున్నది.

శ్లో॥ రాత్రౌ వారి భరాలసామ్బుద రవోద్విగ్నేన జాతాశ్రుణా
పాన్థేనాత్మ వియోగదుఃఖ పిశునం గీతం తథోత్కణ్ఠయా।
ఆస్తాం జీవితహారిణిః ప్రవసనాలాపస్య సంకీర్తనం
మానస్యాఽపి జలాంజలిః సరభసం లోకేన దత్తో యథా॥ 54

ప్ర॥ రాత్రౌ-రాత్రియందు; వారిభరాలసామ్బుదరవోద్విగ్నేన-నీరునిండి యుండుటచే మెల్లగా చేయుమేఘము యొక్క ధ్వనిచే ఉద్వేగమునొందిన; జాతాశ్రుణా-కన్నీరు నిండిన; పాన్థేన-బాటసారిచేత; జీవిత హారిణి :-ప్రాణములు తీయు; ప్రవసనాలా పస్య -ప్రవాసపు మాటల కీర్తనము; ఆస్తామ్-ఉండనీ; లోకేన -లోకముచేత; సరభసమ్-త్వరగా; మానస్యాపి-మానమునకు కూడ; జలాంజలిః -అర్ఘ్యము; యథా-ఎట్లు; దత్తః-ఈయబడినదో; తథా-అట్లు; ఉత్కణ్ఠయా-ఉత్కణ్ఠతో; గీతమ్-గానము చేయబడినది.

తా॥ అది వర్షాకాలము నీరు నిండిన మేఘము మంద్రముగా గర్జించినది. దానితో నుద్విగ్నుడైన ఒక ఊరిలో విడిది చేసిన బాటసారి తన విరహదుఃఖమును సూచించుచు ప్రాణములను తోడివేయు ప్రవాసప్రలాపముల నూహించునట్లు లోకము మానమునకు వెంటనే జలాంజలి ఇచ్చినదా యన్నట్లు పాడినాడు।

వి॥ 'వారిభరాలస' అను సమాసము చేత అప్పటి మేఘధ్వని గర్భభరాలసయైన గర్భిణి యువతి వలె నున్నదని వ్యంగ్యమగును. ఒకనాయకుడు నాయికతో కలహించి ప్రవాసమేగినాడు. వర్షాకాలము వచ్చినది. అర్ధరాత్రి నీటితో నిండిన మేఘము గర్జించినది. గాలి ఎక్కువగా లేదు. రాత్రి తెల్లవార్లు వర్షము కురియుచునే యున్నది. ప్రియురాలి కన్నీళ్ళ నా వర్షము సూచించుచున్నది. నాయకుని కన్నులలో నీరుతిరిగి విషాదగీతము నొక దానిని పాడినాడు. సాధారణ ప్రవాసాలాపము వంటిదా గీతము కాదు. లోకములోని నాయికా నాయకులెవ్వరైనను ఇక మానమును (ప్రణయ కోపమును) పూని ఒకరికొకరు దూరముగా నుండరాదు. అని నిశ్చయించుకొనునట్లు ఆ గానము చేయుచున్నది. అను నర్థమొసగు వాక్యములీ శ్లోకమున నున్నవి. 2. మానమునకు జలాంజలి ఈయబడినది. అను మాటల చేత మానము చచ్చి పోయినది. అని అందుచే జలాంజలి (తిలాంజలి) ఈయబడినది అను అర్థము వ్యంజింపచేయును. 3. బాటసారి పాట ప్రాణములు తోడివేయు ప్రవాసాలాపమే. అంతమాత్రమే కాదు లోకమునకంతటికి ఇకనే నాయికా నాయకులును మానమును పూనలేరు అన్నంత విషాదము నా గీతము నింపుకొన్నది. అని ఆస్తామ్ పదముచే

స్ఫురించును. 4. ఈ శ్లోకమున విషమాలంకారమున్నదని వ్యాఖ్యాత అర్జునవర్మ దేవుడు చెప్పినాడు. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పై శ్లోకమున వియోగియైన నాయకుని విరహగీతము వర్ణింపబడినది. ఈ శ్లోకమున గడచిన కాలమునందలి నాయికా ప్రణయమును వియోగి నాయకుడు స్మరించుట వర్ణింపబడుచున్నది.

శ్లో॥ స్వం దృష్ట్వా కరజక్షత మ్మధుమద గ్రీవా విచార్యైర్ష్యయా
గచ్ఛన్తీ క్వ ను గచ్ఛసీతి విధృతా బాలా పటాన్తే మయా।
ప్రత్యావృత్తముఖీ సబాష్పనయనా మాముఞ్చ ముఞ్చేతి సా
కోప ప్రస్ఫురితాధరా యదవదత్తత్కేన విస్మార్యతే॥ 55

ప్ర॥ మధుమదగ్రీవా-మధువు యొక్క మత్తుతో కూడిన కంఠస్వరముగల; బాలా-చిన్నది; స్వమ్-తన; కరజక్షతమ్-గిచ్చుటచే కలిగిన గాయమును; దృష్ట్వా-చూచి; అవిచార్య-విచారింపక; ఈర్ష్యయా-అసూయతో; గచ్ఛన్తీ-పోవుచున్నదై; మయా-నాచేత; క్వ-ఎక్కడకు; గచ్ఛసిను?-పోవుచున్నావు; ఇతి-అని; పటాన్తే-కొంగున; విధృతా-పట్టుకొనబడినదై; ప్రత్యావృత్తముఖీ-మరల్చిన ముఖము గలదై; సబాష్పనయనా-కన్నీరునిండిన కన్నులు గలదై; కోపప్రస్ఫురితాధరా- కోపముచే నదఱుచున్న పెదవులు గలదై; ముంచ-విడువుము; ముంచ-విడువుము; ఇతి-అని; యద్-ఏది; అవదత్-పలికెనో; తత్-అది; కేన-ఎవనిచే; విస్మార్యతే-మఱువబడును.

తా॥ ఒక నాయిక మధువును త్రావి ప్రియునితో సంగమించినది. ఆ సమయమున నాయకుని గోటితో గిల్లినది. తరువాత నిన్నావిధముగా గిల్లిన దాని కడకే పొమ్ము నేను వెడలిపోవుచున్నానని చెప్పి అసూయతో వెడలి పోవుచుండగా నాయకుడామె కొంగుపట్టుకొని ఎక్కడికి పోయెదవని ప్రశ్నించినాడు. ఆమె అప్పుడు ముఖమును మరల్చి మధువు త్రావిన మత్తులో తొట్రుపడుచున్న కణ్ఠస్వరము గలదై నన్ను విడువుము విడువుము అని పలికినది. ఆ పలుకునప్పుడు ఆమె కన్నులలో నీరు నిండినది. కోపముతో క్రిందిపెదవి యదరినది. ఆ పలుకులెవడు మఱచును?

వి॥ 1. ప్రియసంగమ సమయమున తానే నాయకుని గిల్లినది. ఆ గంటును చూచి ఇది యెవతె పెట్టినదో దానికడకే పొమ్ము అని ఈర్ష్యతో వెడలి పోవుచున్న నాయిక కొంగు పట్టుకొని నాయికను నిలువరించినాడు. మధువు మత్తులో ఆ గాటు తాను చేసినదే యని మఱచిపోయినది. ఇప్పుడాతడు కొంగుపట్టుకొన్నప్పుడు జ్ఞప్తికి

వచ్చినది. తనతప్పు తెలిసికొని తానే యేడ్చుచు నాయకునితో వదలుము వదలుము అని యన్నది. ఆ మాటలెవడు మఱువగలడు అనునర్థము నొసగు మాటలీ శ్లోకమున నున్నవి. 2. బాలా శబ్దము ఆమె అజ్ఞానమును వ్యంజించునదే కాని ఆమె వయస్సును తెలుపునది కాదు. ఆమె ఉదయద్యౌవనయగు ముగ్ధకాదు. పూర్ణయౌవన యగు ప్రౌఢ కావుననే సంభోగ రాసిక్యముతో నాథుని గిల్లినది. అని ఆ శబ్దమామె ప్రౌఢత్వమును మధుమదకృతాజ్ఞానమునే వ్యంజిపచేయును. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పై శ్లోకమున మధుమద గ్రీవ యగు నాయిక యొక్క అజ్ఞానము ప్రస్తావింప బడినది. ఈశ్లోకమున కోపాధిక్యముచేత ప్రియుని ఉపేక్షించిన నాయిక అజ్ఞానము ప్రస్తావింపబడుచున్నది.

శ్లో॥ చపలహృదయే కిం స్వాతంత్ర్యాత్తథా గృహ మాగత
శ్చరణ పతితః ప్రేమార్ద్రార్ద్రః ప్రియః సముపేక్షితః।
తదిద మధునా యావజ్జీవం నిరస్తసుఖోదయా
రుదిత శరణా దుర్జాతానాం సహస్వ రుషాప్ఫలమ్॥ 56

ప్ర॥ చపలహృదయే- ఓ చంచల మనస్కురాలా!; తథా- ఆ విధముగా; గృహమ్- ఇంటికి; ఆగతః- వచ్చిన; చరణపతితః- పాదములపైబడిన; ప్రేమార్ద్రార్ద్రః- ప్రేమచే మిక్కిలి తడిసిన; ప్రియః- ప్రియుడు; స్వాతంత్ర్యాత్- స్వాతంత్ర్యమువలన; కిమ్- ఏల; సముపేక్షితః- ఉపేక్షింపబడినాడు; తద్- అందువలన; అధునా- ఇప్పుడు; నిరస్తసుఖోదయా- సుఖమును వదలుకొన్నదానవై; రుదితశరణా- ఏడుపే శరణము గా గలదానవై; దుర్జాతానామ్- చెడ్డగాపుట్టిన; రుషామ్- కోపముల యొక్క; ఇదమ్- ఈ; ఫలమ్- ఫలమును; యావజ్జీవమ్- ప్రాణములున్నంతవఱకు; సహస్వ- ఓర్చుకొనుము.

తా॥ ఓ చంచల మనస్కురాలా! కోపమును తగ్గించుకొని నీ యింటికి వచ్చి నీ కోపమును తగ్గించుటకు నీ పాదములపై బడిన నీ ప్రియుని నీ యంతట నీవే స్వతంత్రించి యుపేక్షించినావు. ఇప్పుడిక సుఖమును కోల్పోయిన దానవై జీవితకాల మంతయు ఏడ్చుట యే తప్ప మరొక దిక్కులేని దానవై చెడ్డగా పుట్టిన కోపమున యొక్క ఫలము నోర్చుకొనుచుండుము.

వి॥ 1. ప్రణయ కలహమున విడిపోయిన నాయికా నాయకులు కొంతవఱకు మరల కలిసికొనలేదు. స్నేహితురాలి జోక్యముతో కోపము తగ్గించుకొని నాయకుడు వచ్చి నాయిక కోపమును తగ్గించుటకు పాదములపై కూడ పడినాడు. ఆ సమయమున

నీవు నాయకునాదరించి ఆతని యాదరమును పొందియుంటిని బాగుండెడిది. అట్లు చేయక ఎవరి సలహాను స్వీకరించక నీయంతట నీవే స్వతంత్రించి యాతని నుపేక్షించుటచే నాతడు విరక్తుడై పోయినాడు. ఇక తిరిగి యాతనిని రప్పించుట అసాధ్యము. నీవు చేసిన తప్పునకు దుష్టముగా కలిగించుకొన్న కోపములకు ఫలముగా యావజ్జీవమేడ్చుచు దుఃఖము సహించు చుండుము. అను అర్థమొసగు వాక్యములీ శ్లోకమున నున్నవి. 2. రుషామ్ అను బహువచనాంత శబ్దము చేత అతడు మాటి మాటికి పాదములపై బడి నిన్నూరడింప యత్నించినాడు. నీవు మాత్రము ఆ యత్నముల నన్నింటిని అన్ని సార్లు పుట్టిన కోపముతోనే ఉపేక్షించినావు. అను నర్థము వ్యంగ్యమగుచున్నది. 3. ఈ శ్లోకమున సాభిప్రాయ విశేషణము లున్నందున పరికరాలంకారమున్నదని అర్జునవర్మదేవుడు చెప్పినాడు. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పై శ్లోకము కోప ఫలముగా పెక్కుసార్లు చరణపతిత నాయకును పేక్షించిన నాయికకు కలిగిన దుఃఖము వర్ణింపబడినది. ఈ శ్లోకమున నాయిక కోపముతో తనను నాయకుడు ప్రేమించుట లేదని యేడ్చుట వర్ణింపబడుచున్నది.

శ్లో॥ బాలే నాథ విముంచ మానిని రుషం రోషాన్మయా కిం కృతం
ఖేదోఽస్మాసు న మేఽపరాధ్యతి భవాన్ సర్వేఽపరాధా మయి।
తత్కిం రోదిషి గద్గదేన వచసా కస్యాగ్రతో రుద్యతే
నన్వేతన్మమ కా తవాస్మి దయితా నాస్మీత్యతో రుద్యతే॥ 57

ప్ర॥ బాలే - ఓ చిన్నదానా! అమాయకురాలా!; నాథ- ఓ నాథా; మానిని- ఓ మానినీ; రుషమ్- కోపమును; విముంచ- విడుపుము; మయా- నాచేత; రోషాత్- కోపమువలన; కిమ్- ఏమి; కృతమ్- చేయుబడినది; అస్మాసు- మాయందు; ఖేదః- దుఃఖము; మే- నాకు; భవాన్- నీవు; న అపరాధ్యతి- అపరాధము చేయుట లేదు; సర్వే- అన్ని; అపరాధాః- అపరాధములు; మయి- నాయందు(ఉన్నవి); తత్- అయితే; గద్గదేన- గద్గత అను; వచసా- స్వరముతో(వాక్కుతో); కిమ్- ఏల; రోదిషి- ఏడ్చుచున్నావు; కస్య- ఎవరి యొక్క; అగ్రతః- ఎదుట; రుద్యతే- ఏడ్వబడుచున్నది; ఏతత్ - ఇది(ఏడ్పు) మమ నను- నాయొక్క (ఎదుట) గదా! తవ- నీకు; కా- ఎవరైను; అస్మి- అగుదును; దయితా- ప్రియురాలవు; నఅస్మి- కాను; ఇతి- అని; అతః- ఇందువలననే; రుద్యతే- ఏడ్వబడుచున్నది.

తా॥ నాయకుడు- ఓ చిన్నదానా!; నాయిక- ఓ నాథా!; నాయకుడు- ఓ

కోపముగలదానా కోపమును విడువుము; నాయిక-కోపమువలన నేమి చేసితిని?; నాయకుడు-మా యందు దుఃఖమును కలిగించితివి; నాయిక-నీవునాకపకారము చేయలేదు అన్ని అపరాధవులు నాయందే ఉన్నవి; నాయకుడు-అయితే ఎందుకుగద్గదస్వరముతో ఏడ్చుచున్నావు; నాయిక-ఎవరి యెదుట ఏడ్చుచున్నాను?; నాయకుడు-నాయెదుట గదా!; నాయిక-నేను నీకేమి అగుదును?; నాయకుడు-ప్రియురాలవు గదా; నాయిక-కాలేదనియే ఏడ్చుచున్నాను.

వి॥ నాయికా నాయకుల సంభాషణ ఈ శ్లోకమున నున్నది. ఓ బాలా అని నాయకుడు పిలువగానే కోపములేనట్లు నాయిక ఓయినాథా యన్నది. నాయకుడు కోపమును విడువుమనగానే కోపముతో నేనేమి చేసినాను. నాకు కోపమున్నట్లు నీకెట్లు తెలిసినది. కోపముతో నిన్ను తిట్టితినా కొట్టితినా అన్నది. అప్పుడు నీ కోపముతో నా మనసును దుఃఖమును కల్పించినావని యన్నాడు. అప్పుడు నీవేమి అపకారము చేయనప్పుడు నాకేల కోపము వచ్చును. దానివలన నీకేల దుఃఖము కలుగును. అన్ని అపరాధములు నాయందే ఉన్నవిగాదా అని యన్నది. అప్పుడు నాయకుడయితే ఎందుకు గద్గద స్వరముతో నేడ్చుచున్నావని ప్రశ్నించినాడు అప్పుడు నేనెవరి ముందట ఏడ్చుచున్నాను అని ఎదురు ప్రశ్నించినది. అప్పుడు నాముందఱనే ఏడ్చుచు ఎవరి ముందఱ ఏడ్చుచున్నావనెద వేమి అని నాయకుడు ప్రశ్నించెను. అప్పుడు నీ ముందఱ ఏడ్చుటకు నేను నీకే మగుదును అని ప్రశ్నించినది. అప్పుడు నాయకుడు నాకు ప్రియురాలవగుదువు గదా! దుఃఖమును ప్రియులతోడనే పంచుకోవలెను గదా అని అన్నాడు. అప్పుడు నాయిక నీకు ప్రియురాలను కాలేక పోయితిననియే యేడ్చుచున్నాను అని చెప్పినది. 2. ఈ ప్రశ్నోత్తరముల వలన నాయికలోని మానము పోలేదని వ్యంజింపజేయు బడుచున్నది. ఆ కోపముతోనే ప్రశ్నలకు సూటిగా సమాధానమీయక వక్రముగా నిచ్చినది. అందుచేత ఈ శ్లోకమున ప్రశ్నోత్తరాలంకారమున్నది అని వ్యాఖ్యాత అర్జున వర్మదేవుడు చెప్పినాడు. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పై శ్లోకమున నాయకుడు బాలే సంబోధించి ఆమెకు లేని ముగ్ధత్వము నాపాదించుట చెప్పబడినది. ఈ శ్లోకమున ప్రౌఢనాయిక తన పూర్వాను భూత ముగ్ధత్వమును ఆ సమయపు పోరపాట్లను స్మరించుకొనుట వర్ణింపబడుచున్నది.

శ్లో॥ శ్లిష్టః కణ్ఠే కిమితి న మయా మూఢయా ప్రాణ నాథ
చుమ్బ త్యస్మి న్వదన వినతిః కిం కృతా కిం న దృష్టః

నోక్తః కస్మాదితి నవవధూచేష్టితం చింతయన్తీ
పశ్చాత్తాపం వహతి తరుణీ ప్రేమ్ణి జాతే రసజ్ఞా॥ 58

ప్ర॥ మూఢయా- మూఢురాలనైన; మయా- నాచేత; ప్రాణనాథ- జీవితేశ్వరుడు; కణ్ఠే- కణ్ఠమున; కిమ్‌ఇతి-ఎందుకని; నశ్లిష్టః-కౌగలించుకొనబడలేదు; అస్మిన్- ఈతడు; చుమ్బతి- ముద్దుపెట్టుకొనుచుండగా; వదనవినతిః- తలను వంచుకొనుట; కిమ్- ఏల; కృతా- చేయబడినది; కిమ్- ఏల; నదృష్టః- చూడబడలేదు; కస్మాత్ - ఏల; నఉక్తః- చెప్పబడలేదు; ఇతి- అని; నవవధూచేష్టితమ్- కొత్తకోడలుగా తాను చేసినపనిని; చిన్తయన్తీ- ఆలోచించుకొనచున్నదై; తరుణీ - యువతి; ప్రేమ్ణి- ప్రేమ; జాతే- కలుగగా; రసజ్ఞా- రసజ్ఞురాలై; పశ్చాత్తాపమ్- పశ్చాత్తాపమును; వహతి- పొందుచున్నది.

తా॥ పూర్వము మూఢురాలనైన నేను ఏల నాప్రాణనాథుని కౌగలించుకొనలేకపోయితిని? అతడు ముద్దు బెట్టుకొనుచుండగా ఏల తలవంచు కొంటిని? ఆయన నేల చూడలేక పోయితిని? అడిగినను ఏల బదులు పలుకలేక పోయితిని. అని సంపూర్ణముగా యౌవనమును పొంది ప్రేమరసము నెఱిగిన ప్రౌఢనాయిక ఇప్పుడు పశ్చాత్తాప పడుచున్నది.

వి॥1. కొత్తగా కాపురమునకు వచ్చిన దినములలో నాథుడు కౌగలించుకొన్నప్పుడు స్తబ్ధముగా నుంటినే కాని ప్రత్యాలింగనము చేసికొనలేదు. అతడు ముద్దుబెట్టు కొన్నప్పుడు మరల నాతని ముద్దు బెట్టుకొనలేదు. కనీసము ఆతని కన్నులు విప్పి చూడనేలేదు. తనకు తానై ఆయన ఏదైన అడిగినప్పుడు బదులు కూడ చెప్పలేదు. పూర్వము ఇట్లెందుకు నిస్స్పందముగా జడముగానుంటిని. ఇప్పుడు అప్పుడు చేయని ప్రత్యాలింగమును ప్రతిచుంబనమును కన్నుల లోనికి చూచుట స్వయముగా ఏదేని అడుగుట ఆయన అడిగిన దానికి బదులు చెప్పుట మొదలగు పనులు చేయుచున్నప్పుడు ఎంతో ప్రేమరసమును ఆనందమును అనుభవించు చున్నాను. అప్పుడు సిగ్గుతో ఇప్పటివలె చేయుకపోవుట చేత ఎంత ప్రేమరసమును ఆనందమును కోల్పోయితినో! అప్పుడు నేను మూఢురాలను. ఇప్పటివలె మూఢత్వము లేక అప్పుడే ప్రవర్తించగలిగి యుండినచో నెంత ఆనందము ననుభవించి యుండెడిదానను- అని ఓ ప్రౌఢనాయిక పశ్చాత్తాప పడుట ఈ శ్లోకమున చెప్పబడినది. 2. ఈ శ్లోకమున అలంకారము స్మృతి పూర్వపు మౌంద్యమును అది క్రమముగా యౌవనము చేత ప్రేమచేత తాను ఆక్రమింప బడిన విషయములను వర్ణించుటకు మందాక్రాంతా వృత్తము నుపయోగించుట యుచితముగా నున్నది.

శ్లో॥ శ్రుత్వా నామాపి యస్య స్ఫుట ఘన పులకం జాయతేఽంగం సమన్తా
ద్దృష్ట్వా యస్యాననేందుం భవతి వపురిదం చన్ద్రకాంతానుకారి।
తస్మిన్నాగత్య కణ్ఠగ్రహనికటపద స్థాయిని ప్రాణ నాథే
భగ్నా మానస్య చింతా భవతి మయి పున ర్వజ్రమయ్యాం కదాచిత్॥

ప్ర॥ యస్య-ఎవని యొక్క; నామఅపి-పేరునుకూడా; శ్రుత్వా-విని; అంగం-దేహము; సమస్తాత్-అంతట; స్ఫుటఘనపులకం-స్పష్టముగా పెద్దగా గగుర్పాటు కలది; జాయతే-అగునో; యస్య-ఎవని యొక్క; అననేందుమ్-ముఖచంద్రుని; దృష్ట్వా-చూచి; ఇదమ్-ఈ; వపుః-శరీరము; చంద్రకాంతానుకారి-చంద్రకాంతమణి ననుకరించునది; భవతి-అగునో; తస్మిన్-ఆ; ప్రాణ నాథే-జీవితేశ్వరుడు; కణ్ఠగ్రహణ నికటపదస్థాయిని-కౌగలించుకొనునంత దగ్గఱగా నుండగా; భగ్నా- పాడు; మానస్య -కోపము యొక్క; చిన్తా-చిన్త; వజ్రమయ్యామ్-వజ్రములచే చేయబడిన; మయి-నాయందు; కదాచిత్-ఒకప్పుడు; భవతి- కలుగును; పునః-మఱి.

తా॥ ఎవరి పేరు మాత్రమే విని దేహమంతయు పులకితమగునో, ఎవని ముఖ చంద్రుని చూచి చంద్రకాంతమువలె ఈ శరీరము కరగి పోవునో అట్టి ప్రాణ నాయకుడు కౌగలించుకొనునంత దగ్గఱకు వచ్చినప్పుడును వజ్రముచే చేయబడిన నాయందు పాడు కోపమును గూర్చిన ఆలోచన ఒకప్పుడు కలుగును. మఱి.

వి॥ **1.** సమీపమున భర్త లేనప్పుడాతని పేరు వినినంత మాత్రమున ఒడలంతయు గగుర్పాటు చెందును. ఆయనను దూరమునుండి చూచినప్పుడే చంద్రుని చూచిన చంద్రకాంతశిలవలె నా దేహము కరగి పోనారంభించును. అట్టి ప్రేమ నాయకునిపై నాకున్నది కాని ఈ పాడు కోపమెక్కడ ఎప్పుడు దాపురించెనో, ఆ నాప్రాణ నాథుడు కౌగిలించుకొనునంత సమీపమున నిలచియున్నను ఆయనను కౌగలించుకొన నీయలేదు. నేనాయనను కౌగలించుకొనలేదు. అప్పటి నా శరీరమంత వజ్రమయ ముగా నెట్లుమారినదోమరి అను నర్థము నొసగు వాక్యములీ శ్లోకమున నున్నవి.
**2.** నాయకుడు సమీపమునకు వచ్చినప్పుడాతని నాదరింపలేదు. అతడు వెడలి పోయినాడు. అతడు వచ్చినప్పు డాతని నేల ఆదరింపక వెడలగొట్టినావని చెలికత్తె అడిగినది. అప్పుడు నాయిక చెప్పిన ఈశ్లోకములోని మాటల వలన ఆమె ప్రేమకలదే కాని పాడుకోపము వచ్చి సంగమావకాశమును పాడు చేసినదని వ్యంగ్యమగును.
**3.** అమరుక శతకమున పెక్కు ప్రక్షిప్త శ్లోకములున్నవి. వానిలో పెక్కింటిని అర్జునవర్మ దేవుడు వ్యాఖ్యానించలేదు. అవి నీరసముగా నుండి ఈ శ్లోకములకు దీటుగా నుండక

పోవుటయే కారణము. ఈ శ్లోకము ప్రక్షిప్తమే యైనను ఇది నీరసముగా లేక పోవుట చేత వ్యాఖ్యానించినానని అర్జునవర్మదేవుడు చెప్పినాడు. **4.** కోపస్వభావముగల రుద్రుడు స్రజమును (మాలను) ధరించును. ఆ స్రజము మల్లెల మాలకాదు. రుండముల మాల. రుద్రస్వభావమైన కోపము నీస్రగ్ధరావృత్తమున నిబంధించుట యుచితముగా నేయున్నదని చెప్పవచ్చును. 'ఆననేన్దుమ్' అను సమాసమున రూపకాలంకారము, శరీరము చంద్రకాంత మణి ననుకరించు చున్నదనుట లోను పమాలంకారమున్నది. కఱగుటలో (చెమట పట్టుట) స్వేదము అను సాత్త్విక భావము గోచరించు చున్నది.

అవ॥ పూర్వశ్లోకమున నాయిక కోపమునకు కారణమైన నాయకుని అన్యాంగనా సంగమ మూహ్యమైయున్నది. ఈ శ్లోకమున నాయకుని యందా సంగమము యొక్క చిహ్నములు వర్ణింపబడుచున్నవి.

శ్లో॥ లాక్షాలక్ష్మ లలాట పట్టమభితః కేయూరముద్రా గలే
వక్త్రే కజ్జల కాలిమా నయనయోస్తామ్బూలరాగోఽపరః।
దృష్ట్వా కోపవిధాయి మణ్డనమిద మ్ప్రాత శ్చిర మ్ప్రేయసో
లీలా తామర సోదరే మృగదృశః శ్వాసాః సమాప్తిం గతాః॥ 60

ప్ర॥ లలాటపట్టమ్-ఫాలపట్టము; అభితః-అంతట; లాక్షాలక్ష్మ-లత్తుక చిహ్నము; గలే-కణ్ఠమున; కేయూరముద్రా-భుజకీర్తులచిహ్నము; వక్త్రే-ముఖమున; కజ్జలకాలిమా-కాటుకనలుపు; నయనయోః-కన్నులయందు; అపరః-మరొక; తామ్బూలరాగః-తామ్బూలరాగము; ఇదమ్-ఈ; కోపవిధాయి-కోపముకలిగించు; ప్రేయసః-ప్రియునియొక్క; మండనమ్-అలంకారమును; ప్రాతః-ప్రొద్దున; చిరమ్-చాలాసేపు; దృష్ట్వా-చూచి; లీలాతామరసోదరే-విలాసకమలము పొట్టలో; మృగదృశః-లేడికన్నులవంటి కన్నులుగలదాని యొక్క; శ్వాసాః-నిట్టూర్పులు; సమాప్తిమ్-సమాప్తిని; గతాః-పొందినవి.

తా॥ పరాంగన యొక్కలత్తుక, విశాలమైన ప్రియుని నుదుట నంతట ఆమె భుజ కీర్తుల చిహ్నములు ఆయన కంఠమున ఆమె కన్నుల కాటుక ఆయన మూతిమీద ఆమె తాంబూలపురాగము ఆయన కన్నుల యందున్నవి. ప్రొద్దుననే వచ్చిన నాయకుని కోపము కలిగించు నీ అలంకారమును చాలసేపు చూచిన నాయిక యొక్క నిట్టూర్పులు ఆమె పట్టుకొన్న విలాసకమలములోనే ఆగిపోయినవి.

వి॥ 1. నాయకుడు రాత్రి పరస్త్రీ సంగమము చేసి నాయిక యింటికి ప్రొద్దుననే వచ్చినాడు. ఆ పరస్త్రీ దగ్గఱకు పోయి నాయకుడామె పాదములపై పడినాడు. ఆమె

పాదములకు పూసికొన్న పారాణి నాయకునికి తిలకమువలె నుదురంతయు వ్యాపించినది. నాయకుడెందుకు ఆమె పాదములపై బడినాడు. నాయకునకు బహుస్త్రీ లౌల్యమున్నదని ఆ పరస్త్రీకి కూడ తెలియును. నాయకుడు కాళ్ళమీద పడి ప్రార్థింపగా ఆ రాత్రి తనతో గడపుట కొప్పుకొన్నదే కాని మొదటనే యొప్పుకొనలేదు. నాయకుడు మిక్కిలి రసికుడు అని ఆమెకు తెలియును. అందుకే ఆమెయే స్వయముగా నాయకుని కంఠమును కౌగలించుకొన్నది. అప్పుడామె భుజకీర్తుల ముద్రలానాయకుని కంఠము పైన నేర్పడినవి. నాయకుడామె కన్నులను కనీస మొక్కొక్క దానినొక్కొక్కమారో లేక పలుమార్లో చుంబించినాడు. ఆమె కన్నుల కాటుక యంతయు నాయకుని మూతికంటుకున్నది. ఆ తరువాత నా పరస్త్రీ నాయకుని కన్నులను చుంబించినది. అప్పుడామె తాంబూలరాగమంతయు నాయకుని కన్నుల కంటుకొన్నది. నాయిక కడకు రాత్రివచ్చెదనని చెప్పి పరస్త్రీ కడకు వెడలిన నాయకుడు ప్రొద్దుననే ఆదరాబాదరాగా నాయిక కడకు వచ్చినాడు. అప్పుడు కనీసము ఆ చిహ్నములను తొలగించుకొనవలెనని కాని ఆచిహ్నములు తన కంటుకొన్నవని కాని ఆతడూహించనే లేదు. కాని నాయిక మాత్రము రాత్రిరాక ప్రొద్దుననే వచ్చిన నాయకుని యాచిహ్నముల జూచినది. కోపించినది. కోపముచే దాని వలన గలిగిన తాపముచే నిట్టూర్పులు విడచినది. ఆ రాత్రి నాయకుని విరహమున కాగుచున్న నాయికకు శీతలోప చారనిమిత్తము చెలికత్తె కమలమును చేతికిచ్చినది. నాయిక దానితో తన కోపమును దాచుకొను నుద్దేశముతో ముఖమున కడ్డుపెట్టుకొన్నది. అప్పుడామె నిట్టూర్పులన్నియు ఆ కమలములోనే అడగి పోయినవి. నాయకుని ముఖము మీదకు రాక పోవుటచే అతని కామె కోపముతెలియ రాలేదు. అను నర్థమును వ్యంజింపచేయు వాక్యములీ శ్లోకమున నున్నవి. 2. లీలా కమలమనుటచే రాత్రి చెలికత్తె లిచ్చిన కమలమును ప్రొద్దుట వఱకామె యట్లే ధరించి యున్నదని ఆమె నిద్దుర పోలేదనియు వ్యంజింపబడుచున్నది. 'సమాప్తింగతాః' అను పాఠమున నాయిక మరణించినదను అమంగళము ధ్వనించుటచే 'చిరంస్థాపితా' అను పాఠమును కల్పించుకొన వచ్చును. లేక ప్రమాదోఽధిమ తామపి అని సరిపెట్టు కొనవచ్చును. మాన విప్రలమ్భాను భావములైన నిఃశ్వాసముల యొక్క సమాప్తి తాపకోపసమాప్తిని సూచించునని చెప్పవచ్చును. తెగించినవానికై తపించుట యనవసరము కదా? ఈ సందర్భము నాయకుని దాక్షిణ్యమునే సూచించును. కాని అతని దుష్టత్వమునుకాని శఠత్వమునుకాని సూచింపదు. నాయకుడు పత్నీద్వయాను రక్తుడనుట స్పష్టమగుటచే అతనినే అనుకూల నాయకుడనుట పొసగనే పొసంగదు.

పరస్త్రీ, పరాంగనా శబ్దముల ప్రయోగము నాయిక దృష్టిలో పరాత్వమే. ఆమె కన్యయని కాని పరుని యిల్లాలని చెప్పుటకు కారణమేమియు కానరాదు. 3. హేతువను అలంకారమున్నదని అర్జున వర్మదేవుడు చెప్పినాడు. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పై శ్లోకమున పరాంగనాసక్తిచే నాయకుడు దూరమైనాడను నాయిక యొక్క దుఃఖము వర్ణింపబడినది. ఈ శ్లోకమున దూరదేశములకు పోవుచు అనగా ప్రవాసమేగుచుండ నాయకుడు తనకు దూరమగుచున్నాడను నాయిక దుఃఖము వర్ణింపబడుచున్నది.

శ్లో॥ లోలైర్లోచనవారిభిః సశపథైః పాదప్రణామైః ప్రియై
రన్యాస్తా వినివారయన్తి కృపణాః ప్రాణేశ్వర ప్రస్థితమ్।
పుణ్యాహం వ్రజ మంగలం సుదివసః ప్రాతః ప్రయాతస్య తే
యత్స్నేహోచితమీహిత ప్రియ! మయా తన్నిర్గతః శ్రోష్యసి॥61

ప్ర॥ లోలైః-చంచలములైన; లోచనవారిభిః-కన్నీళ్ళచేత; సశపథైః-ఒట్లతో కూడిన; పాదప్రణామైః-పాదప్రణామములచేత; ప్రియైః-మంచిమాటలచేత; అన్యాః-ఇతరలైన; కృపణాః-దీనలైన; తాః-వారు (నాయికలు); ప్రస్థితమ్-ప్రవాసమేగు; ప్రాణేశ్వరమ్-జీవితేశ్వరుని; వినివారయన్తి-వారించెదరు; ప్రియ-ఓ ప్రియుడా!; పుణ్యాహమ్-పుణ్యదినము; సుదివసః-మంచిదినము; ప్రాతః-ప్రొద్దుననే; ప్రయాతస్య-బయలుదేరిన; తే-నీకు; మంగలమ్-మంగలము; వ్రజ-పొమ్ము; స్నేహోచితమ్-స్నేహమున తగినది; యత్-ఏది; మయా-నాచేత; ఈహితమ్- కోరబడినదో; తత్-దానిని; నిర్గతః-వెడలినవాడవై; శ్రోష్యసి-వినగలవు.

తా॥ ఓ ప్రియుడా! ప్రవాసమునకు బయలు దేరిన ప్రాణేశ్వరుని నితరస్త్రీలు, కదలుచున్న కన్నీళ్ళతో ఒట్లతో కూడిన పాదప్రణామములతో ప్రియ వచనములతో నివారించెదరు. నేను ఇది పుణ్యదినము మంచిదినము పొద్దుననే బయలు దేరిన నీకు మంగలమగును. పొమ్ము. స్నేహమునకు తగినట్లు నేను కోరునదేదో ప్రవాసమేగిన పిమ్మట నీవు వినగలవు.

వి॥ 1. ఇతరులవలె నేను నిన్ను ప్రవాసమునుండి వారించుటకు కన్నీరు విడుచుట లేదు. పాదములపై బడుటలేదు. ప్రియవచనముల బలుకుటలేదు, ఒట్లు పెట్టుకొనుట లేదు. వారు కృపణలు నేను కృపణను కాను ధీరను. కావుననే ఓ ప్రియుడా నేడు పుణ్యదినము మంచిదినము ప్రొద్దుననే బయలు దేరినావు. నీకు మంగలమగును. పొమ్ము అని చెప్పుచున్నాను. నేను కోరినదేదో నీకు ప్రవాసమేగిన పిమ్మట తెలియు

గలదు అను నర్థమొసగు వాక్యములీ శ్లోకమున నున్నవి. **2.** 'పుణ్యాహమ్' అను మాటచే నేను పుణ్యాత్మురాలను. వారు నాయంతపుణ్యులు కారు. కావుననే వారు ప్రియ విరహమును సహింపగలరు. నేను సహింపజాలను. కావున నీవు ప్రవాసమేగిన తోడనే నేను స్వర్గమున కేగుదును. అను నర్థము వ్యంజిత మగుచున్నది. గోష్యసి అను భవిష్యత్కాలవాచి క్రియ చేత నేను ఇప్పుడే ప్రాణముల విడువదలిచినాను. కాని దానివలన నీ ప్రయాణమునకు విఘ్నము కాని అమంగళము కాని కలుగవచ్చును కావున నేనిప్పుడే చావను. నీవు బయలు దేరిన కొన్ని గడియలలోనే నీవు బయలు దేరిన తరువాత బయలుదేరు ప్రవాసులవలన నీకు తెలియగలదను అర్థము వ్యంజిత మగుచున్నది. **3.** ఇందు పరాభవాలంకారమున్నదని అర్జునవర్మదేవుడు చెప్పినాడు. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పై శ్లోకమున నాయిక చెప్పినమాటలలో నిగూఢార్థమును గ్రహించి నాయకుడు ప్రణయమును మానినట్లు కాని చేసినట్లు కాని చెప్పబడలేదు. ఈ శ్లోకమున నాయకుడు ప్రణయమును మానుకొనునట్లు చేసిన నాయిక వృత్తాంతము చెప్పబడుచున్నది.

శ్లో॥ లగ్నా నాంశుకపల్లవే భుజలతా న ద్వార దేశే ఒర్పితా
నో వా పాదయుగే స్వయం నిపతితం తిష్ఠేతి నోక్తం వచః।
కాలే కేవలమమ్బుదాలి మలినే గన్తు ప్రవృత్తః శఠ
స్తన్వ్యా బాష్పజలౌఘ కల్పితనదీ పూరేణ రుద్ధః ప్రియః॥ 62

ప్ర॥ అంశుకపల్లవే- చిగురువంటి కొంగున; న లగ్నా- పట్టుకొనినదికాదు; ద్వారదేశే - ద్వారదేశమున; భుజలతా- తీగవంటి బాహువు; న అర్పితా- ఉంచబడలేదు; పాదయుగే- చరణయుగ్మమున; స్వయమ్- స్వయముగా; నోవాపతితమ్- పడినది కాదు; తిష్ఠ- ఆగుము; ఇతి- అని; వచః- మాట; నఉక్తమ్- చెప్పబడలేదు; అమ్బుదలి మలినే- మేఘములతో మలినమైన; కాలే - కాలమున; కేవలమ్- కేవలము; గంతుమ్- పోవుటకు; ప్రవృత్తః- పూనుకొన్న; ప్రియః- ప్రియుడైన; శఠః- శఠుడు; తన్వ్యా- కాంతచేత; బాష్పజలౌఘకల్పితనదీపూరేణ - కన్నీటి ప్రవాహముచే కల్పింపబడిన నదీ ప్రవాహముతో; రుద్ధః- అడ్డగింపబడిన వాడైనాడు.

తా॥ ప్రవాసమేగు ప్రియుని కొంగు పట్టుకొనలేదు. ద్వారమున కడ్డముగా బాహువును పెట్టలేదు. పాదములపై బడలేదు. పోవలదనియు బతిమిలాడలేదు. ఆ మబ్బుల కాలమున పోవుటకు పూనుకొన్న ఆ మొండి ప్రియుడు ఆమె విడచిన కన్నీటి ప్రవాహము దాటలేక అడ్డగింప బడినాడు. అంతే.

వి॥ 1. సాధారణముగా ప్రవాసమేగు ప్రియుని వారించుటకు నాయికలు నాథుని ఉత్తరీయపు కొంగును పట్టుకొందురు. లేదా ద్వారమున కడ్డముగా నిల్చియుందురు. లేదా పాదములపై బడి పోవలదని బ్రతిమిలాడుదురు. ఈ పనులేవియు నాయిక చేయలేదు. కాని నాయకుడు మాత్రము ఆగిపోయినాడు. అది మబ్బుల కాలము కాని ఆ మబ్బులు వర్షింపక పూర్వమే ఆమె కన్నులు మబ్బుల కన్న అధికముగా వర్షించినవి. ఆ కన్నీరొక నదీ ప్రవాహమేయ్యై పారినది. ఇక నాయకుడెట్లు దాటి పోగలడు? ఎంత శఠుడైనను ప్రియుడు గదా! ప్రియురాలేడ్చుచుండగా నెట్లు పోగలడు అను నర్థమును తెలుపు వాక్యములీ శ్లోకమున నున్నవి. 2. 60,61 శ్లోకములలోని నాయికలు షష్టిపూర్తి చేసికొన్న అమరుకుని అసాధారణ నాయికలు. వారందరి వలె ప్రవర్తింపరు. అమరుకుని కవిత లసాధారణములు. ఇతరులట్లు రచింపజాలరు. 60లోని నాయిక నేనందఱ వంటి దానను కానని స్వయముగనే చెప్పినది. కాని 61 వ శ్లోకములోని నాయిక చెప్పలేదు. అసాధారణమైన పనిచేసినది. సాధారణముగా నాయికలు ప్రియుడు ప్రవాసమేగు నప్పుడు నాయిక కన్నీరు పెట్టుకొనుట కాని అది అమంగలమని భావించి ఆ కన్నీటిని కన్నులలోనే దాచు కొనుట గాని చేయుదురు. ఈ నాయిక కన్నీటి నదినే పారించినది. దమ్మున్న ఈదుకొని పొమ్ము అని సవాలు చేసినది. ఇంకేమి నాయకుని కాళ్ళకు బంధము పడినది. మేఘములకు ముందే కన్నులు వర్షించుటచే. 3. పూర్వాలంకార మున్నదని అర్జునవర్మదేవుడు చెప్పినాడు. కన్నుల యందు మేఘసామ్యము వ్యంగ్యమగుటచే ఇందుపమాలంకారము ధ్వనించుచున్నది. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పూర్వశ్లోకమున నాయిక నాయకుని ప్రవాసమునుండి మరల్చుట అనురాగము ఫలించుట చెప్పబడినది. ఈ శ్లోకమున లజ్జాదులచే అనురాగము ఫలింపక పోవుట చెప్పబడుచున్నది.

శ్లో॥ ఆస్తాం విశ్వసనం సఖీషు విదితాభిప్రాయసారే జనే
తత్రాప్యర్పయితుం దృశం సురచితాం శక్నోమి న వ్రీడయా।
లోకోఽప్యేష పరోపహాస చతురః సూక్ష్మేఙ్గితజ్ఞోఽప్యలం
మాతః కం శరణం వ్రజామి హృదయే జీర్ణోఽనురాగానలః॥63

ప్ర॥ సఖీషు-చెలికత్తెలయందు; విశ్వసనమ్-నమ్మకము; ఆస్తామ్-ఉండనీ; విదితాభిప్రాయసారే-తెలిసిన అభిప్రాయ సారముగల; జనే-జనుడైన; తత్రఅపి-అతని యందు గూడ; సురచితాం-చక్కగా చేయబడిన; దృశమ్-చూపును; వ్రీడయా

సిగ్గుతో; అర్పయితుమ్-అర్పించ; నశక్నోమి-లేక పోవుచున్నాను; ఏష-ఈ; లోకః అపి-లోకము కూడ; పరోపహాసచచతురః-ఇతరుల వెక్కిరించుట యందు నిపుణమైనది; సూక్ష్మేఙ్గితజ్ఞఃఅపి-సూక్ష్మముగా నున్న హృదయములోని విషయము ఎఱిగినట్టిదికూడ; అలమ్-చాలును; మాతః-అమ్మా; కమ్-ఎవరిని; శరణమ్-రక్షకునిగా; వ్రజామి-పొందెదను; హృదయే-హృదయము నందు; అనురాగానలః-అనురాగమనెడి అగ్ని; జీర్ణః-జీర్ణించినిది.

తా॥ చెలికత్తెలను నమ్మలేను. నాయందాతనికి ప్రేమ యున్నదని తెలిసినను అతనిని తేరిపారజూచుటకే సిగ్గుతోనాకు సాధ్యమగుట లేదు. సిగ్గు విడచి చూతమన్నను ఈ లోకము ఇతరులను వెక్కిరించు స్వభావమును కలిగియున్నది. మరియు పరుల హృదయములోని భావమును కూడ పసిగట్టగలిగి యున్నది. అమ్మా! ఇప్పుడు నాకు దిక్కెవరు. అనురాగాగ్ని నాహృదయము నందే జీర్ణము అగుచున్నది.

వి॥ 1. ఒక నాయిక నాయకుని ప్రేమించినది. ఆతడును ఈమెను ప్రేమించు చున్నాడనియు పసికట్టినది. అయినప్పుడు ఆతని నిక నిశ్శంకముగా చూడవచ్చును, గదా దానికి సిగ్గు అడ్డము వచ్చుటచే ఱెప్పల నార్పక కొంచెము సేపు చూతమన్నను వీలుకాకున్నది. ఇరుగు పొరుగు వారలెప్పుడు ఎవరి నెప్పు డెట్లు వెక్కిరించు నవకాశము చిక్కునా అని యెదిరిచూచుచుందురు. నేనాతనిని సిగ్గువిడచి చూచినానే యను కొనుము. ఏదోకారణమున మాకు సంగమము కలుగకున్నను వెక్కిరించుటకు మాత్రము వెనుదీయరు. నాయకుని సంగమము కలిగిన ఈర్ష్యతో జూచెదరు. కలుగకున్న గొంతెమ్మకోరిక యని మెత్తిపొడిచెదరు. పరిహసించి కడుపులు నింపు కొనుటయే వారికి పని. వేరుపని యేమియు ఉండదు. ఎదుటి వారి హృదయము నెఱుంగుటలో వారిది అందె వేసిన చేయి. సఖులను నమ్మి పంపుదు నన్నను వారు కార్యము సాధింపగలరో లేదో అను శంక బాధించుచున్నది. అదిగాక వారు మా యిరువురి అనురాగము యొక్క రహస్యమును బట్టబయలు చేసినను చేయవచ్చును. అట్లు యిరువురి అనురాగము యొక్క రహస్యమును బట్టబయలు చేసినను చేయవచ్చును. అట్లు చేయరను నమ్మకమేమున్నది. పోనీ నేనే స్వయముగా ఆతని కడకు పోయి ఆతనినింటికి కొని రాగలిగిన ఇక ఇరుగుపొరుగు వారు జాతరయే చేతురు. అమ్మా! నీవు పెద్దదానవు. ఈ సమయమున నీవు దక్క నాకు దిక్కెవ్వరున్నారు. ఎవరి నుపాయము నడుగగలను. ఇక నా యెదలోని అనురాగాగ్ని ఆగి పోవుచునే యుండవలెనా! ఏమి చేయవలెను? నీవే చెప్పుము అను నర్థమొసగు వాక్యములీ శ్లోకమున నున్నవి. 2. ఈ శ్లోకమున అసత్యముచ్చయాలంకారమున్నదని అర్జునవర్మదేవుడు చెప్పినాడు. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పూర్వశ్లోకమున లజ్జాదులచే అనురాగము ఫలింపక పోవుట చెప్పబడినది. ఈ శ్లోకమున వానిని జయించిన నాయిక యొక్క అనురాగ సాఫల్యము చెప్పబడు చున్నది.

శ్లో॥ న జానే సమ్ముఖాయాతే ప్రియాణి వదతి ప్రియే।
సర్వాణ్యంగాని కిం యాన్తి నేత్రతాం కిము కర్ణతామ్॥ 64

ప్ర॥ ప్రియే-ప్రియుడు; సమ్ముఖాయాతే-ఎదుటకురాగా; ప్రియాణి-ఇష్టాలాపములను; వదతి-చెప్పుచుండగా; సర్వాణి-అన్ని; అంగాని- అవయవములు; నేత్రతామ్-నేత్రభావమునో; కర్ణతామ్-కర్ణభావమునో; కిముయాంతి-పొందు చున్నవేమో; నజానే-ఎఱుగను.

తా॥ ప్రియుడెదుటకు వచ్చినప్పుడు అన్ని అవయములు కన్నులగు చున్నవో, ఆతడు ప్రియవచనములను చెప్పుచుండగా అవి చెవులగు చున్నవోనాకు తెలియుట లేదు.

వి॥ 1. అన్ని అవయవములు కన్నులగుట అతని సుందరత చూచుటకు రెండుకన్నులు చాలకపోవుట చేత. అన్ని అవయవములు చెవులగుట అతని మాటల మాధుర్యము నాస్వాదించుటకు రెండు చెవులు చాలక పోవుట చేత అను నర్థమును వ్యంగ్యమొనర్చు వాక్యమీ శ్లోకమున నున్నవి. 2. ఒక నాయిక నాయకుడింట లేనప్పుడు నాయకుని యందు లేని పోని కోపమును చెలికత్తెలముందు వెళ్ళగక్కు చుండెడిది. ఆతడింటికి వచ్చినప్పుడు చెలికత్తెలకు చెప్పినవన్ని మరచి పోయి ఆతనినే చూచుచు ఆతని మాటలనే వినుచు చెలికత్తెలను పూర్తిగా మఱచిపోవు చుండెడిది. ఒక నాడు వారు నాయకుడింట లేనప్పుడు నాయికతో నీవిదివఱకు చెప్పుచున్నదంతయు అసత్యమే. అతడు(నాయకుడు) వచ్చినప్పుడు నీవు బయటకే రావు. ఆతని పట్ల నీవు చూపు అనురాగము, ఆతడు నీపై చూపు అనురాగము అనితర సాధారణములుగా నున్నవి. నీవు చెప్పిన దొకటి చేయు చున్నదొకటి అని ఆక్షేపింపగా నాయిక ఓ చెలులారా! మీరన్నది నిజమే. ఆతని సౌందర్యము చూచుటకు నాకు రెండుకన్నులు, ఆతని మాటలు మాధుర్యము వినుటకు రెండు చెవులు చాలక పోవుటచే ఒడలంతయు కన్నులు చెవులునయి చూచుట చేత వినుట చేత నామనసు కూడ వినుట చూచుట తప్ప యింకేమియు చేయలేని స్థితిలో నుండుటచే అంతకు ముందాతను చేసిన అపరాధములు జ్ఞప్తికే యుండవు అను నర్థము 'సర్వాణి అంగాని' అను పదములు వ్యంజింపచేయుచున్నవి. 3. చెలికత్తెల ప్రశ్నకు ఉత్తరమీశ్లోకమున నుండుటచే ఉత్తరాలంకారము. అవయములు నేత్రములైనవా

చెవులైనవా ఎఱుఁగను అనుటచే సందేహాలంకారము. 'సమ్ముఖాయాతే' 'ప్రియాణి వదతె' అను రెండింటికి క్రమముగా కన్నులు చెవులు అను క్రమమును పాటించుటచే యథాసంఖ్యాలంకారము నున్నది. ఇచట నాయకుని యందు లలితమ్ అను గుణ మున్నదని వ్యాఖ్యాత అర్జునవర్మ దేవుడు చెప్పినాడు. ఛందస్సు అనుష్టుప్పు.

అవ॥ పై శ్లోకమున నాయికానాయకుల అనురాగ సాఫల్యము చెప్పబడినది. ఈ శ్లోకయుగ్మమున నాయిక యొక్క మానవిహ్వాలత చెప్పబడుచున్నది.

శ్లో॥ అనల్పచింతాభర మోహనిశ్చలా విలోక్యమానైవ కరోతి సాధ్వసమ్।
స్వభావశోభానతిమాత్రభూషణాతనుస్తవేయ మ్బత కిం ను సున్దరి!॥

శ్లో॥ ఇతి ప్రియే పృచ్ఛతి మాన విహ్వాలా కథం చిదన్తర్ధృత బాష్ప గద్గదమ్।
న కిం చిదిత్యేవ జగాద యద్వధూ కియన్న తేనైవ తయాస్య వర్ణితమ్॥

ప్ర॥ సున్దరి! - ఓ అందమైన దానా!; తవ-నీయొక్క; ఇయమ్-ఈ; తనుః-శరీరము; అనల్పచింతాభరమోహనిశ్చలా-గొప్పచింత యొక్క భారముచే, మోహము చేత కదలనిదై; స్వభావశోభా-సహజకాంతిగలదై; అనతిమాత్రభూషణా- ఎక్కువ సొమ్ములు లేనిదై; విలోక్యమానా-చూడబడుచున్నదై; సాధ్వసమ్- భయమును; కింను-ఎందుకు; కరోతి-చేయుచున్నది; బత-అయ్యో; ఇతి-అని; ప్రియే- ప్రియుడు; స్వచ్ఛతి-అడుగుచుండగా; మానవిహ్వాలా-మానముతో పరవశమైన; వధూః-కోడలు; కథంచిత్-ఎట్లో; ధృతబాష్పగాద్గదమ్-కన్నీరు ధరించుటచే డగ్గుత్తిక వడునట్లు; నకించిత్-ఏమిలేదు; ఇతి-అని; ఏవ-యే; యత్-ఏది; జగాద-పలికెనో; తేనైవ-దానిచేతనే; తయా-ఆమెచేత; అస్య-ఈతనికి; కియత్- ఎంత; నవర్ణితమ్-వర్ణింపబడలేదు.

తా॥ ఓ సున్దరీ! ఈ నీ బక్కచిక్కిన శరీరమున సొమ్ములేమియు లేక పోయినను సహజమైన కాంతి యున్నది. అది అధికములైన చింతామోహములచే కదలకయున్నది. నాచేత చూడబడగనే అది భయముతో వణకు చున్నదేమి అని ప్రియుడడుగుచుండగా మానవిహ్వాలయైన వధువు కన్నీటితోడగ్గుత్తిక వడినదై ఏమియు లేదనియే చెప్పినది. దాని చేతనే నాయకున కామె యెంతయో చెప్పినది. చెప్పక మిగిల్చిన దేమియు లేదు.

వి॥ 'విలోక్యమానా ఏవ' (విశేషముగా చూడబడినదై) అనుటచేత నాయిక మూరముగానున్నప్పుడు నాయకుడు తనను చూచుచున్న విషయమును గమనింప నప్పుడు గాని చూడనప్పుడుగాని మామూలుగనే యున్నదని చూచినప్పుడే అనగా

నాయకుడు తనను చూచి అనుచున్నావని గమనించినప్పుడే ఈ అపరాధిపై కోపాధిక్యము వలన వణకి పోవుచున్నదను నర్థము వ్యంగ్యమగుచున్నది. 'నకించిత్' (అదేమియులేదు) అని క్లుప్తముగా చెప్పుట చేత నాకార్శ్యమునకు సొమ్ములు ధరింపక పోవుటకు నన్ను కారణమడుగాచున్నావేమి. తప్పంతయు నీదికాదా అను కోపము యొక్క తీవ్రత విస్తారముగా నాయకునికి వర్ణించి చెప్పినట్లైనది అను నర్థము వ్యంగ్యమగాచున్నది. నీతో మాట్లాడుటకు నీవడిగిన దానికి బదులు చెప్పుటకు నా మనసొప్పుట లేదు. నన్నిట్లు విరహవ్యధకు కోపమునకు గురిచేసిన నిన్నుయేమియు అనుటగాని, నీతో మాటాడుటగాని అనుచితమే అనియు వ్యంగ్యమగుచున్నది. నాయకుడు మాత్రము నాయిక కోపముతో వణకుటను భయముతో వణకుటగా భావించి ప్రశ్నించినాడు. దానికేమియు లేదనియే నాయిక సమాధానము 3. ఈ శ్లోకమున ప్రశ్నోత్తరాలంకారమున్నది. ఉత్తమ వంశీయ నాయికానాయకుల వృత్తాంతమును వంశస్థవృత్తమున వర్ణించుట యుచితముగనే యున్నది.

అవ॥ పూర్వశ్లోకమున మానమును (కోపమును) విడచివచ్చిన నాయకుడు మానినియైన నాయికనూరడించుట చెప్పబడినది. ఈ శ్లోకమున నాయికానాయకుల విరహ విషమస్థితి చూడలేని దూతి నాయకుని మానము విడచి నాయిక కడకు రమ్మని కోరుచున్నది.

శ్లో॥ విరహవిషమః కామో వామస్తనూ కురుతే తనుం
దివసగణ నాదక శ్చాయం వ్యపేత ఘృణోయమః।
త్వమపి వశగో మానవ్యాధే ర్విచింతయ నాథ హే
కిసలయమృదు ర్జీవేదేవం కథ ప్రమదాజనః॥ 67

ప్ర॥ విరహవిషమః- విరహమున సహించరాని; వామః- విచిత్రప్రవర్తనగల; కామః- మదనుడు; తనుమ్- శరీరమును; తనూకురుతే- కృశింపజేయును; దివసగణ నాదకః- దినములెక్కపెట్టుటలో నేర్పరియగు; యమఃచ- యముడును; వ్యపేత ఘృణఃచ- దయలేనివాడు; త్వమ్ అపి- నీవుకూడ; మానవ్యాధేః- కోపవ్యాధికి; వశగః- లోబడినవాడవు; హేనాథ- ఓ ప్రభూ; ఏవమ్- ఇట్లు; కిసలయమృదుః- చిగురుటాకు వలె మృదువైన; ప్రమదాజనః- స్త్రీ జనము; కథమ్- ఎట్లు; జీవేత్- జీవించును?; విచింతయ- బాగుగా ఆలోచింపుము;

తా॥ విరహమున విషముడైన కాముడేమో వాముడు. దివసముల లెక్కపెట్టుట నేర్పరి యైన యముడేమో దయలేని వాడు. ఓ ప్రభూ! నీవుకూడా కోపవ్యాధికి

లోబడితివి. ఇట్లైనచో చిగురుటాకువలె మృదువైన కాంతా జనమెట్లు జీవించునో విచారించుము (ఆలోచించుము).

వి॥ 1. కాముడు విరహ విషముడనుటచే నాయికా నాయకుల కిరువురకు సంయోగమున్నప్పుడు సముడేయని వ్యంగ్యమగును. 2. స్త్రీలింగ తను వను శబ్దమే కృశించిన స్త్రీ శరీరమును వ్యంజింపజేయును. దానిని విరహకాలమున మరింత క్షీణింప జేయుటయే మదనుని వైషమ్యము. పురుషుల శరీరము సహజముగా తనువు (కృశించినది) కాదు. కాని మదనునిచే కొంచెము క్షీణింపజేసిన సహింప గలిగెదరు పురుషులు. కాని స్త్రీలట్లు సహింపలేరు. అను నర్థమును 'తనూకురుతే' అను క్రియ వ్యంజింపజేయును. 3. దివసగణ నాదక్షః (దినముల లెక్కించుటలో నేర్పరి) అనుటచే ఎప్పుడు ప్రాణుల ఆయువునపహరింపవలెనా యని చింతించుట తప్ప మరొక పని లేదని వ్యంగ్యమగును. 4. వ్యపేతఘృణః (దయలేనివాడు) అనుటచే యమునకు స్త్రీ పురుషభేదము లేదని ఎవరి ఆయువు పూర్తియైన వారిని తనలోకమునకు తీసుక పోవును. కావున స్త్రీ యనియు నీ ప్రియురాలిపై దయ జూపడనియు వ్యంగ్యమగును. 5. 'యమ' అనుశబ్దమునకు రెండు అను అర్థము కూడ నుండుటచే ఇప్పుడు మృత్యువు సంభోగము. ఈ రెంటిలో నేదో యొకటి నిశ్చయించు కొనవలసినదను అర్థము వ్యంగ్యమగును. 6. 'త్వమ్ అపి' అను చోట అపి శబ్దము ఇప్పటి వఱకు నాయికలకు మాన వ్యాధి యుండునని దానిని నాయకులు వచ్చి చికిత్స చేసి తొలగించెదరను కొనుచుంటిని. ఇప్పుడు పురుషుడవైన నీకే ఆ వ్యాధి సోకినచో నిక చికిత్స ఎవరు చేయుదురు. ఈ విషయమాలోచించి నీ వ్యాధికి ముందుగా చికిత్స నీవే చేసికొని అనగా కోపమును మానుకొని మానవ్యాధికే గురియైన ప్రియురాలికి చికిత్స చేయవలయును అని వ్యంగ్యముగును. ఆమె అదుది తెలిసియో తెలియకయో మానవ్యాధికి గురియైనది. నీవు నాథుడవు. నీకన్న ఆమెకు మరొక దిక్కేమున్నది. అను అర్థమును నాథ శబ్దముచే వ్యంజింప జేయబడును. 'ఏవమ్' అను పదముచే పురుషుడవైనను నీకు ఈ పాటికి మానవ్యాధిచే ఎంత విలువైన స్త్రీ పురుష సంయోగ కాలము కోలుపోవునట్లు చేయు మానవ్యాధికి గురివైతి వనగా చిగురుటాకు వంటి నీప్రియురాలెట్లు మానవ్యాధికి చికిత్స చేయకపోయిన మదనబాధకు తాళగలదు. అను అర్థము వ్యంగ్యమగును. 6. 'ప్రమదాజనః' అను శబ్దము జనులకు అనగా స్త్రీపురుషుల కిరువురకు విరహము భరింపరానిదే కాని పురుషులు కార్యవ్యగ్రులుగా బాహ్య సంచారము నలవాటుగా నుండుటచే వారేదో విధముగా పగలు విరహబాధను మాన్పుకొనగలరు. రాత్రి మాత్రమే వారు విరహ వ్యథకు గురియగుదురు. స్త్రీలకట్లు

పగలు కూడ విరహవ్యధను తట్టుకొను నవకాశము లేదు. ఇక రాత్రి మాట చెప్పపని లేదు. రాత్రింబవళ్ళును ప్రమదలై అనగా 'మదనాధిక్యము కలవారై' బాధపడెదరు అను అర్థము వ్యంగ్యమగును. మొత్తము శ్లోకము సంభోగముచే నైనను విరహముచే నైనను కాలము గడచును. కాని సంభోగోచితమైన యౌవనకాలము విరహముచే వ్యర్థమొనరించుకొని నాడనిన యముడు దయతలచి యౌవనకాలమును పెంచబోడు. ఇట్లే మరికొంతకాలము గడిచెనేని వీరిరువురు ముసలి వారైన పిదప ఒక చోటికి చేరినను ప్రయోజనముండదు. ప్రియుడవైన నీవు ముందుగా వివేకము తెచ్చుకొని మానమును మానుకొని ప్రియురాలి మానమును తొలగించుట ధర్మము. అది నీకు ఆవశ్యకము సాధ్యము కూడా. కిసలయ మృదువైన నీ ప్రియురాలి యాలింగనముచే కృతార్థుడవు కమ్ము అను అర్థము వ్యంగ్యమగును. ఈ శ్లోకమున అసత్యముచ్చయాలంకార మున్నదని అర్జునవర్మదేవుడు చెప్పినాడు. వృత్తము హరిణి.

అవ॥ పై శ్లోకమున కాముని వామత్వము వాచ్యమైనది. నాయిక యొక్క వామత వ్యంగ్యమైనది. ఈ శ్లోకమున నాయిక యందలి వామతను వాచ్యము చేయుచు నాయకుడు చెప్పిన మాటల వలన నాయిక యొక్క మానశాంతి వర్ణింపబడుచున్నది.

శ్లో॥ పాదాసక్తే సుచిరమిహ తే వామతాకైవ ముగ్ధే
మన్దారమ్భే ప్రణయిని జనే కోఽపరాధోపరోధః।
ఇత్థం తస్యాః పరిజనకథా కోమలే కోపవేగే
బాష్పోద్భేదైస్తదను సహసా న స్థితం న ప్రవృత్తమ్॥ 68

ప్ర॥ముగ్ధే - ఓ అమాయకురాలా!; ఇహ- ఇచట; సుచిరమ్- చాలసేపు; పాదాసక్తే - పాదములయందాసక్తుడైయున్న; మన్దారమ్భే- మన్దప్రయత్నుడైయున్న; ప్రణయిని- ప్రేమగల; జనేఏవ- జనునియందే; తే- నీయొక్క; వామతా- ప్రతికూలత; కా- ఏమి; అపరాధోపరోధః- అపరాధము యొక్క అడ్డు; కః- ఏమి; ఇత్థమ్- ఇట్లు; కోపవేగే- కోపతీవ్రత; పరిజనకథాకోమలే - పరిజనుల ప్రసంగముచే మెత్తబడగా; నస్థితిమ్- ఆగబడలేదు; నప్రవృత్తమ్- ప్రవర్తింపబడలేదు.

తా॥ చాలాసేపటి నుండి నీ పాదములపై బడి ఎట్టిప్రయత్నము చేయని ప్రేమగల వాని యందు నీయీ ప్రతికూలత యేమి? అపరాధము యొక్క అడ్డేమి? ఇట్లు పరిజన ప్రసంగములచేత ఆమె కోపవేగము మెత్తబడగా కన్నీరు ఆగను లేదు జారనులేదు.

వి॥ 1. పాదములపై బడిన వానియందు ప్రతికూలత ఉచితముకాదు. అప రాధము చేసినను నీవెత్తి పొడవగా దానిని విని తలవంచుకున్నాడే తప్ప కోపము

తెచ్చుకొని వెడలిపోలేదు. పాదములందట్లే పడియున్నాడు. ఇక కోపమును చాలింపుమని చెలికత్తెల మాటలచే కోపవేగము తగ్గగా ఆమె కన్నీళ్ళు కన్నులలోనే స్తమ్భించిపడినవి అను నర్థము నొసగు వాక్యములీ శ్లోకమున నున్నవి. 2. ఇందు విరోధాలంకారమున్నదని అర్జున వర్మదేవుడు చెప్పినాడు. మందముగా ఆమె కోపశాంతి నాయికను ఆక్రమించుటను మన్దాక్రాంతావృత్తమున వర్ణించుట యుచితముగా నున్నది.

అవ॥ పై శ్లోకమున నాయిక యొక్క మాన శాంతి చెప్పబడినది. ఈ శ్లోకమున మానము శాంతించనప్పుడు నాయిక చేయు నాయకోపాలమ్భనము వర్ణింపబడుచున్నది.

శ్లో॥ తథాభూదస్మాకం ప్రథమ మవిభక్తా తనురియం
తతో న త్వం ప్రేయా నహమపి హతాశా ప్రియతమా।
ఇదానీం నాథ స్త్వం వయమపి కలత్రం కిమపరమ్
మయాప్తం ప్రాణానాం కులిశకఠినానాం ఫలమిదమ్॥ 69

ప్ర॥ ప్రథమమ్-మొదట; అస్మాకమ్-మాయొక్క; ఇయమ్-ఈ; తనుః-శరీరము; తథా-ఆ విధముగా; అవిభక్తా-విడదీయబడనిదై; అభూత్-ఉండెను; తతః-ఆ తరువాత; త్వమ్-నీవు; ప్రేయాన్-ప్రియుడువు; హతాశా-కొట్టుబడిన ఆశగల; అహమ్అపి-నేనుకూడ; ప్రియతమా-ప్రియురాలను; న-కాను; ఇదానీమ్-ఇప్పుడు; త్వమ్-నీవు; నాథః-భర్తవు; వయమపి-మేమును; కళత్రమ్-పోష్య వర్గములోని వారము; అపరమ్-మరొకటి; కిమ్-ఏమి; మయా-నాచేత; కులిశకఠినానామ్-వజ్రమువలె కఠోరములైన; ప్రాణానామ్-ప్రాణముల యొక్క; ఇదమ్-ఈ; ఫలమ్-ఫలము; ఆప్తమ్-పొందబడినది.

తా॥ మొదట మనశరీరములకు భేదమే లేనంతగా కలిసి యుంటిమి. ఆ తరువాత నీవు ప్రియుడవు కావు. నేను ప్రియురాలను కాను. నేను హతాశను. ఇప్పుడు నీవు భర్తవు నేను భార్యను. వజ్రకఠినులైన ప్రాణములకు తగిన ఫలమీనాడు నాకు లభించినది.

వి॥ 1. ఒకప్పుడు నాయిక శరీరము నీ శరీరముతో మొదట కలిసియే యుండెను. ఎన్నడు విడిగా నుండలేదు. నా తనువు అనగా సన్నని శరీరము ఆనాడు నీశరీరమున కంటుకొని యుండుటచే నాకృశత తెలియబడలేదు. ఈనాడు విరహముచే శరీరమెంత కృశించి యున్నదో చూచుచున్నావు గదా అని తను శబ్దముచే వ్యంగ్యమగుచున్నది. 2. ఆ మధురక్షణములు గడచి పోయినప్పటినుండి మన యిరువురి మధ్య ప్రేమ

సంబంధము తగ్గి భార్య భర్తృ సమ్బన్ధమే పోయినది. అట్టి ఉత్కృష్టప్రేమబన్ధము పోయినను నాప్రాణములింకను నిలచియున్నవి. అవి వజ్రకఠినములు కాకున్న అవి నిలచియుండును. నేను బ్రతికి యున్నందుకు ఇంత తిండి పెట్టుచు తగిన ఫలమును ప్రసాదించుచున్నావు అను అర్థమొసగువాక్యములీ శ్లోకమున నున్నవి. 3. కొండంత ప్రేమ కొండంత దుఃఖముగా పరిణమించుటను శిఖరిణీ వృత్తమున వర్ణించుట యుచితముగ నున్నది.

అవ॥ పూర్వశ్లోకమున మానాధిక్యము చేత నాయిక చేత చేయబడిన నాయకోపాలమ్భనము చెప్పబడినది. ఈ శ్లోకమున మానమనగా నెఱుగని నాయికకు మానము పూనవలెనని చెలికత్తె యుపదేశించుట చెప్పబడినది.

శ్లో॥ ముగ్ధే ముగ్ధతయైవ నేతుమఖిలం కాలం కిమారభ్యతే
మానం ధత్స్వ ధృతి మ్బధాన ఋజుతాం దూరే కురుప్రేయసి।
సఖ్యైవం ప్రతిబోధితా ప్రతివచస్తామాహ భీతాననా
నీచైః శంస హృది స్థితో హి నను మే ప్రాణేశ్వరః శ్రోష్యతి॥ 70

ప్ర॥ ముగ్ధే- ఓ అమాయకురాలా!; ముగ్ధతయా ఏవ- అమాయకముగనే; అఖిలమ్- మొత్తము; కాలమ్- కాలమును; నేతుమ్- గడుపుటకు; కిమ్- ఏల; ఆరభ్యతే- ఆరమ్భింపబడుచున్నది; మానమ్- కోపమును; ధత్స్వ- ధరింపుము; ధృతిమ్- ధైర్యమును; బధాన- కట్టుకొనుము; ప్రేయసి- ప్రియునియందు; ఋజుతామ్- నిష్కపటముగా నుండుట; దూరే- దూరమునందు; కురు- చేయుము; సఖ్యా- సఖిచేత; ఏవమ్- ఈవిధముగా; ప్రతిబోధితా- బోధింపబడినదై; భీతాననా- భయముతో కూడిన ముఖము గలదై; తామ్- ఆచెలికత్తెతో; ఆహ- పలికినది; నీచైః- మెల్లగా; శంస- చెప్పుము; మే- నాయొక్క; ప్రాణేశ్వరః- ప్రాణనాయకుడు; హృది- ఎదయందు; స్థితఃనను- ఉన్నాడుగదా

తా॥ ఓ అమాయకురాలా, జీవితమంతయు ఇట్లు అమాయకత్వముతోనే వెళ్ళబుచ్చుతావా యేమి? మానము ధరింపుము. ధైర్యమును కూడ పట్టుకొమ్ము. భర్త విషయమున ఋజుతను దూరము చేసికొనుము. ఇట్లు చెలికత్తె చెప్పుచుండగా నాయిక మెల్లగా చెప్పుము, నాహృదయమున నున్న ప్రాణేశ్వరుడు వినగలడు అని సమాధానము చెప్పినది.

వి॥ 1. ఒక నాయిక యౌవనారమ్భము విడచి మధ్య యౌవనమున ప్రవేశించినను ముగ్ధతను వీడలేదు. కొత్తగా కాపురమునకు వచ్చినప్పుడు ఏస్త్రీయైనను ఎక్కువసిగ్గు

కలిగి ముగ్ధగానే ఉండును. క్రమక్రమముగా భర్త చేయుతప్పులను దెప్పిపొడుచుట కెట్టి సిగ్గును కాని సంకోచమును గాని చూపదు. ఈ నాయిక భర్త అపరాధముచేయు చున్నను అతని నేమియు అనలేక ముగ్ధవలెనే ప్రవర్తించుచున్నది. ఇట్లైనచో నాయకుడు చేయు అపరాధముల కడ్డుండదు. భర్త అపరాధముల చేయు ఈ తొలిస్థితి యుందే ఆయన అపరాధముల నడ్డుకొనలేక పోయినచో జీవితాంతము దుఃఖించవలసిన పరిస్థితి నీకు దాపురించవచ్చును. ఇప్పుడు నీవు కొంచెము పెట్టు చూపుము. కోపమును ధరించుము. ధైర్యము లేనిచో ధైర్యము కూడ గట్టుకొనుము. ఋజువుగా ముక్కుకు సూటిగాగాక కొంచెము డొంక తిరుగుడుగా మాట్లాడుట నేర్చుకొనుము. అన్యాపదేశముగా నాయకునితో ఎత్తి పొడచి మాట్లాడుము. అని చెలికత్తె చేసిన ఉపదేశము, దానికి నాయిక తన అశక్తతను నాఎదలోని నాయకుడు వినగలడుసుమా కొంచెముగా మెల్లగా మాటాడుము అను సమాధానముతో వ్యక్తము చేయుట ఈ శ్లోకమున చెప్పబడినది. మోట్టాయితమను నాట్యాలంకారమీ శ్లోకమున ఉన్నదని అర్జునవర్మదేవుడు చెప్పినాడు. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పై శ్లోకమున చెలికత్తె మానము వహించమని యుపదేశించుట చెప్పబడినది. ఈ శ్లోకమున నాయికకు ఆమె చెలికత్తెకు జరిగిన సంభాషణము చెప్పబడుచున్నది.

శ్లో॥ క్వ ప్రస్థితాసి కరభోరు! ఘనే నిశీథే
ప్రాణాధికో వసతి యత్ర జనః ప్రియో మే।
ఏకాకినీ బత కథం న బిభేషి బాలే
నన్వస్తి పుఙ్ఖితశరో మదనః సహాయః॥ 71

ప్ర॥ ఘనే- దట్టమైన; నిశీథే- చీకటిగల అర్ధరాత్రమున; కరభోరు- కరభమువంటి ఊరువులు కలదానా; క్వ- ఎక్కడకు; ప్రస్థితా- బయలుదేరినదానవై; అసి- ఉన్నావు; ప్రాణాధికః- ప్రాణములకన్నఎక్కువైన; మే- నాయొక్క; ప్రియః జనః- ప్రియుడు; యత్ర- ఎక్కడ; వసతి- నివసించునో (తత్ర- అక్కడకు); బత- అయ్యో; బాలే - ఓ చిన్నదానా!; ఏకాకినీ- ఒంటరిదానవు; కథమ్- ఎట్లు; నబిభేషి- భయపడకుందువు; పుఙ్ఖితశరః- పుంఖములుగా చేయబడిన బాణములు గల; మదనః- మన్మథుడు; సహాయః- సహాయకుడుగా; అస్తినను- ఉన్నాడు గదా!

తా॥ ప్రశ్న:- దట్టమైన జీకటిగల అర్థరాత్రమున ఎక్కడకు బయలుదేరినావు సమాధానము:- ప్రాణాధిక ప్రియుడున్న చోటికి. ప్రశ్న:- చిన్నదానవు, ఒంటరిదానవు ఎందుకు భయపడవు? సమా:- బాణముల ధరించిన మన్మథుడు సహాయకుడుగా నున్నాడుగదా.

వి॥ 1. ఒకనాయిక అర్ధరాత్రమున దట్టమైన చీకటిలో బయలుదేరుట చూచి ఆమె చెలికత్తె ఈ అర్ధరాత్రమున ఎక్కడకు బయలు దేరినావు భయములేదా. అని అడిగినది. నాప్రాణాధికుడైన ప్రియుడున్నచోటికి పోవుచున్న నాకు బాణములు ధరించిన మన్మథుడు సహాయముగా నున్నాడు అను నర్థమొసగు ప్రశ్నోత్తరము లీశ్లోకమున నున్నవి. 2. కరభమనగా మణి బన్ధము నుండి చిటికెను వేలిచివఱ వఱ కున్న ప్రదేశము అట్టి కరభమంత కొలతగలిగిన తొడలు గలస్త్రీ 'కరభోరు' అనబడును. మొదలే అర్ధరాత్రి చిమ్మచీకటి త్వరగా నడుచుటకు అనుకూలములు కలవి కావు నీ తొడలు అని కరభోరు పదము వ్యంజింపజేయును. 3. ప్రాణాధికః అనుటచే నా ప్రాణములొక వేళ ఈ రాత్రి పోయిన పోవుగాక. నా ప్రియతముని విడచి ఈ రాత్రి విరహమును భరింపలేను అని వ్యంగ్యమగును. 4. నాయకునికడకు అని చెప్పక ప్రియజనమున్నచోటికి చెప్పుట నాయిక యొక్క శాలీనతను సూచించును. 5. స్త్రీలు రాత్రి బయటకు పోవలసి వచ్చినప్పుడు తమ్ముడో అన్ననో పరిచితునో సేవకునో సాయముగా తీసికొని పోవుట సాధారణము. ఈ నాయిక నాయకు నభిసరింపబోవు చున్నది కావున ఎవరును వెంత ఉండరాదు. ఎవరికి నితని ప్రణయవృత్తాంతము బయట పడకూడదు. అందుచే ఒంటరి గానే పోవుచు నాకు బాణములు చేతబట్టుకొనిన మన్మథుడు సాయముగా నున్నాడు అని చెప్పుట నాయిక యొక్క గొప్ప గడసరి తనమును సూచించును. మదనుడు చెప్పినట్లు చేయవలెను. కామతీవ్రత వలన పోకుండ ఎట్లుండగలను. పోకపోయిన కాముడు ప్రాణములు తీయడా అను నర్థము వ్యంగ్యమగును. వృత్తము వసంత తిలక. 5. ఈ శ్లోకమున ప్రశ్నోత్తరాలంకార మున్నదని అర్జునవర్మదేవుడు చెప్పినాడు. ఈ శ్లోకము ప్రక్షిప్తమని అయినను అర్జున దేవుడు శ్లోకము సుందరముగానే ఉన్నది కావున వ్యాఖ్యానించినాను అని చెప్పినాడు. ఈ శ్లోకమున నాయిక తమోభిసారిక.

అవ॥ పైశ్లోకమున తమోఽభిసారిక నాయకునను సరింపబోవుట చెప్పబడినది. ఈ శ్లోకమున అపరాధి నాయకుని ధూర్తత్వము వర్ణింపబడుచున్నది.

శ్లో॥ లీలాతామరసాహతోఽన్యవనితా నిఃశఙ్కదష్టాధరః
కశ్చిత్కేసర దూషితేక్షణ ఇవ వ్యామీల్య నేత్రే స్థితః।
ముగ్ధా కుట్మలితాననేన్దు దదతీ వాయుం స్థితా తత్ర సా
భ్రాన్త్యా ధూర్తతయాథవా నతిమృతే తేనానిశం చుమ్బితా॥ 72

ప్ర॥ అన్యవనితానిఃశఙ్కదష్టాధరః- మరొక స్త్రీచేత నిర్భయముగా కొఱుకబడిన క్రింది పెదవిగల; కశ్చిత్- ఒకడు; లీలాతామరసాహితఃఅపి- విలాసకమలముచే కొట్టబడినవాడైనను; కేసరదూషితేక్షణ ఇవ- కింజల్కము చే మలినము చేయబడిన కన్నులు కలవాని వలె; నేత్రే- కన్నులను; వ్యామీల్య- బాగుగామూసి; స్థితః- నిలచి యున్నాడు; ముగ్ధా- అమాయిక; కుట్మలితాననేన్దు- ముడుచుకొనిపోయిన ముఖ చంద్రుడుగల; వాయుమ్- గాలిని; దదతీ- ఇచ్చుచున్నదై; సా- ఆమె; తత్రస్థితా- నిలచినది; భ్రాన్త్యా- భ్రాన్తిచేత; అథవా- లేక; ధూర్తతయా- ధూర్తతచేత; ఆనతిమ్ ఋతే- పాదములపై పడకుండగనే; తేన- వానిచేత; అనిశమ్- చిరకాలము; చుమ్బితా- చుమ్బింపబడినది.

తా॥ పరస్త్రీ చేత నిశ్శఙ్కముగా కొఱుకబడిన పెదవికల నాయకుడొకడు నాయిక కడకు వచ్చినాడు. ఆ నాయిక కోపముతో విలాసకమలముతో కొట్టినది. కమలమందలి కేసరముల రేణువులు కన్నులలో బడినవను మిషతో నాయకుడు కన్నులు మూసికొని నిలబడి యున్నాడు. నాయిక ఆ కన్నులలోనికి గాలి నూదుచు అక్కడ నిలబడినది. భ్రాన్తిచేతనో ధూర్తత చేతనో పాదములపై బడ నవసరము లేకుండనే నాయకుడు చిరకాల మామెను చుంబించినాడు.

వి॥ 1. పరస్త్రీచేత కొఱుకబడిన పెదవి నాయకున కున్నది. బహుశః నిశ్శంక ముగా ఈ నాయకుడేక పత్నీవ్రతుడు కాదులే అని కొఱకినది. నాయకుడు కొంత కాలము వఱకు గుర్తుంచుకొనునట్లు ఆమె ప్రవర్తించినది. ఆ పెదవితో అట్లే నాయకుడు నాయిక కడకు వచ్చినప్పుడు అనగా నాయకుడు గూడ తనకామినీ ప్రియత్వమును రాసిక్యము ను నిశ్శంకముగా చూపించుకొను నిమిత్తం నాయిక కడకు వచ్చినాడు. ఆమెకు తన పెదవి కనబడనే కనబడినది. కోపమురానే వచ్చినది. రాత్రినుండి బాధపెట్టుచున్న విరహతాపము యొక్క శాంతికై ఆమె చేత కమలమును విలాసముగా పట్టుకొని యున్నది. దానితోడనే నాయకుని ముఖముపై కొట్టినది. కేసరముల రేణువులు నాయకుని కన్నులలో పడవలసినవే కాని ఇటువంటివాని కలవాటు పడిన వాడే కనుక అవి పడకుండ జాగ్రత్తపడినాడు. కాని అవి పడినట్లే నటించుచు కన్నులు మూసికొని యట్లే నిలబడినాడు. నాయిక నిజముగానే అవి కన్నులలో బడినవేమో ఊదుదమను కొని ప్రియుని ముఖమునకు దగ్గఱగా నిలబడినది. ఆమె ముఖము నుండి వచ్చిన గాలి సోకగానే ఆమె ముఖమును గట్టిగా పట్టుకొని చాలసేపు నాయకుడు చుంబించినాడు. అను నర్థమొసగు వాక్యములీ శ్లోకమున నున్నవి. 2. ఆమె గాలి నూదునప్పుడు మూతి ముడుచుచు కన్నులు

మూసికొన్నది. ఆ కన్నులు తామరల వంటివి. చంద్రుని కాంతి సోకిననే తామరలు ముకులించును. నాయిక ముఖ చంద్ర బింబముతోనే ఉన్న కన్నులు ముకుళించుట సహజము. గాలి నూదుట కామె కన్నులు కొంచెము మూసికొని యున్నవన్నమాట. అట్లూదుచున్న గాలిని అంతకువుందు నిశ్శంకవుుగా పెదవి కొఱికిన స్త్రీ నిశ్వాసముగా భ్రమించి ఈ నాయిక ముఖమును చాల సేపు చుంబించ లేదు. ఇచట భ్రాన్తినొందినది నాయకుడు గాడు. అపరాధము చేసినందుకు నాయకుని శిక్షింపవలెనని నాయిక నాయకుని లీలా కమలముతో కొట్టినది. నాయకుడు కనులు మూసికొని కేసర రేణువులు కన్నులో బడినందుకు కలిగిన బాధ నభినయించినాడు. నాయిక నాయకుడు నిజముగా బాధపడుచున్నాడని భ్రాంతినొంది ఊదుట నారంభించినది. నాయకుడు చుంబించ నారభించినాడు. అని భ్రాంతి పదముచే పై వస్తువంతయు వ్యంగ్యమగు చున్నది. 3. పరస్త్రీ కడకు పోయి అచట పని ముగించుకొని వెంటనే నాయిక కడకు నిశ్శంకముగావచ్చుటచే నాయకుడు ధూర్తుడనుట నిశ్చితమే. బాధ నభినయించి తన ధూర్తతను మరింత చూపుచు నాయికను చాలాసేపు చుంబించినాడు. అను వస్తువు ధూర్తతయా అనుశబ్దముచే నుక్షిప్తమగుచున్నది. 4. నాయికుడు చాలసేపు చుంబించి నప్పుడు ఆమె కోపము పోయినది పైగా తాను లీలాకమలముచే కొట్టినందుకు నాయకుడు తనను సముచితముగా శిక్షించుచున్నాడని భావించినది. చుంబనరసముచే పరవశయైన నాయిక తనను తానే మఱచినది. రాత్రిగడచిపోయి ప్రాతఃకాలమువఱకు ఆ చుంబనము సాగినదని ఆ తరువాత ప్రతినిత్యము వీలైనన్నిసార్లు చుంబనము కొనసాగుచునే యున్నది. అని అనిశమ్ పదముచే వ్యంజింపజేయబడుచున్నది. 5. ఈ శ్లోకమున 'వాయుం దదాతి' అనుచోట కావ్యప్రకాశ కారుడు చెప్పినట్లు శ్లీలదోషము లేదని అర్జునవర్మ దేవుడు చెప్పినాడు. కుట్మలితాననేందు అను చోట రూపకాలంకార మున్నది. ముగ్ధాశబ్దము నాయిక యొక్క లజ్జాధిక్యమును సూచింపక కేవలమామె లేత వయసును మాత్రమే సూచించును. కాన ఈ నాయిక ముగ్ధకాదు. ముగ్ధ అయినచో నాయకుని చుంబనము వారించి యుండెడిది. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పై శ్లోకమున నాయకుని ధూర్తత చెప్పబడినది. ఈ శ్లోకమున ధూర్త నాయకుని కోపముతో నిరాకరించి అతడు వెడలిపోయిన పిదప కలిగిన నాయిక పశ్చాత్తాపము చెప్పబడుచున్నది.

శ్లో॥ స్ఫుటతు హృదయం కామః కామం కరోతు తనుం తనుం
న సఖి చపల ప్రేమ్ణా కార్యం పునర్దయితేన మే।

ఇతి సరభస మ్మానావేశాదుదీర్య వచస్తయా
రమణ పదవీ సారంగాక్ష్యా నిరంతరమీక్షితా॥ 73

ప్ర॥ సఖీ- ఓ చెలీ; హృదయమ్-హృదయము; స్ఫుటతు-పగులనిమ్ము; కామః-మన్మథుడు; తనుం-సన్నని శరీరమును; కామమ్-మరింత; తనుం-కృశించిన దానినిగా; కరోతు-చేయనిమ్ము; చపలప్రేమ్ణా-చంచల ప్రేమగల; దయితేన-ప్రియునితో; పునః-మరల; మే-నాకు; కార్యమ్-పని; న-లేదు; ఇతి-అని; సరభసమ్-వేగముగా; వచః-మాటను; మానావేశాత్-కోపతీవ్రతవలన; ఉదీర్య-పలికి; సారంగాక్ష్యా-లేడికన్నులవంటి కన్నులుగల; తయా-ఆమెచేత; రమణపదవీ-భర్తపోయినదారి; నిరంతరమ్-ఎప్పుడు; ఈక్షితా-చూడబడినది.

తా॥ ఓ చెలీ! ఈ హృదయము పగిలిన పగులనీ. ఇది వఱకే కృశించిన నా యీ శరీరమును మదనుడు మరింత కృశింపజేయనీ. చపల ప్రేమగల ఆ నాయకునితో మరల నాకేమియు పనిలేదు అని వేగముగా చెప్పి భర్త పోయిన దారినే ఒక నాయిక చూచుచున్నది.

వి॥ 1. భర్త రాలేదని భర్తవచ్చుదారినే చూచుచున్న నాయిక తనను పలుకరించుటకు వచ్చిన చెలితో ఇక ఈ నాయకునకై ఎదిరిచూడను. నాకాతనితో పనిలేదు. ఏ యువతితో కులుకుచున్నాడో, చపల ప్రేమగల వానిని నమ్ముకొని యెదిరి చూచుట నాదే తప్పు. దుఃఖముతో నా హృదయము పగిలిన పగులనీ. మదన బాధ నన్ను మరింత కృశింపచేయనీ అని వేగముగా చెప్పి భర్తవచ్చు చున్నాడేమో వచ్చి నామాటను వినుచున్నాడేమో అని తల త్రిప్పి మరల భర్త వచ్చు దారిని చూచుటలోనే నిమగ్నయైనది అను అర్థమిచ్చు వాక్యము లీ శ్లోకమున నున్నది. 2. నాయకుడు వచ్చినప్పుడు నాతనినాదరింపక ఉపేక్షించి ఆతడు పోయిన పిదప పశ్చాత్తాపమును వ్యంగ్యముగా ఒక నాయిక ప్రకటించినదని చెలి మరొక చెలితో చెప్పుచున్నట్లు అర్జున వర్మదేవుడవతారిక వ్రాసినాడు. ధృతి ఔత్సుక్యము అను రెండు వ్యభిచారభావము లీశ్లోకమున వ్యంగ్యములగుచున్నవనియు చెప్పినాడు వృత్తము హరిణి.

అవ॥ పూర్వశ్లోకమున నాయిక పశ్చాత్తాపము చెప్పబడినది. ఈశ్లోకమున నాయకునికి గల నాయికా పురుషాయిత రతి కాంక్ష ప్రకటింపబడుచున్నది.

శ్లో॥ గాఢాశ్లేష విశీర్ణ చన్దనరజః పుంజ ప్రకర్షాదియం
శయ్యా సమ్ప్రతి కోమలాఙ్గి! పరుషేత్యారోప్య మాం వక్షసి।

గాఢౌష్ఠ గ్రహపూర్వమాకులతయా పాదాగ్రసందంశకే
నాకృష్యామ్బరమాత్మనో యదుచితం ధూర్తేన తత్ప్రస్తుతమ్॥ 74

ప్ర॥ కోమలాంగి- ఓ కోమలమైన శరీరము కలదానా!; గాఢాశ్లేష విశీర్ణ చందన రజః పుంజప్రకర్షాత్- బిగి కౌగిలింతచే రాలిన గంధపు పొడి అంటుకొనుటచే; ఇయమ్- ఈ; శయ్యా- శయ్య; సమ్ప్రతి- ఇప్పుడు; పరుషా- పరుషమైనది; ఇతి- అని; ఆకుల తయా- ఆకులమగుట చేత; మామ్- నన్ను; వక్షసి- ఎదపైకి; ఆరోప్య- ఎక్కించుకొని; గాఢౌష్ఠగ్రహపూర్వమ్- గట్టిగా మొదలు పెదవిని దంతములతో పట్టుకొని; పాదాగ్ర సందంశకేన- కాలివ్రేళ్ళతో; ఆత్మనః- నా యొక్క; అమ్బరమ్- వస్త్రమును; ఆకృష్య- లాగి; యద్- ఏది; ఉచితమ్- తగినదో; ధూర్తేన- ధూర్తునిచే; తత్- అది; ప్రస్తుతమ్- ఆరంభింపబడినది.

తా॥ బిగి కౌగిలింతచే నీ స్తనములపైని చందనపుపొడి రాలుటచే ఈ శయ్య పరుషమైనది. అని నన్ను తన ఎదపైకి లాగుకొని నాపెదవిని ముని పంట నొక్కుచు కాలివ్రేళ్ళతో నా వస్త్రమును లాగి ఆ తరువాత ఏమి చేయదగినదో అది చేయుట కారంభించినాడు.

వి॥ ఇంతకు పూర్వమే శయ్యపై నున్న నాయికను గట్టిగా కౌగిలించుకొనుటచే ఆమె స్తనములపై నున్న చందన రజమంతయు శయ్యపై రాలిపడినది. అందుచే అది నాయికకు గుచ్చుకొనుచున్నది. అని కోమలాంగి అనుటచే స్ఫురించుచున్నది. ఇప్పుడా శయ్య కన్న నాఎదయే బాగుండును అని నాయకుడెదపైకి నాయికను లాగుకొన్నాడు ఆమె పెదవిని మునిపంట గట్టిగా నొక్కి తనకాలివ్రేళ్ళతో వస్త్రమును లాగి ఆ తరువాత పురుషాయితరతికి నన్ను వివశను చేసినాడు అని 'అరోప్యమాం వక్షసి' అను పదములు సూచించు చున్నవి. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పై శ్లోకమున పురుషాయిత రతి వర్ణింపబడినది. ఈ శ్లోకమున నాయకుని గోత్రస్ఖలనము సఖీజనశ్రోత్రగతమగుటచే భీతయైన నాయిక యొక్క నాయకుని విముఖత తప్పిపోవుట ప్రస్తావింపబడుచున్నది.

శ్లో॥ కథమపి కృత ప్రత్యాఖ్యానే ప్రియే స్ఖలితోత్తరే
విరహకృశయా కృత్వా వ్యాజ ప్రకల్పితమశ్రుతమ్।
అసహన సఖీ శ్రోత్రప్రాప్తి ప్రమాదససమ్భ్రమం
విగలిత దృశా శూన్యే గేహే సముచ్ఛ్వసిత మ్పునః॥ 75

ప్ర॥ కథమ్ అపి-ఎట్లో; కృతప్రత్యాఖ్యానే-చేయబడిన తిరస్కారముగల; ప్రియే-ప్రియుడు; స్ఖలితోత్తరే-ఉత్తరముచెప్పుచు తొట్రుపడగా; విరహకృశయా-విరహముచే కృశించిన నాయికచే; వ్యాజమ్-మిషను; కృత్వా-చేసి; అశ్రుతమ్-వినబడక పోవుట; ప్రకల్పితమ్-కల్పింపబడినది; అసహనసఖీశ్రోత్ర ప్రాప్తి ప్రమాదసస(మ్భ్రమమ్-సహనములేని చెలుల చెవినబడు ప్రమాదము వలని తత్తర పాటుతో; విగలితదృశా-జారిన చూపులు గలనాయికచేత; శూన్యే-శూన్యమయిన; గేహే-ఇంటిలో; పునః-మరల; సముచ్ఛ్వసితమ్-ఊపిరిపీల్చుకొనబడినది.

తా॥ నాయకుడు తనపై వేసిన అపరాధమును ఎట్లో తిరస్కరించియు మరల సవతి నామమునే తన సమాధానములో పేర్కొన్నాడు. దానిని విననట్లేదో మిషతో నాయిక నటించినది. ఇంతలో ఎవరైన చెలులు విన్నచో ప్రమాదము కదా అని మిక్కిలి త్వరగా శూన్యగృహమున చూపులు నింపి నాయిక మరల ఊపిరి పీల్చుకొన్నది.

వి॥ అపరాధము చేసివచ్చిన నాయకుడు ఒట్లు పెట్టుకొని నమస్కరించి అపరాధారోపణమును తిరస్కరించినాడు. ఆ తిరస్కరించునప్పటి సమాధాన వాక్యములలో మరల సవతి పేరే ఉచ్చరించినాడు. చాలాకాలము భర్తకు దూరముగా నున్న నాయిక ఈ గోత్రస్ఖలనము కారణముగా నాయకునిపై మరొక యపరాధము మోపి ఆతనికి తాను దూరము కాదలచు కొనలేదు. ఆ సవతి పేరును నాయకుడుచ్చరించినను దానిని విననట్లేదో మిషతో నటించినది కాని చెలికత్తెలు వినిన ప్రమాదము కలుగును. వారి దృష్టిలో గోత్రస్ఖలనము చేసినను సిగ్గులేక నాయకునితో సంగమించినదని వారు నన్ను చులకన చేయుదురేమో యని భయపడి ఇల్లంతయు తేరిపారజూచినది. ఇంటిలో నెవరును లేరు. అమ్మయ్య! ప్రమాదము తప్పిపోయినది. ఇక నాయకునితో సంగమింప వచ్చును. సంగమించి విరహవేదనము తీర్చుకొన వచ్చునని నిశ్చయించుకొని ఊపిరిపీల్చుకొన్నది. అను అర్థమొసగు వాక్యములీ శ్లోకమున నున్నవి. వృత్తము హరిణి.

అవ॥ పై శ్లోకమున నాయికా నాయక సమాగమము సూచింపబడినది. ఈ శ్లోకమున నాయికా నాయక సమాగమాశాక్షయము సూచింపబడుచున్నది.

శ్లో॥ అదృష్టిప్రసరాత్ప్రియస్య పదవీ ముద్వీక్ష్య నిర్విణ్ణయా
విచ్ఛిన్నేషు పథిష్వహః పరిణతౌ ధ్వాన్తే సముత్సర్పతి।
దత్త్వైకం సశుచా గృహప్రతి పద మ్పాన్థస్త్రియాస్మిన్ క్షణే
మా భూదాగత ఇత్యమన్దవలిత గ్రీవ మ్పునర్వీక్షితమ్॥ 76

ప్ర॥ ఆదృష్టిప్రసరాత్-దృష్టిప్రసరించునంతవఱకు; ప్రియస్య-ప్రియుని యొక్క; పదవీమ్-మార్గమును; ఉద్వీక్ష-చూచి; నిర్విణ్ణయా-నిరాశచెందిన నాయిక చేత; పథిషు-మార్గములు; విచ్ఛిన్నేషు-విచ్ఛిన్నములుకాగా; అహఃపరిణతౌ-దినాంతము నందు; ధ్వాంతే-చీకటి; సముత్సర్పతి-వ్యాపించుచుండగా; సశుచా-దుఃఖముగల; పాంథస్త్రియా-బాటసారిభార్యచేత; గృహమ్‌ప్రతి-ఇంటిని గూర్చి; ఏకమ్-ఒక; పదమ్-అడుగును; దత్వా-ఇచ్చి; అస్మిన్-ఈ; క్షణే-క్షణమునందు; ఆగతః-వచ్చినవాడు; మాభూత్-కాకూడదా; ఇతి-అని; అమందవలితగ్రీవమ్-వేగముగా మెడత్రిప్పబడునట్లు; పునః-మరల; వీక్షితమ్-చూడబడినది.

తా॥ చూపు ప్రసరించు నంతవఱకు ప్రియుడు వచ్చు మార్గమున అన్ని మార్గములలో జనసంచారము తగ్గువఱకు పగలు గడచి చీకటి వ్యాపించు వఱకు ప్రియుని రాకకై చూచి చూచి అతడు ఇక రాడను నిరాశగలదై నాయిక ఇంటి వైపు ఒక అడుగు వైచి ఇంతలోనే నాయకుడు వచ్చినాడేమోయని మరల మెడ త్రిప్పి మార్గము వైపు చూచినది.

వి॥ భర్త సంచారజీవనము గడుపువాడు. ఏవో వ్యాపారవ్యవహారములలో నెప్పుడు తిరుగుచు ఎప్పుడింటికి వచ్చునో ఆతడే ఎఱుంగడు. కాని త్వరగా వచ్చెదనని మాత్రము నాయికకు చెప్పెడివాడు. పాపమాతని యిల్లాలింటి పని త్వరగా ముగించు కొని నాయకునికై ఎదురు చూచుచు కాలము గడపెడిది. వచ్చిన సాయంకాలమొక నాడు వచ్చును లేక మరునాడు వచ్చును. రాత్రి రాని నాడామె విరహబాధ వర్ణనాతీతము. ఒకనాడు పగలంతయు ఇంటి బయటకు ఊరుబయటకు వచ్చి భర్త ఏదిక్కు నుండి వచ్చునో యని అన్ని దిక్కులలోని మార్గములందు మార్చి మార్చి యెదురు చూచుచు కాలము గడిపెడిది చీకటి పడిన తరువాత బయట ఒంటరిగా నుండుట యుచితము కాదని యెఱిగిన ఆ నాయిక చీకటి పడుచున్నప్పుడు ఇంటి వైపు మరలి ఒక అడుగు వైచినది. అంతలోనే ఏదో ఆశ మొలకెత్తి నాథుడు వచ్చుచుండి యుండడు గదా అని మరల భర్త పోయిన మార్గము వైపు దృష్టి ఉంచినది. అను అర్థమొసగు వాక్యములీ శ్లోకమునందున్నవి. 'నిర్విణ్ణయా' (నిరాశ చెందిన నాయికచేత) అను పదము ఆమె మరణసంసిద్ధతను తెలుపును. అమంగళ సూచకమైనను తరువాతి శ్లోకము ప్రకారము అమంగళ సూచనను పరిహరించుకొని రసికులు తృప్తి పడవచ్చునని అర్జునవర్మదేవుడు చెప్పినాడు. ప్రవాసమేగిన భర్త యొక్క భార్య కనుక ఈమె ప్రోషితభర్తృక యను పేరుగల నాయిక. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పై శ్లోకమున ప్రోషితుడైన భర్తరాక పోవుట వర్ణింపబడినది. ఈ శ్లోకమున ఆతని రాక వర్ణింపబడుచున్నది.

శ్లో॥ ఆయాతే దయితే మనోరథశతై ర్నీత్వా కథంచిద్దినం
వైదగ్ధ్యాపగమా జ్జడే పరిజనే దీర్ఘాం కథాం కుర్వతి।
దష్టాస్మీత్య భిధాయ సత్వర పదం వ్యాధూయ చీనాంశుకం
తన్వఙ్గ్యా రతికాతరేణ మనసా నీతః ప్రదీపః శమమ్॥ 77

ప్ర॥ దయితే-ప్రియుడు; ఆయాతే-రాగా; మనోరథశతైః-వందలకోర్కెలతో; కథంచిత్-ఎట్లో; దినమ్-పగటిని; నీత్వా-గడపి; వైదగ్ధ్యాపగమాత్-వైదగ్ధ్యము లేక పోవుటవలన; జడే-జడమైన; పరిజనే-పరిచారికగణము; దీర్ఘామ్-పొడవైన; కథామ్-ప్రసంగమును; కుర్వతి-చేయుచుండగా; దష్టా-కఱవబడినదాననై; అస్మి-ఉన్నాను అని; సత్వరపదమ్-అడుగులు త్వరగా వేయుచున్నట్లు; చీనాంశుకమ్-పట్టుకొంగును; వ్యాధూయ-కదలించి; తన్వఙ్గ్యా-కృశించిన అవయవములు గల నాయికచేత; రతికాతరేణ-రతికై తహతహలాడు; మనసా-మనస్సుతో; ప్రదీపః-దీపము; శమమ్-శాంతిని; నీతః-పొందింపబడినది.

తా॥ ప్రియుడు రాగా వందలకోర్కెలతో పగలెట్లోగడిపి తెలివి తక్కువ పరిచారికాగణము ఏదో సుదీర్ఘ ప్రసంగము చేయుచుండగా ఏదో కఱచినదను మిషతో చిందులు తొక్కుచు కొంగుతో దీపము నార్పి వైచినది. కారణము ఆమె మనసు రతికై తొందర చేయుటయే.

వి॥ కన్నులు కాయలు కాచునట్లెదిరి చూడగా చూడగా ఎట్టకేలకు ప్రియుడు వచ్చినాడు. సేవికాగణము తెలివితక్కువది. భర్త రాకరాక వచ్చినాడు. మనమిక్కడ నుండి వెడలిపోవుట ఉచితము. అను రవంత సమయోచిత జ్ఞానములేక ఏవో ప్రసంగములను చేయుచుండగా వారిని తప్పించుకొనుటకా నాయిక నన్నేదో కఱచిన దని లేచి చిందులు తొక్కుచున్నట్లు నటించుచు కొంగుతో దీపము నార్పివైచినది. తప్పని సరిగా సేవికాగణము వెడలిపోయినదో ఉన్నను ప్రసంగము నాపి తరువాత పూర్తి చేసికొని నిదురించినదో వారినట్లు ప్రసంగము నాపునట్లు నాయిక చేసి ఆపైన ఏమి చేసినదో చెప్పనక్కఱలేదని శ్లోకమున సైతము ఆ సంగతి చెప్పలేదు. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పై శ్లోకమున నాయకుని రాక చెప్పబడినది. ఈ శ్లోకమున ఆతడు ప్రియురాలి దీనస్థితిని ఊహించుచున్నట్లు చెప్పబడుచున్నది.

శ్లో॥ ఆలమ్బ్యాంగణ వాటికా పరిసరే చూతద్రుమే మఞ్జరీమ్
సర్పత్సాన్ద్ర పరాగలమ్పటరటద్భృఙ్గాఙ్గనా శోభినీమ్।

మన్యే స్వాం తను ముత్తరీయ శకలే నాచ్ఛాద్య బాలాస్ఫుర
త్కణ్ఠధ్వాననిరోధకమ్పితకుచశ్వాసోద్గమా రోదితి॥ 78

ప్ర॥ అఙ్గణ వాటికా పరిసరే-ఇంటిముంగిటి పెరటి దగ్గఱ; చూతద్రుమే-మామిడి చెట్టునందలి; సర్వత్స్రాన్తపరాగలమ్పటరట ద్భృఙ్గాఙ్గనా శోభినీమ్-వ్యాపించుదట్టమైన పుప్పొడియందా సక్తి గలిగి అఱచుచున్న ఆడుతుమ్మెదతో ప్రకాశించుచున్న; మంజరీమ్-గుత్తిని; ఆలమ్బ్య-పట్టుకుని; ఉత్తరీయ శకలే న-ఉత్తరీయము యొక్క కొంగుచేత; స్వామ్-తన; తనుమ్-సన్నని శరీరమును; అచ్ఛాద్య -కప్పికొని; బాలా-చిన్నది; స్ఫురత్కణ్ఠధ్వాననిరోధకమ్పితకుచశ్వాసోద్గమా -స్ఫురించు కంఠము యొక్క ధ్వనినడ్డగించుటచే కదలు కుచముల యందలి నిట్టూర్పు ప్రకటనము గలదై; రోదితి-ఏడ్చుచున్నది అని; మన్యే-తలచెదను.

తా॥ ఇంటి ముంగిట మామిడి చెట్టు యొక్క పుప్పొడియందలి యాసక్తిచే అఱచుచున్న ఆడుతు మ్మెదతో కూడిన గుత్తిని పట్టుకొని తన ఉత్తరీయపు కొంగుతో తన శరీరమును కప్పుకొని ధ్వని వినబడకుండునట్లు నిట్టూర్పులు కుచములపై కదులుచుండగా నాయిక ఏడ్చుచున్నది. అని తలచెదను.

వి॥ ఇంటి ముంగిట చిన్నపెరడు. అక్కడ ఒక మామిడి చెట్టు. దానికొకపూల గుత్తి యున్నది. అది పుప్పొడితో నుండి యున్నది. తుమ్మెద ఆ పుప్పొడికై వచ్చి అఱచుచున్నది. తుమ్మెద యఱచుచున్నను ఆ మంజరిపై తుమ్మెద యున్నదని ధ్యాస నాయికకు లేదు. ఆమె మంజరి నట్లే పట్టుకొని నిల్చున్నది. ఎత్తుకొమ్మ పూలగుత్తిని పట్టుకొని నిలబడునప్పుడుత్తరీయము జారుట సహజము. ఆమె ఉత్తరీయమును కప్పుకొన్నది. ఆ చెట్టుక్రింది నాయకునితో కలిసి క్రీడించుట, విలాసముగా కలిసి రొట్టె తినుట జూదమాడుకొనుట, కొట్లాడుట, నవ్వుకొనుట మొదలగునవన్నియు జ్ఞప్తికి వచ్చినవి. ఆమె కన్నుల నీరాగలేదు. బిగ్గఱగా నేడ్చిన ఇంటి ముంగిటి ప్రదేశము గదా ఎవరైన విందురని గొంతుకలోనే ధ్వని నాపుకొని వెక్కివెక్కి యేడ్చినది. ఆమె నిట్టూర్పులతో ఆమె స్తనములపై నున్న వస్త్రము కదలుచున్నది. అనునర్థ మొసగు వాక్యములీ శ్లోకమున నున్నవి. 2. తన వియోగ కాలమున నాయిక ఇట్లు ఏడ్చుచుండునని నాయకుడు తలచు కొని దుఃఖించుట ఈ శ్లోకమున వ్యంజింపజేయ బడుచున్నది. 3. చూత మంజరిపై వ్రాలినభృంగాంగన ఆడుది అని చెప్పుటచేత నాయిక యొక్క పురుష స్పర్శాభావము, దానిచేత ఆమె పాతివ్రత్యము వ్యంజింపజేయ బడుచున్నది. ఆడు తుమ్మెదకు మంజరీ చుంబన భాగ్యమబ్బినట్లు నాయికకు చెలికత్తె యొక్క స్పర్శకలిగినను అది ఆమెకు సౌఖ్యమీయజాలదు. తన కాామె యధరచుంబన

భాగ్యమెప్పుడు కలుగునా యను నాయకుని నిరీక్షణము కూడ వ్యంగ్యమగుచున్నది. మంజరి యందలి పుప్పొడి ప్రియాస్తనమందలి చందనరాగమును తలపింపచేయను. 4.'చూతద్రుమేమంజరీమ్' అనుటచే తాను మామిడి చెట్టు వంటివాడనని తనమీద మంజరివలె ఆమె ఆధారపడియున్నదని అట్టిదానిని విడచియుంటిని గదా అను అంశము వ్యక్తమగును.5.'స్వాం తనుమ్' అనుటచేత ఆమె శరీరమున ప్రాణము కొడిగట్టి యున్న దను వ్యంగ్యమును వ్యాఖ్యాత అర్జునవర్మదేవుడు చెప్పినాడు. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పూర్వశ్లోకమున నాయకుడు నాయికను గూర్చి ఊహించుకొనుట చెప్పబడినది. ఈ శ్లోకమున నాయిక నాయకుడు తనకు దూరమైనట్టి పరిస్థితిని తలచుకొనుట చెప్పబడుచున్నది.

శ్లో॥ యాస్యామీతి సముద్యతస్య గదితం విస్రబ్ధమాకర్ణితం
గచ్ఛన్దూర ముపేక్షితో ముహురసౌ వ్యావృత్య తిష్ఠన్నపి।
తచ్ఛూన్యే పునరాస్థితాస్మి భవనే ప్రాణాస్త ఏతే దృఢాః
సఖ్యస్తిష్ఠత జీవితవ్యసనినీ దమ్భాదహం రోదిమి॥ 79

ప్ర॥ సముద్యతస్య- ప్రయాణమునకు సిద్ధుడైన వాని యొక్క; యాస్యామి -వెళ్ళగలను; ఇతి- అను; గదితమ్- మాట; విస్రబ్ధమ్- విశ్వాసముగా; ఆకర్ణితమ్- వినబడినది; అసౌ- ఈతడు; దూరః- దూరము; గచ్ఛన్- పోవుచు; ముహుః- మాటి మాటికి; వ్యావృత్య- మరలి; తిష్ఠన్అపి- నిలుచుచు; ఉపేక్షితః- ఉపేక్షింపబడినాడు; తత్- అందువలన; శూన్యే- శూన్యమయిన; భవనే- భవనమున; పునః- మరల; ఆస్థితా -ఉండి పోయినదానను; అస్మి- అగుచున్నాను; తే - ఆ; ఏతే - ఈ; ప్రాణాః- ప్రాణములు; దృఢాః- గట్టివి; సఖ్యః- ఓ చెలికత్తెలారా!; తిష్ఠత- ఉండుడు; జీవిత వ్యసనినీ- జీవించు వ్యసనము గలదానను; దమ్భాత్- డమ్బమువలన; రోదిమి- ఏడ్చుచున్నాను.

తా॥ వెళ్ళెదను అని నాయకుడు చెప్పిన మాటలను చక్కగానేవిన్నాను. దూరము పోవుచున్న నాయకుడు చాలసార్లు వెనుదిరిగి నిలిచి చూచుచున్నప్పుడు అతని నుపేక్షించి నాను. అందువలన నేడీ శూన్యభవనమున బాగుగానే ఉన్నాను. నా ఏడ్పు కేవలము డంబము. నాకు జీవించుట యందే ఆశయున్నది.

వి॥ ప్రయాణమునకు సిద్ధుడై పోయెదను అని చెప్పినపుడు చెవులు రిక్కించు కొని విన్నానే కాని పోవలదని వారింపలేదు. నాయకుడు దూరదేశమేగుచు పోలేక

పోలేక వెనుదిరిగి నిలచినప్పుడును ఆతని ప్రయాణమును వారింపకపోయితిని. తీరాపోయిన తరువాత ఈ శూన్యభవనమున ఒక్కదాననే ఉండుటచే అన్నిగదులు నావే. ఇది ఎంత బాగున్నది. ఆ విశాల శూన్యభవనమున ఉండలేక పోవుచున్నాను. నేనేడ్చుచున్నాననగా మీ అందఱికి నాకు భర్తయన్న ఎంతో ప్రేమయని తెలుపవలె నను డమ్బముతోడనే కాని నిజముగా నాకు భర్త పై ప్రేమ లేదు. ఉన్నచో ఈ ప్రాణము లింత గట్టిగా శరీరమును పట్టుకొని యుండుట యేమి అనునర్థమును వ్యంజింపచేయు వాక్యములీశ్లోకమున నున్నవి. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥పై శ్లోకమున ప్రియుని నిరోధించు అవకాశమున్నను దానిని కోల్పోయిన నాయిక యొక్క పశ్చాత్తాపము వర్ణింపబడినది. ఈ శ్లోకమున నాయిక యొక్క స్వయంకృతాపరాధము వర్ణింపబడుచున్నది.

శ్లో॥ అనాలోచ్య ప్రేమ్ణః పరిణతి మనాదృత్య సుహృద
స్త్వయా కాణ్డే మానః కిమితి సరలే సమ్ప్రతి కృతః।
సమాకృష్టా హ్యేతే ప్రలయ దహనోద్భాసురశిఖాః
స్వహస్తే నాఙ్గారా స్తదలమధునారణ్యరుదితైః॥ 80

ప్ర॥ సరలే - ఓ కపటమెరుగని దానా!; ప్రేమ్ణః- ప్రేమయొక్క; పరిణతిమ్- పరిణామమును; అనాలోచ్య- ఆలోచింపక; సుహృదః- చెలులను; అనాదృత్య- ఆదరింపక; అకాణ్డే - నిష్కారణముగా; త్వయా- నీచేత; కిమితి- ఎందుకని; మానః- కోపము; కృతః- చేయబడినది; ఏతే- ఈ; ప్రలయదహనోద్భాసితశిఖాః- ప్రలయాగ్ని వలె ఎగసిపడిన జ్వాలలు గల; అఙ్గారాః- నిప్పులు; స్వహస్తేన- నీచేతనే; సమాకృష్టాః- ఆకర్షింపబడినవి; తత్- అందువలన; అరణ్యరుదితైః- అరణ్యరోదనములచే; అలమ్- చాలును.

తా॥ ఓ కపటమెఱుగని దానా! ప్రేమ పరిణామమును ఆలోచింపక మిత్రులను ఆదరింపక నిష్కారణముగా ఏల కోపమును పూనితివి. ఈ ప్రలయాగ్ని జ్వాలల వంటి జ్వాలలు గల ఈ నిప్పులు నీవే చేతులారా ఏరుకొంటివి. ఇక ఈ అరణ్యరోదనముల మానుము.

వి॥ 1. ధూర్త నాయకుడ న్యాంగనాసంగమమును చేసి వచ్చినట్లు నటించినను దానిని నిజమని నమ్మి నాయిక కోపించినది. అది సాకుగా స్వీకరించి నాయకుడు అక్కడి నుండి వెడలిపోయినాడు. ఏడ్చుచున్న నాయికను చెలికత్తె మందలించుచు ఓ కపటమెఱుగని దానా! ప్రేమపరిణామమును మిత్రులమాటలను పట్టించుకొనక

నిష్కారణముగా కోపమునేల పూనితివి. ప్రలయాగ్ని జ్వాల వంటి జ్వాలలు గల అనగా ప్రాణములను తీయు నిప్పులను నీవే చేతులతో పోసికొన్నట్లైనది. ఇప్పుడేడ్చి లాభమేమి అను అర్థము నొసగు వాక్యములీ శ్లోకమున నున్నది. **2.** ప్రలయదహనోద్భాసురశిఖాః అను సమాసమున ఉపమాలంకారమున్నది. చేతితో నిప్పులను లాగుట, అరణ్యరోదనము అను లోకోక్తి యుండుటచే లోకోక్త్యలంకార మున్నది. వృత్తము శిఖరిణి.

అవ॥ పై శ్లోకమున నాయిక మానము వర్ణింపబడినది. ఈ శ్లోకమున నాయకుని ఓదార్పు వర్ణింపబడుచున్నది.

శ్లో॥ కపోలే పత్రాలీ కరతల నిరోధేన మృదితా
నిపీతో నిఃశ్వాసైరయమమృతహృద్యోఽధరరసః॥
ముహుః కణ్ఠే లగ్న స్తరలయతి బాష్పః స్తనతటం
ప్రియో మన్యు ర్జాతస్తవ నిరనురోధే న తు వయమ్॥ 81

ప్ర॥ నిరనురోధే- ఓ మొండిదానా!; కరతల నిరోధేన- అఱచేతి అడ్డగింపుతో; కపోలే - చెంపపై; పత్రాలీ- మకరికా పత్రముల వరుస; మృదితా- చెఱిగి పోయినది; అమృత హృద్యః- అమృతమువలె మనోహరమైన; అయమ్- ఈ; అధరరసః- అధర రసము; నిఃశ్వాసైః- నిట్టూర్పులచేత; నిపీతః- త్రాగబడినది; ముహుః- మాటి మాటికి; కణ్ఠే - కణ్ఠమున; లగ్నః- అంటిన; బాష్పః- కన్నీరు; స్తనతటమ్- స్తనప్రదేశమును; తరలయతి- చలింపజే యుచున్నది; తవ- నీకు; మన్యుః- కోపము; ప్రియః- ప్రియుడు; జాతః- అయినది; వయం తు- మేముమాత్రము; న- కాలేదు.

తా॥ చెంపపై నఱచేతి నానించుట చేత దానిపై నున్న మకరికా పత్రములు చెఱిగి పోయినవి. నిట్టూర్పులు పెదవి తడినార్పివేసినవి. మాటిమాటికి కంఠము నుండి వచ్చు దుఃఖము చేత కన్నీరు కారి స్తనములపై పడినది. నీకున్న కోపమే ప్రియుడైనాడు. నేను ప్రియుడను కాలేదు.

వి॥ **1.** అపరాధము చేసిన నాయకుడనునయించుటకు నాయిక కడకు వచ్చినాడు. పాదములపై బడియు ఆమె కోపము నడ్డుకొనలేక పోయినాడు. అప్పుడామె నూరడించుచు చెంపపై అఱచేతిని చేర్చుటచే మకరికా పత్రరచన మాసిపోయినది. నిట్టూర్పుల చేత పెదవి ఎండి పోయినది. కన్నీరు కన్నులనుండి జారి స్తనములపై పడుచున్నవి. అని పలికిన మాటలీ శ్లోకమున నున్నవి. **2.** ప్రియుడు చెక్కిలిని ముద్దాడ వలసి యుండగా ఆ అవకాశము నతనికి లేకుండుటకు అఱచేతిని

వాని కడ్డముగా పెట్టుకొన్నావు. ప్రియునిచే త్రాగదగిన నీపెదవి యందలి యమృతమును నిశ్వాసములే త్రాగివేసినవి. ప్రియుడు కౌగలించుకొనవలసిన కంఠమున స్తనముల యందు కన్నీరే నిండినది. అనగా నీవు కోపమునేనీప్రియునిగా భావించి దానిచే నాయెదుటనే ప్రియుడు చేయదగిన పనులన్నియు చేయించు కొనుచున్నావు. నేనేమో నిలబడి చూడవలసి వచ్చినదా. నీవు కోపమును తగ్గించు కొన్నచో నేనా పనులు చేయకుందునా అను వస్తువు ఈ శ్లోకమున వ్యంగ్యమైనది. 3. మన్యువునందు ప్రియత్వారోపముచే అర్థశ్లేషానుప్రాణిత రూపకాలంకార మున్నది. పత్రాలీ ప్రమదనము, అధరరసపానము, స్తనతటతరలము కోపము నందును ప్రియునందును సాధారణములుగా నుండుట అర్థశ్లేషము. దానిచేత రూపకాలం కారము ఉజ్జీవితమైనది. వృత్తము శిఖరిణీ.

అవ॥ పై శ్లోకమున కోపము చేత నాయికకు నాయకుని చుంబనాది రూపము లైన సంభోగము యొక్క విఘ్నము చెప్పబడినది. ఈ శ్లోకమున నాయికానాయక పరస్పర చుంబనము చెప్పబడినది.

శ్లో॥ శూన్యం వాసగృహం విలోక్య శయనాదుత్థాయ కించిచ్ఛనై
ర్నిద్రావ్యాజ ముపాగతస్య సుచిరం నిర్వర్ణ్య పత్యుర్ముఖమ్।
విస్రబ్ధ మ్పరిచుమ్బ్య జాతపులకామాలోక్య గణ్డస్థలీం
లజ్జానమ్రముఖీ ప్రియేణ హసతా బాలా చిరం చుమ్బితా॥ 82

ప్ర॥ శూన్యమ్-శూన్యమైన; వాసగృహమ్-నివాసగృహమును; విలోక్య-చూచి; శయనాత్-పక్కనుండి; శనైః-మెల్లగా; కించిత్-కొంచెము; ఉత్థాయ-లేచి; నిద్రావ్యాజమ్-నిద్రయనుమిషను; ఉపాగతస్య-పొందిన; పత్యుః-భర్తయొక్క; ముఖమ్-ముఖమును; సుచిరమ్-చాలసేపు; నిర్వర్ణ్య-బాగుగాచూచి; విస్రబ్ధమ్-విశ్వాసముగా; పరిచుమ్బ్య-బాగుగా చుమ్బించి; జాతపులకామ్-గగుర్పొడిచిన; గండస్థలీమ్-కపోలతలమును; ఆలోక్య-చూచి; లజ్జానమ్రముఖీ-సిగ్గుచేత వంచిన ముఖముగల; బాలా-చిన్నది; హసతా-నవ్వుచున్న; ప్రియేణ-ప్రియునిచేత; చిరమ్-చాలాసేపు; చుమ్బితా-చుమ్బింపబడినది.

తా॥ అది శూన్యగృహము అని గుర్తించిన చిన్నది మెల్లగా శయ్యనుండి లేచి కపటనిద్ర నటించు భర్త యొక్క ముఖమును చాలసేపు చూచి బాగుగా ముద్దుపెట్టు కొన్నది. ఇంతలోనే పులకించిన నాథుని కపోలతలమును చూచి సిగ్గుపడినది.

ప్రియుడు మాత్రము బాల యొక్క వంచిన ముఖమును చాలసేపు ముద్దాడుకొన్నాడు.

వి॥ అది శూన్యగృహము. క్రొత్తదంపతులకే కాంతవాసము కల్పింపగోరి అత్త ఆడుబిడ్డ మొదలగు వారెక్కడకో పోయినారు. నాయకుడు శయనగృహము లోనికి నాయిక రాగానే సంగమమునకు తొందరపెట్టినాడు. అప్పటికి యింట అత్త ఆడుబిడ్డ మొదలగు వారి యలికిడి ఇంకను వినబడుచునేయున్నది. వారు వినెదరేమో తడక సందులలో నుండి చూచెదరేమో యని ఆ చిన్నది బిడియపడి ముడుచుకొని పడుకున్నది. కాని ఆమెకు నిద్రపట్టలేదు. మెల్లగా లేచి భర్త ముఖము చాలసేపు చూచినది. ఆతని ముఖమున కదలిక లేదు. నిద్రపోవుచున్నాడని యెంచినది. తానే ఇచ్చవచ్చిన చోట్ల (చెంపలు, పెదవులు మొదలగు చోట్ల) బాగుగా చుంబించినది. నాయకుడు ఆమె చుంబనము చిరకాలము సాగవలెనని కపట నిద్ర నటించుచు కదలక మెదలక యున్నాడు కాని నాయకుని చెంప గగుర్పొడిచినది. దానిని నాయిక చూచి నాయకుడు కపట నిద్ర నటించుచున్నాడని తెలిసి తాను మోసపోయితినని సిగ్గుపడి తలవంచుకొన్నది. అయిన నేమి ఆమె సంభోగాభిలాష బయటపడి పోయినది. అప్పుడు నవ్వుచు ఆ చిన్నదానిని చాలా సేపు చుంబించినాడు అను నర్థమొసగు వాక్యము లీ శ్లోకమున నున్నవి. ఈ చుంబనము రాగోద్దీపనమైన స్వాభిప్రాయచుంబన మని వ్యాఖ్యాత అర్జున వర్మదేవుడు చెప్పినాడు. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పై శ్లోకమున ముగ్ధానాయికా చుమ్బనము వర్ణింపబడినది. ఈ శ్లోకమున లజ్జితశంకిత దృష్టి వర్ణింపబడుచున్నది.

శ్లో॥ లోలద్భ్రూలతయా విపక్షదిగుపన్యాసేఽవధూతం శిర
స్తద్వృత్తాంత నిరీక్షణే కృత నమస్కారో విలక్షః స్థితః।
కోపాత్తామ్రకపోలభిత్తిని ముఖే దృష్ట్యా గతా పాదయో
రుత్సృష్టో గురుసంనిధావపి విధిర్ద్వాభ్యాం న కాలోచితః॥ 83

ప్ర॥ లోలద్భ్రూలతయా- కదలుచున్న తీగవంటి కనుబొమగల నాయికచేత; విపక్షదిగుపన్యాసే- శత్రుదిక్కును చెప్పుటయందు; శిరః- శిరము; అవధూతమ్- కదల్పబడినది; తద్వృత్తాంత నిరీక్షణే - ఆమెవృత్తాంతమును చూచుటయందు; విలక్షః- పట్టించు కొనని వాడై; కృతనమస్కారః- చేయబడిన నమస్కారము కలవాడై; స్థితః- నిలచియున్నాడు; కోపాత్- కోపము వలన; ముఖే - ముఖము; తామ్రకపోలభిత్తిని- ఎఱ్ఱబడిన కపోల ఫలకములు కలదికాగా; దృష్ట్యా- చూపులతో; పాదయోః-

పాదములయందు; గతా- పోయినది; గురు సంనిధావపి- పెద్దల సన్నిధి యందును; కాలోచితః- కాలమునకు దగిన; విధిః- విధి; నడుత్సృష్టః- విడువబడలేదు.

తా॥ నాయకుడు రాగానే నాయిక కనుబొమ ముడి కదిలించుచు సవతి యున్న దిక్కు సూచించుచు తల కదల్చినది. అది చూచి నాయకుడు పట్టించు కొననట్లు నటించుచునే నమస్కరించినాడు. ముఖమెఱ్ఱబడగా ప్రియుని పాదములపై దృష్టి సారింపబడినది. ఇట్లు పెద్దల సన్నిధిలోకూడ నాయికా నాయకులిరువురు కాలోచిత విధిని విడువలేదు.

వి॥ పెద్దలుండగానే నాయకుడాలస్యముగా వచ్చుట చూచి మరల సవతి దగ్గఱకే పోయివచ్చితివా అను అభిప్రాయముతో నాయిక తల కదల్చినది. నాయకుడామె వృత్తాంతము చూచియు పట్టించుకోనట్లే యుండి నమస్కరించినాడు. అప్పుడు నాయకుని ముఖ మెఱ్ఱబడినది. నమస్కారముద్రను సూచించుచు నాయకుని పాదములపై దృష్టిసారించినది. పెద్దల సన్నిధిలోనే సైగలతోనే ఒకరికోపము నొకరు వారించుకొని తత్కాలోచితముగా ప్రవర్తించి నారను నర్థమొసగు వాక్యములీ శ్లోకమున నున్నవి. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పై శ్లోకమున కోపప్రసాదనము వర్ణింపబడినది. ఈ శ్లోకమున కోపమే రాలేదని నాయిక చెప్పుచున్నది.

శ్లో॥ జాతా నోత్కలికా స్తనౌ న లులితౌ గాత్రం న రోమాంచితం
వక్త్రం స్వేదకణాన్వితం న సహసా యావచ్ఛఠే నామునా।
దృష్టేనైవ మనో హృతం ధృతిముషా ప్రాణేశ్వరేణాద్య మే
తత్కేనాత్ర నిరూప్యమాణ నిపుణో మానః సమాధీయతామ్॥ 84

ప్ర॥ ఉత్కలికా- ఉత్కణ్ఠ; నజాతా- కలుగలేదు; స్తనౌ- చనులు; నలులితౌ- కదలలేదు; గాత్రమ్- శరీరము; నరోమాంచితమ్- గగుర్పొడవలేదు; వక్త్రమ్- ముఖము; స్వేదకణాన్వితమ్న- చెమటబిందువుతోకూడినదికాలేదు; యావత్- ఎంతలో; అమునా- ఈ; ధృతిముషా- ధైర్యమును దొంగిలించు; శఠేన- శఠుడైన; ప్రాణేశ్వరేణ - నాథుడు; దృష్టేన ఏవ- చూడబడగానే అతని చేత; సహసా- వెంటనే; అద్య- నేను; మే- నాయొక్క; మనః- మనస్సు; హృతమ్- అపహరింపబడినది; నిరూప్యమాణ నిపుణః- బాగుగానైపుణ్యముచేతనే నిరూపింపబడగా; మానః- మానము; కేన- దేనిచేత; సమాధీయతామ్- ఉంచబడునో; తత్- దానిని; కథయ- చెప్పుము.

**తా॥** ఉత్కంఠ కలుగలేదు, స్తనముచలింపలేదు, శరీరము గగుర్పొడవలేదు, ముఖము చెమర్చలేదు. నేడు నాయకుడు కనబడుచునే నాధైర్యమును హరించినాడు. మనస్సును అపహరించినాడు. జాగ్రత్తగా చూచిననే కనబడు నా కోపమాతని పై నుంచుట యెట్లు?

వి॥ సాధారణముగా నాయకుడపరాధము చేయును. నాయిక కోపించును. ఆమె నూరడించుటకు నాయకుడెన్నోవిధముల బ్రతిమిలాడును. చివరకు పాదముల పైబడును. అప్పుడిక ముందేమి చేయునో అను ఉత్కంఠ ఉండును. కోపముతో ఒడలు కంపించును. గగుర్పొడుచును. ముఖము చెమర్చును. కాని వాడు రాగానే నాబెట్టు సడలిపోయినది. వాడు నామనసునే అపహరించినాడు. నాకోపము నాకే కనబడలేదు. బాగుగా చూచిన కనిపించెడిదేమో అంత సూక్ష్మమై పోయిన కోపము నాతని పై నుండుటకేదో సాధనము కావలెను గదా. ఆ సాధనమేది మనస్సే. ఆ సాధనము దానిని వాడు ముందుగానే హరించినాడు. మనస్సులో గదా ఆతనిపై కోపము చూపవలె ఆ మనసునే వాడపహరింపగా ఎట్లు కోపించెదను అను అర్థమొసగు వాక్యములీ శ్లోకమున నున్నవి. 2. శఠ శబ్దము గూఢముగా అసంతోషమును కలిగించు శఠనాయకుని బోధింపక నాయకశఠుడని నాయిక ముగ్ధగా తిట్టుటను మాత్రమే సూచించును. ప్రాణేశ్వరేణ అను పదము ప్రాణములకే వాడు నాయకుడై యుండగా కోపము నేను చెప్పినట్లు విని ఉన్న దాని నాతడు వెడలగొట్టెను. అది పోయెను. అది వ్యంజింపబడుచున్నది. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పూర్వ శ్లోకమున నాయిక నాయకుని పై మానముచేయలేక పోవుట చెప్పబడినది. ఈ శ్లోకమున నాయిక నిషేధించినను నాయకుని ప్రవాస ప్రవృత్తి వర్ణింపబడు చున్నది.

శ్లో॥ దృష్టః కాతరనేత్రయా చిరతర మ్బద్ధాంజలిం యాచితః
పశ్చాదంశుక పల్లవేన విధృతో నిర్వ్యాజ మాలింగితః।
ఇత్యాక్షిప్య యదా సమస్త మఘృణో గన్తు మ్ప్రవృత్తః శఠః
పూర్వ మ్ప్రాణ పరిగ్రహో దయితయా ముక్తస్తతో వల్లభః॥85

ప్ర॥ కాతరనేత్రయా- బెదరుచూపులగల నాయికచేత; దృష్టః-చూడబడిన; బద్ధాంజలిమ్-చేతులు జోడించి; యాచితః- అడుగబడిన; పశ్చాత్- పిమ్మట; అంశుక పల్లవేన- చిగురువంటి అంచు చేత; విధృత- కట్టబడిన; నిర్వ్యాజమ్- నిష్కపటముగా;

ఆలింగితః- కౌగలింపబడిన; శఠః- మొండివాడు; యదా- ఎప్పుడు; సమస్తమ్- అంతయు; ఆక్షిప్య- ఆక్షేపించి; ఇతి- ఇట్లు; గంతుమ్- పోవుటకు; యదా- ఎప్పుడు; ప్రవృత్తః- పూనినవాడో; తదా- అప్పుడు; పూర్వమ్- ముందుగా; ప్రాణపరిగ్రహః- ప్రాణ బంధము; తతః- పిమ్మట; వల్లభః- ప్రియుడు; ముక్తః- విడువబడినవాడు.

తా॥ నాయకుడు ప్రవాసమునకు బయలుదేఱుచుండగా నిషేధించు నాయిక చేతలలో బెదరుచూపు చూడబడి, చాలాసేపు చేతుల జోడించి ప్రార్థింపబడి తరువాత కొంగుతో కట్టబడి, బిగ్గఱగా కౌగిలింపబడియు బయలు దేరుట మానలేదో అప్పుడు ముందుగా ఆమె ప్రాణ బన్ధము, ఆ తరువాత నాయకుడు విడువబడినాడు.

వి॥ సాధారణముగా ప్రవాసమేగు నాయకులెంతో ధైర్యము జెప్పి బయలు దేరుదురు. నాయిక ఒక వేళ నేను బతుకలేనన్నచో ఆగి పోవుదురు. కాని ఈ నాయకుడు బయలు దేరుచుండగా బెదరుచూపుల జూచినది. అనగా తాను జీవించలేనను భయమును నాథుని విడచి బతుకు ధైర్యము లేక పోవుటకును సూచించినది. అయినను మానలేదు. అప్పు నాయిక చేతులు జోడించి పోవలదని బతిమిలాడినది. అప్పుడును వాడు ప్రయాణమును మానుకొనలేదు. అప్పుడు నాయిక కొంగుతో నాయకుని కట్టివేసినది. ఆయున కొంగుపట్టి నిలువరించినది. అయినను వాడు మానుకొనలేదు. అప్పుడు చివఱకు నాయిక నాయకుని గట్టిగా కౌగలించుకొని పోనీయలేదు. అయినను వాడు ప్రయాణము మానుకొనలేదు. ఈ మొండివాడు వినక నన్ను వీడిపోవుచున్నాడు. దీనిని విడిచి యెట్లు ప్రాణముల నిలుపుకొనవలెను. అని ముందుగానే ఆమె ప్రాణముల విడచినది. ఇక వాని కామె బన్ధము తొలగినది. అను అర్థమిచ్చు వాక్యములీ శ్లోకమున ఉన్నవి. 2. వాడు పోయిన తరువాత ప్రాణములు పోవునేమో కాని వాని కన్న ముందుగా ప్రాణములు పోయినవని చెప్పుటచే నిందు అతిశయోక్త్యలంకారమున్నది. విరహము కారణము, ప్రాణత్యాగము కార్యము. కారణము ముందుండును. పిదప కార్యమేర్పడును. ఈ శ్లోకమున కార్యము ముందు చెప్పబడినది కావున పూర్వాతిశయమని అర్జునవర్మ దేవుడు చెప్పినాడు. వృత్తము శార్దూల విక్రీడితము. నాయక ప్రవాససమయమున నాయిక మరణమమంగలమునే సూచించును. కావున ఈ శ్లోకము ప్రవాసవిప్రలంభ శృంగార పరిధినతిక్రమించి కరుణ రసమునకు చోటిచ్చి నట్లైనది. 'ప్రాణపరిగ్రహో ముక్తః' అను మాటకు ప్రాణ బన్ధము సడలినది. అని అర్థము చెప్పుకొని శృంగార రసమేయని తృప్తిపడవలసి యున్నది. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పూర్వశ్లోకమున నాయక ప్రవాసము నిరోధించుటకు నాయిక చేసిన విఫల ప్రయత్నము చెప్పబడినది. ఈ శ్లోకమున తనకై ప్రవాస విరహమున నాయిక పొందు దుఃఖము నాయకుడూహించు కొనుట చెప్పబడినది.

శ్లో॥ తప్తై మహావిరహ వహ్ని శిఖావలీభి
రాపాణ్డురస్తనతటే హృదయే ప్రియాయాః।
మన్మార్గవీక్షణ నివేశిత దీనదృష్టేః
నూనం ఛమచ్ఛమితి బాష్పకణాః పతన్తి॥ 86

ప్ర॥ మహావిరహవహ్నిశిఖావలీభిః- తీవ్రవిరహవహ్నిశిఖా సమూహము లచే; తప్తై-తపించియున్న; మన్మార్గ వీక్షణ నివేశితదీనదృష్టేః-నా మార్గమును చూచుట యందే ఉంచబడిన దీనమైన చూపుగల; ప్రియాయాః-ప్రియురాలి యొక్క; ఆపాణ్డురస్తనతటే-పూర్తిగా తెల్లబడిన స్తనతటములుగల; హృదయే-ఎదయందు; ఛమచ్ఛమితి-ఛంఛం అనుధ్వనితో; బాష్పకణాః-కన్నీటిబిందువులు; పతంతి-పడుచున్నవి అనుట; నూనమ్-నిశ్చయము;

తా॥ గొప్ప విరహాగ్ని జ్వాలావలులచే తపించిన నామార్గమున చూచుట యందే నిలిపిన చూపుగల ప్రియురాలి యొక్క మిక్కిలి తెల్లబడిన స్తనప్రాంతములు గల ఱొమ్మునందు కన్నీటి బిందువులు ఛంఛం అని పడుచున్న వనుకొందును.

వి॥ మహా విరహము వహ్నిగా రూపింపబడినందున రూపకాలంకార మిందున్నది. వృత్తము వసంతతిలక.

అవ॥ పై శ్లోకమున నాయికా విరహదుఃఖమును నాయకుడూహించు కొనుట చెప్పబడినది. ఈ శ్లోకమున నాయకుని అపరాధము నాయికచే ఎట్టకేలకు క్షమింప బడుట సూచింపబడుచున్నది.

శ్లో॥ చిన్తామోహ వినిశ్చలేన మనసా మౌనేన పాదానతః
ప్రత్యాఖ్యాన పరాఙ్ముఖః ప్రియతమో గన్తుప్రవృత్తోఽధునా।
సవ్రీడై రలసై ర్నిరంతరలుఠద్బాష్పాకులై రీక్షణైః
శ్వాసోత్కమ్పికుచం నిరీక్ష్య సుచిరం జీవాశయా వారితః॥ 87

ప్ర॥ పాదానతః-పాదములపై పడిన; ప్రత్యాఖ్యాన పరాఙ్ముఖః- తిరస్కరించుటచే పరాఙ్ముఖుడైన; ప్రియతమః-ప్రియుడు; చిన్తామోహవినిశ్చలేన- చింతా మోహవినిశ్చయములుగల; మనసా-మనసుతో; మౌనేన-మౌనముతో; గన్తుమ్-

వెడలిపోవుటకు; ప్రవృత్తం-పూనుకొన్నవాడై; అధునా- ఇప్పుడు; సవ్రీడైః- సిగ్గుతో కూడిన; అలపైః- కదలిక తగ్గిన; నిరంతరలుఠద్బాష్పాకులైః- నిరంతరము పొరలు కన్నీటితో ఆకులములైన; ఈక్షణైః- చూపులచేత; శ్వాసోత్కమ్పికుచమ్- శ్వాసములతో ఎగసిపడు స్తనములుకలుగునట్లు; నిరీక్ష్య- చూపులచేత; జీవాశయా- జీవించు ఆశతో; వారితః- నివారింపబడినాడు.

తా॥ పాదములపై బడిన నాయకుని చూచి నాయిక చింతమోహ నిశ్చయములు గల మనసుతో మౌనమును మాత్రమే వహించినది. దానిచే తిరస్కారము నాయకునకు కల్గినది. ఇక లాభము లేదని వెడలి పోవుచుండగా ఆమె సిగ్గుతో పొరలు చున్న కన్నీరు గల చూపులతో శ్వాసలతో కుచములు కదులుచుండగా చూచినది. ఆ చూపు గ్రహించిన నాయకుడు నాయిక కడకు వచ్చుటకు వెనుదిరిగినాడు.

వి॥ చాలసేపు బ్రతిమిలాడి పాదములపై బడిన నాయకుని చూచియు మాట్లాడలేదు. లోనికి రమ్మనలేదు. నాయకుడు వెడలిపోనున్నప్పుడు సిగ్గుతో కన్నీటితో చూచినది. ఆ చూపులకు నీవులేక జీవింపలేనను అర్థము నాయకుని మనసున తోచినది. అందువలన అతడు తిరిగి నాయికను చేరుకొన్నాడు. అను అర్థమొసగు వాక్యములీ శ్లోకమున నున్నవి. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పై శ్లోకమున ప్రియుని ప్రవాసమాగి పోవుట వర్ణింపబడినది. ఈ శ్లోకమున సాక్షాత్కృత ప్రియాసమాగమము యొక్క కోరిక చెప్పబడుచున్నది.

శ్లో॥ మ్లాన మ్పాణ్డు కృశం వియోగవిధురం లమ్బాలకం సాలసం
భూయాస్తత్క్షణ జాతకాంతి రభసప్రాప్తే మయి ప్రోషితే।
సాటోపం రతికేలికాలసరసం రమ్యం కిమప్యాదరా
ద్యత్పీతం సుతనోర్మయా వదనకం వక్తుం న తత్పార్యతే॥ 88

ప్ర॥ వియోగవిధురమ్- వియోగముచేత పరవశమైన; సాలసమ్- మాంద్యము గల; మ్లానమ్- వాడిన; పాణ్డు-తెల్లబడిన; కృశమ్-చిక్కిన; లమ్బాలకమ్- పొడవైన ముంగురులుకల; ప్రోషితే- ప్రవాసమేగిన; మయి-నేను; రభసప్రాప్తే- హఠాత్తుగా రాగా; భూయాః- మరల; తత్క్షణ జాతకాంతి-వెంటనే కలిగిన కాంతిగల; సాటోపమ్ -గర్వముగల; రతికేలికాలసరసమ్- రతికేలికాలమున సరసమైన; రమ్యమ్- అందమైన; కిమ్అపి- ఏదో; ఆదరాత్- ఆదరమువలన; సుతనోః- అందమైన శరీరముగల నాయిక యొక్క; వదనకమ్- ముఖము; పీతమ్- త్రాగబడినది; యత్- అనునదేదిగలదో; తత్- అది; వక్తుమ్-చెప్పుటకు; నపార్యతే-సాధ్యముకానిది.

తా॥ ప్రియుడు దగ్గఱ లేనప్పుడు వాడిపోయినది, తెల్లబడినది, చిక్కినది, పొడవైన వెంట్రుకలుగలది, మాంద్యముతో కూడినది యైన కాంతాముఖము ప్రియుడు ప్రవాసమునుండి హఠాత్తుగా రాగానే గర్వము గలది, తత్క్షణమే కాంతి హెచ్చినది. రతికేలికాలము సమీపించినదని సరసమునైన కాంతయొక్క అందమైన ముఖముత్రాగి నప్పటి అనుభూతి చెప్పరానిది.

వి॥ 'మ్లానమ్' అనుటచేత లోపలి తాపము చేత కమలము వంటి ముఖము వాడినది అని వ్యంగ్యమగుచున్నది. 'పాణ్డు' అనుటచే మంచు పడి ఎఱుపు తగ్గి పాలి పోయిన కమలమువలె ముఖము తెల్లబడినది అని వ్యంగ్యమగుచున్నది. 'సాలసమ్' 'లంబాలకమ్' అనుటచే అలంకరణము కొఱకై కత్తిరించుకొనుట లేక పోవుట వలన ముంగురులు పెరిగిపోయినవి. అను నర్థము వ్యంగ్యమగుచున్నది. ఈ విశేషణములన్ని ప్రియుడు లేనప్పటి ముఖము యొక్క స్థితిని తెలుపుచున్నవి. ప్రియుడు కనబడిన తరువాత ఆముఖము 'సాటోపమ్' అనగా సగర్వమైనది. సాలసమను మాట కిది ప్రతిద్వంద్విగా నున్నది. 'రతికేలికాలసరసమ్' అనుమాట వియోగ విధురమ్ అనుమాటకు ప్రతిద్వంద్విగా నుండి రతి సమయమున అంతస్సంతోషముచే పెదవులపై రసమూరినదిని వ్యంగ్యమగుచున్నది. తత్క్షణ జాతకాంతి అనుటచే ప్రియుడు వచ్చిన క్షణమందే కాంతి అంతస్సంతోషముచే కలిగినదని వ్యంగ్యమగు చున్నది. సాటోపమ్ అనుటచేత ఇంతకాలము విడిచియుడిపోవుట నీకు తగునా అను కోపముతో కనుబొమలు ముడిపడుట వ్యంగ్యమగుచున్నది.'రమ్యామ్' అనుటచే పెదవులపై రసముండుటచే ఆ ముఖము అందముగా కనబడుచున్నదని వ్యంగ్యమగు చున్నది. 'తత్క్షణ జాతకాంతి' అనుటచే విలాసమం అను నాట్యాలంకారమేర్పడినదని వ్యాఖ్యాత అర్జునవర్మదేవుడు చెప్పినాడు. 'వదనకమ్' అనుపదమందలి చివటి అల్పార్థక కప్రత్యయమునాయిక చిన్నవయసు గల ముగ్ధయని అందుచేతనే ఆమె ముఖము మరింత మనోహరముగా నున్నదని వ్యంగ్యమగు చున్నది. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పై శ్లోకమున నాయకుని యొక్క విరహముతో వేగు ప్రియురాలి యవస్థ వర్ణింపబడినది. ఈ శ్లోకమున నాయిక యొక్క పురుషాయితము నుండి విరమించుట వర్ణింపబడుచున్నది.

శ్లో॥ సైవాహ ప్రమ్రుమదా న్మృణామధిగతావేతౌ చ తౌ నూపురా
వేషాఽస్మాకమవృత్తిరేవ సహజవ్రీడాధనః స్త్రీజనః

ఇత్థం లజ్జితయా స్మృతే రుపగమే మత్వా తనుం సమ్ప్రమా
త్పుమ్భావః ప్రథమం రతివ్యతికరే ముక్త స్తతో వల్లభః॥ 89

ప్ర॥ అహమ్-నేను; సాప్రమదాఏవ-ఆప్రమదనే; ఏతౌ-ఈ; నృణామ్-నరులకు; అధిగతౌ-పరిచితములైన; నూపురా-కాలిఅందెలు; తౌఏవ-అవియే; ఏషా-ఇది; అస్మాకమ్-మాయొక్క; అవృత్తిః ఏవ-అక్రియయే; స్త్రీజనః-స్త్రీజనము; సహజవ్రీడాధనః-సహజమైన సిగ్గే ధనముగా గలది; ఇత్థమ్-ఇట్లు; స్మృతే-జ్ఞప్తి యొక్క; ఉపగమే-రాకయందు; లజ్జితయా-సిగ్గుపడిన; తయా-ఆమెచేత; సమ్ప్రమాత్-త్వరవలన; ప్రథమమ్-మొదలు; రతివ్యతికరే-రతిసంబంధమున; పుమ్భావః-పురుషభావము; ముక్తః-విడువబడినది; తతః-పిమ్మట; వల్లభః-ప్రియుడు; ముక్తః-విడువబడినాడు.

తా॥ నేను ఆ ఆడు దాననే. నాయీనూపురములు నరులకు పరిచితములే. మాది క్రియారహిత స్థితియే. స్త్రీలకు సిగ్గు సహజము కదా! జ్ఞప్తికి వచ్చిన పిమ్మట సిగ్గు పడిన ఆమె చేత మొదలు పురుషభావము పిమ్మట ప్రియుడు విడువ బడినాడు.

వి॥ఒకప్పుడింత మదము లేకుండెను. ఇప్పుడు నేను ప్రకృష్ట మదము కలదానను. ఒకప్పుడు నానూపురముల ధ్వని నెవరు గుర్తింపకుండిరి. నేడు గుర్తింపబడిన దనియే అనకొందును. నాలోనీ మార్పు ప్రేమాతిరేకమున జరిగినది. ముగ్ధాత్వము నుండి ప్రౌఢత్వమును పొందుట చేత నీమార్పు వచ్చినది. ప్రేమాతిరేకమున నన్ను నేను మఱచినప్పుడు నేను ఆయన మీద ఉన్నానో, ఆయన నామీద ఉన్నాడో పట్టించుకొనలేదు. రతి వ్యాపారమున సహజమైన సిగ్గుతో జడముగా నుండు నేను నూపురములు ధ్వనించునట్లుగా పురుషాయిత రతి నెట్లు జరిపితినో నాకే తెలియలేదు. అంత సిగ్గు ఏమై పోయినదో, నా లజ్జాధనము అపహరింపబడినది. అది కొల్లగొట్టబడి పోయినది. నేనే కొల్లగొట్టుకున్నాను. ఆ మన్మథోద్రేకము కొంత సడలిన పిమ్మట నన్ను నేను మఱచిన స్థితినుండి నన్ను నేను గుర్తించు స్థితికి చేరుకొన్న వెంటనే ఆయన మీద నుండి లేచి సర్దుకొన్నాను. అంతవఱకు బిగికౌగిలింతలో బంధించి యుంచిన నాప్రియుని తరువాత విడిచివేసినాను - అను నర్థమును వ్యంజింప జేయు వాక్యములీ శ్లోకమున నున్నవి. (వృత్త) ప్రాగల్భ్యము (భయమువీడుట-విగత సాధ్వసభావము) అను నాట్యాలంకార మిందున్నదని వ్యాఖ్యాత అర్జున వర్మదేవుడు చెప్పినాడు.

అవ॥ పై శ్లోకమున ప్రతిలోమ (పురుషాయిత) రత్యంతము చెప్పబడినది. ఈ శ్లోకమున అనులోమ రత్యంతము చెప్పబడుచున్నది.

శ్లో॥ కరకిసలయం ధూత్వాధూత్వా విమార్గతి వాససీ
క్షిపతి సుమనో మాలా శేష ప్రదీప శిఖాం ప్రతి।
స్థగయతి ముహుః పత్యుర్నేత్రే విహస్య సమాకులా
సురత విరతా రమ్యా తన్వీ ముహుర్ముహురీక్షతే। 90

ప్ర॥ కరకిసలయం-చిగురువంటి చేతిసే; ధూత్వా ధూత్వా-కదలించి, కదలించి; వాససీ-వస్త్రములను; విమార్గతి-వెదుకుచున్నది; సుమనోమాలాశేషమ్- మిగిలిన పూమాలను; ప్రదీపశిఖామ్ ప్రతి-ప్రదీపజ్వాలను గూర్చి; క్షిపతి- విసరివేయు చున్నది; సురత విరతా-సురతవిరామమును పొందిన; తన్వీ-చిక్కి యున్న; రమ్యా-చక్కనిది; విహస్య-నవ్వి; ముహుః-మాటి మాటికి; పత్యుః-భర్త యొక్క; నేత్రే-రెండు కన్నులను; స్థగయతి-మూయుచున్నది; ముహుఃముహుః-మాటిమాటికి; సమాకులా-ఆకులత గలదై; ఈక్షతే-చూచుచున్నది;

తా॥ సురతాంతము నందొక పడతి చిగురువంటి చేతిని కదలించి కదలించి తన గుడ్డలను వెదకుచున్నది. తెగిపోగా మిగిలిన పూమాలను దీపము పైకి విసరుచున్నది. భర్త యొక్క రెండుకన్నులను మాటిమాటికి మూయుచు ఆకులతతో నాతనినే చూచుచున్నది.

వి॥ సురతము చేత అలసిన స్త్రీ మరింత సన్నగా అందముగా కనబడును. ఆమెను మరింత ఆసక్తితో పతి చూచుచున్నాడు. అది గమనించిన ఆమె క్రింది భాగమున కట్టుకొను, పైభాగమున కప్పుకొను వస్త్రములకై మాటిమాటికి మెత్తని చేతిని కదలించుచు వెదకు చున్నది. బహుశః ఆమె నా స్థితిలో చూడదలచిన భర్త ఆవె వాని నుంచిన చోటు నుండి దాచి ఆమెకు కనబడకుండ జేయుచున్నాడేమో, ఆమె కందకుండ తనచేతులలో పట్టుకొని తీసికొనుమనుచున్నాడేమో, అప్పుడప్పు డామె చేతులు మెత్తగా భర్తకు తగులు చుండగా ఆమె వానిని కదలించుచు వస్త్రములను వెదకు చున్నది. ఆమె వాస్తవముగా వెదకుట లేదు. వెదకుచున్నట్లున్నది. సిగ్గుతో నిజముగా వెదకుచునే యున్నట్లున్నది. మార్గతి అనక విమార్గతి అనుటచే నీయర్థము స్ఫురించు చున్నది. ధూత్వా ధూత్వా అనుటచేత చేతులు కదలించుటలో నున్నంత శ్రద్ధ వెదకుటలో లేదని స్ఫురించు చున్నది. సురత సమయమున స్త్రీలు భర్తకు తన సర్వావయవములు కనిపింపకుండ దీపమార్పి వేయగోరుదురు. పురుషులా అవయవము లన్నింటిని చూడగోరి ఆ దీపమార్పు యత్నమునకడ్డు పడుదురు. సురతాంతమునను అట్లు చూడగోరు భర్త ప్రయత్నమునకు విఘ్నము కలిగించుటు

కామె చేతనైనంత యత్నము చేయుచున్నది. భర్త ఊహింపలేని తన తెగిన పూమాలను దీపశిఖ వైపు విసరుచున్నది. అది గురితప్పుటతో మరల మరొక మాలికా భాగమును విసరుచున్నది. ఈ యర్థమంతయు 'క్షిపతి' అనువర్తమానకాలార్థక ప్రత్యయము యొక్క ప్రయోగముచే స్ఫురించుచున్నది. ఆ విధముగా దీపమార్పు తన యత్నము విఫలముకాగా భర్త కన్నులనే మాటి మాటికి మూయుచున్నది. మాటి మాటికనుటచే కన్నులు మూసినప్పుడా భర్త స్తనస్పర్శ చేయుగా తన చేతులతో స్తనములను కప్పుకొనుటలో భర్తకు మరలమరల చూచు నవకాశము ఆమె మరల మరల నాతని కన్నులు మూయుట స్ఫురించుచున్నది. భర్త తుంటరి తనము లోలోపల మెచ్చుకొనుచు మెచ్చుకోలు చూపులు గల కన్నులతో అతని రసికత్వము నభి నందించుచు చూచుచున్నది. ఈ యర్థము విహస్య(నవ్వి) అను పదముతో స్ఫురించు చున్నది. మన్మథాప్యాయితమైన ఛాయ ఆమె శరీరమంతట వ్యాపించి యుండగా భర్తకామె రమణీయగా కన్పించు చున్నది. 'రమ్యా' అను పదముచే నీ యర్థము స్ఫురించుచున్నది. ఈ శ్లోకమున కాంతి యను నాట్యాలంకార మున్నదని వ్యాఖ్యాత అర్జున వర్మదేవుడు చెప్పినాడు. వృత్తము హరిణి

అవ॥ పూర్వ శ్లోకమున కాంతా సురతాంత రామణీయకము వర్ణింపబడినది. ఈ శ్లోకమున భర్తయందు కోపము తగదని యొకమానిని కామె చెలికత్తె ఉపదేశింప బడుచున్నది.

శ్లో॥ సన్త్యేవాత్ర గృహేగృహే యువతయస్తాః పృచ్ఛ గత్వాధునా
ప్రేయాంసః ప్రణమన్తి కిం తవ పునర్దాసో యథా వర్తతే।
ఆత్మద్రోహిణి! దుర్జనైః ప్రలపితం కర్ణేఽనిశం మా కృథా
శ్ఛిన్నస్నేహరసా భవన్తి పురుషా దుఃఖాను వర్త్యాః పునః॥ 91

ప్ర॥ అత్ర- ఇచట; గృహేగృహే- ప్రతియింట; యువతయః- పడుచులు; సన్తి ఏవ- ఉండనే ఉన్నారు; గత్వా- పోయి; తాః- వారిని; అధునా- ఇప్పుడు; ప్రేయాంసః- ప్రియులు; ప్రణమన్తికిమ్- నమస్కరించెదరా యని; పృచ్ఛ- అడుగుము; తవ- నీకు; పునః- మాత్రము; దాసోయథా- సేవకుడట్లు; వర్తతే- ప్రవర్తించు చున్నాడు; ఆత్మ ద్రోహిణి!- నీకు నీవే ద్రోహము చేసుకొను దానా!; దుర్జనైః- చెడ్డవారి చేత; ప్రలపితమ్ - వాగబడినదానిని; అనిశమ్- ఎల్లప్పుడు; కర్ణే- చెవిని; మాకృథాః- చేర్చకుము; ఛిన్నస్నేహరసాః- తెగిన స్నేహరసముగల; పురుషాః- పురుషులు; పునః- మరల; దుఃఖానువర్త్యాః- దుఃఖముతోనను వర్తింప దగినవారు; భవన్తి- అగుదురు.

తా॥ దుర్జనులు చెప్పిన దంతయు చెవిని చేర్చుకొని నీకు నీవే ద్రోహము చేసికొను చున్నావు. అట్లు చేయకుము. నీకు తెలియనిచో ఈ యూరను పెక్కురు యువతులున్నారు. వారి కడకు పోయి వారి భర్తలు వారి పాదములపై పడుచున్నారేమో అడుగుము. నీ భర్త మాత్రము నీకు దాసుడుగానే ప్రవర్తించు చున్నాడు. పురుషులు స్నేహానుబంధమును తెంచుకొనిరేని తిరిగి వారి సేవించి అనుకూలురుగా మార్చు కొనుట కష్టము.

వి॥ యౌవన గర్వముతో కన్నుగానకున్నావు. నాయకుడపరాధము చేయలేదని నీ పాదములు పట్టుకొని చెప్పినను ఆతనిని ఆదరింపకున్నావు. ఎవరో దుర్జనులు చెప్పిన చెప్పుదురు గాక. వారిమాటలను గుడ్డిగా నమ్ముట తగదు. వారు నీ సుఖము చూచి యోర్వలేక నీప్రియుడు అపరాధియని చెప్పుచున్నారు. అది నిజము కాదు. ఎందఱు ఈ యూర నీవంటి యువతులు లేరు. వారందరు నీవలె నాయకుల నవ మానించుచున్నారా? అసలు వారి నాయకులు వారికి నమస్కరించు చున్నారేమో పోయి వారినే యడుగుము. వాస్తవమునకు ప్రియులకు ప్రియురాండ్రే నమస్కరింప వలసి యుండగా, నీప్రియుడే నీపాదములపై బడి పేడుకొను చున్నాడు. అంతేకాదు, నీకనుసన్నలలో నీకు దాసునివలె ప్రవర్తించు చున్నాడు. గాని సమాన ప్రణయివలె ప్రవర్తించుటలేదు. నీ విట్లే కోపముతో నాతని నాదరింపక పోయినచో ఆతడు మాత్రమెన్నాళ్ళు సహింపగలడు. నీ వంటిది మఱొకతె ఆతనికి లభింపక పోవునా! అప్పుడు నీ ప్రేమ వదలక యుండగలడా! అట్లు ఒకసారి స్నేహాను బంధమును తెంచుకొన్న పురుషులు మరల అనుకూలు రగుట మిక్కిలి కష్టము సుమా. ఇప్పుడే ఆలోచించు కొనుము. చేతులు కాలిన పిదప ఆకులు పట్టుకొనిన లాభమేమి యుండగలదు. నీవు నీకోపము విడచి నీ నాయకుని తిరస్కరింపక ఆదరించి సుఖింపుము. తిరస్కరించి నీకు నీవే ద్రోహము చేసికొనకుము అను నర్థము స్ఫురింప జేయు వాక్యము లీ శ్లోకమున నున్నవి.

అవ॥ పై శ్లోకమున చెలికత్తెలు నాయికను మందలించుట చెప్పబడినది. ఈ శ్లోకమున చెలికత్తెలనే నాయిక మందలించుట చెప్పబడుచున్నది.

శ్లో॥ నిఃశ్వాసా వదనం దహన్తి హృదయం నిర్మూలమున్మథ్యతే
నిద్రా నతి న దృశ్యతే ప్రియముఖం నక్తందివం రుద్యతే।
అంగం శోషముపైతి పాదపతితః ప్రేయాం స్తదోపేక్షితః
సఖ్యః కం గుణ మాకలయ్య దయితే మానం వయం కారితాః॥ 92

ప్ర॥ నిఃశ్వాసాః- నిట్టూర్పులు; వదనమ్- ముఖమును; దహన్తి- కాల్చుచున్నవి; హృదయమ్- హృదయము; నిర్మూలమ్- మూలము లేకుండునట్లు; ఉన్మథ్యతే- ఉవ్వెత్తుగా మథింపబడుచున్నది; నిద్రా- నిద్ర; నఆయాతి- వచ్చుటలేదు; ప్రియ ముఖమ్- ప్రియుని ముఖము; నదృశ్యతే- కనబడుటలేదు; నక్తందివమ్- రాత్రింబవళ్ళు; రుద్యతే- ఏడువబడుచున్నది; అంగమ్- శరీరము; శోషమ్- శోషమును; ఉపైతి- పొందుచున్నది; పాదపతితః- పాదములపై బడిన; ప్రేయాన్- ప్రియుడు; తత్- అప్పుడు; ఉపేక్షితః- ఉపేక్షింపబడినాడు; సఖ్యః- చెలికత్తెలారా!; కం- ఏ; గుణమ్- లాభమును; అకలయ్య- ఆశించి; దయితే- ప్రియునియందు; వయమ్- మేము; మానమ్- కోపమును; కారితాః- చేయింపబడినాము?

తా॥ నిట్టూర్పులు ముఖమును కాల్చుచున్నవి. హృదయము సమూలముగా పెకలింపబడుచున్నది. నిద్రపట్టుట లేదు. శరీర మెండి పోవుచున్నది. ప్రియ ముఖము కనబడుట లేదు. రాత్రింబవళ్ళేడ్చుచునే యున్నా శరీరము తడియారు చున్నది. అప్పుడు పాదములపై పడిన ప్రియుడుపేక్షింపబడినాడు. చెలికత్తెలారా నాకప్పుడు కోపమునే లాభమాశించి కలిగించినారు?

వి॥ చెలికత్తెలు వెంటనే ప్రియునకు లొంగి పోవలదు. అట్లయిన నీవాతనికి చులకనయ్యె పోవుదువు, బెట్టు చేయవలెను అని ఉపదేశింపగా నాయిక పాదములపై పడిన ప్రియు నుపేక్షించినది. ఆతనిని ఆదరింపలేదు. అప్పుడు వెడలి పోయిన ప్రియుని దర్శనమే కరవైపోయినది. నాకు రాత్రింబవళ్ళేడ్చుటయే మిగిలినది. తాపముచే శరీర మెండి పోవుచున్నది. మీరు చెప్పినట్లు బెట్టు చేయుటచే నాకీ గతి పట్టినది. చెలికత్తెలారా! నా కొంప కూల్చవలెనని ఆనాడు బెట్టుచేయవలెనని నాకు చెప్పినారా! నా యేడ్పు ఇప్పుడు మీ కానందము కలిగించుచున్నదా! మీకన్నులిప్పుడు చల్లబడినవా అను నాయిక ఆక్రోశమీ శ్లోకమున చెప్పబడినది. 'సఖ్యః' అనుటచేత చెలికత్తెలై యుండి మీరిట్లు తప్పు మార్గ ముపదేశించుట మీకు తగియుండలేదని 'తదా' అనుట చేత ఇప్పుడైనచో మీ మాటలు విని యుండెడి దానను కాదని స్ఫురించు చున్నది. దహన్తి, ఉన్మథ్యతే, రుద్యతే, మొదలగు లట్ ప్రత్యయాంతక్రియల ప్రయోగముచే ఈ నాదుఃఖమున కంతము కనబడుటలేదని తెలియుచున్నది. ఈ శ్లోకమున అనుచిత క్రియచే అనర్థము కలిగినట్లు చెప్పబడుటచే విషమాలంకార మున్నదని వ్యాఖ్యాత అర్జునవర్మదేవుడు చెప్పినాడు. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పూర్వశ్లోకమున బెట్టుచేయుమని చెప్పిన చెలికత్తెలను నాయిక ఉపాలంభించుట చెప్పబడినది. ఈశ్లోకమున ఇప్పుడు నాయకుడు వచ్చినచో బెట్టు చేయనని నాయిక ఒట్టు పెట్టుకొనుట చెప్పబడుచున్నది.

శ్లో॥ అద్యారభ్య యది ప్రియే పునరహ మ్మానస్య వాఽన్యస్య వా
గృహ్ణీయాం శఠదుర్నయేన మనసా నామాపి సంక్షేపతః।
తత్తేనైవ వినా శశాంకధవలాః స్పష్టాట్టహాసా నిశా
ఏకో వా దివసః పయోదమలినో యాయాన్మమ ప్రావృషి॥ 93

ప్ర॥ అద్య-నేడు; ఆరభ్య-మొదలుకొని; ప్రియే-ప్రియుని విషయమున; అహమ్-నేను; మానస్య-కోపము యొక్క గాని; అన్యస్యవా-మరొకదాని యొక్క గాని; నామఅపి-పేరును; శఠదుర్నయేన-మొండిది చెడ్డనీతియు గలదియు నైన; మనసా-మనస్సుతో; సంక్షేపతః-సంక్షేపముగా; యది-ఒకవేళ; గృహ్ణీయామ్- తీసుకొనినచో(ఒట్టు); తత్-అందువలన; తేన-అతడు; వినా-లేకుండ; శశాంకధవలాః-చంద్రునిచే తెల్లనైన; స్పష్టాట్టహాసా-స్పష్టమైన వినబడునవ్వుగల; నిశాఏవ- రాత్రులే గాని; ప్రావృషి-వర్షాకాలమందు; పయోదమలినః-మేఘములతో ప్రకాశ హీనమైన; ఏకః-ఒక; దివసఃఅపివా-దివసమే యైనను; మమ-నాకు; నయాయాత్- గడువక పోవుగాక.

తా॥ ఒక్క మాటలో నేడు మొదలుకొని ప్రియుని విషయమున మొండిది చెడ్డదియునైన మనసుతో కోపముగాని మరొక్కటి గాని పేరునకైన చేయనని ఒట్టువేసి చెప్పుచున్నాను. అందువలన నా ప్రియుడు లేకుండ వెన్నెలరాత్రులుగాని వర్షాకాలమందిలి మబ్బులు పట్టిన ఒక దివసము గాని గడవకుండుగాక!

వి॥ 1. తానాదరము చేయలేదని కోపముతో వెడలిపోయిన ప్రియుడెట్టకేలకు వచ్చినాడు. చాలాకాలము విరహము సహించిన నాయిక ప్రియుని రాకతో సంతసించినదై చెలికత్తెలతో నిట్లనుచున్నది. ఇది వఱకు మీ తప్పుడు బోధలతో గాని నా అవివేకపు కోపముతో గాని ప్రియునాదరింపక ఆతని దర్శనమైనా లేక పెక్కు దివసములు, రాత్రులు విరహముతో వేగినాను, విసిగి పోయనాను. ఇక ముందెన్నడు ప్రియుని విషయమున కోపమునుగాని ఆయన సేవలో లోపమునుగాని అసలే చేయనని ఒట్టు పెట్టుకొని చెప్పుచున్నాను. ఒక్క మాటలో సంక్షేపముగా చెప్పవలెనన్న ఇక ముందు నా ప్రియుని విడచి వెన్నెల రాత్రులు గాని మబ్బులు పట్టిన వర్షాకాలపు ఒక్క పగలు కాని గడిచి పోకుండుగాక యని భగవంతుని ప్రార్థించుచున్నాను. 2. ఉత్తమ నాయిక లట్టహాసము చేయరు. పెదవులు మాత్రము విచ్చుకొనునట్లు నవ్వుదురు. దంతములు బయట పడనట్లు, బిగ్గఱగా ధ్వని బయటకు వచ్చునట్లు నవ్వరు. శరత్కాలపు రాత్రులలో వసంత గ్రీష్మ రాత్రులలో వెన్నెల పిండియారబోసి నట్లుండును. ముఖ్యముగా పున్నమనాడు ఆ వెన్నెల శివుని అట్టహాసమువలె తెల్లగా నుండును. పురుషుల నవ్వు

అట్టహాసముగా కొన్నివేళలలో ధ్వనించుచుండును. ప్రియురాలు చిరుహాసము చేయగా ప్రియుడు మాత్ర మట్టహాసము చేయును. నాయిక తన ప్రియుని అట్ట హాసముతో వెన్నెల రాత్రుల ధ్వనింపజే యుననుచున్నది. అంతగానాతని నాదరింప జే యుదునని చెప్పుచున్నది. ఈ అర్థమంతయు స్పష్టాట్టహాస శబ్దముచే సూచిత మగుచున్నది. సాధారణముగా వసంత గ్రీష్మములు ప్రవాసకాలములుగావు. శరదృతువు ప్రవాసకాలమనుట స్పష్టము అప్పుడు ప్రవాసమేగిన ప్రియులు వర్షాకాలము లోపుననే అనగా వసంత గ్రీష్మముల ముందుగనో వెనుకగనో ఇండ్లకు వచ్చిచేరుచుందురు. ఒకప్పుడు వర్షాకాలము కూడ ప్రవాసములోనే గడప వలసి నప్పుడు నాయికానాయకుల విరహదుఃఖము పరాకాష్ఠ నొందును. ఆ కాలపు విరహము మిక్కిలి అసహ్యముగానుండును. కావున ఆకాలపు ఒక్కదివసము కూడ ప్రియుడు లేకుండ గడుప ననుచున్నది. ఈ అర్థమంతయు పయోదమలినః అను దివస విశేషణముతో సూచితమగు చున్నది. 'శశాంకధవలా స్పష్టాట్టహాసానిశా' అని ఏకవచనాంతముగా నుండుటయే సమంజసముగా నుండును. బహువచనాంత ములనుకొనుటలో స్వారస్యముగాన వచ్చుటలేదు. ఏకవచనాంతముగా నంగీక రించినప్పుడు ఏకోఽపి అను పుంలింగపదమును లింగ వ్యత్యయముచే ఏకాఽపి అని పరివర్తన మందించి నిశాపదవిశేషణముగా చేయవచ్చును. వ్యాఖ్యాత అర్జునవర్మ దేవుడు మాత్రము బహువచనాంతము నంగీకరించి వసంత గ్రీష్మ శశాంకధవల రాత్రులు నిస్సందేహమరణాధ్యవసాయములు కలవనుటచే నెన్నియైన గడపవచ్చును. కాని దుఃఖితునికి నవ్వువాడు కానరానట్లు ప్రావృట్కాల దివసమొకటియు గడపుట కష్టము కావున ప్రియుడు లేని ప్రావృట్కాలికైక దినముకూడ గడపుట కష్టమన్నట్లు వాఖ్యానించెను. వ్యాఖ్యాత అభిప్రాయమున ప్రావృట్కాల దివసము తన దుఃఖమును చూచి ఏడ్చుచున్నట్లుండును. కావున మబ్బులతో ప్రకాశహీనముగా నున్నది. చినుకులు కన్నీళ్ళవలె నున్నవి. బహువచనాంత నిశా శబ్దముచే ప్రియులు సాన్నిధ్యమున గల యితర స్త్రీలునన్నుచూచి నవ్వినన‌వ్వనీ సహించెదను. వారికి నా మీద సానుభూతి లేదు అనునర్థము వచ్చును. కాని ప్రావృట్కాల దివసము పుంలింగ శబ్దము ప్రియుని వలె సానుభూతివెలార్చినా దుఃఖమును మరింత పెంచును. కావున అట్టి దివసమును గడుపుట కష్టము. కాని సానుభూతి వలన దుఃఖము తఱగునే కాని పెఱుగదు. వ్యాఖ్యాత అట్లేల వాఖ్యానించెనో విచారణీయము.

అవ॥ పై శ్లోకము నాయిక యొక్క పశ్చాత్తాపము వర్ణింపబడినది. ఈ శ్లోకమున చెలికత్తె నాయికకు చేయు హెచ్చరిక వర్ణింపబడుతున్నది.

శ్లో॥ ఇదం కృష్ణం కృష్ణం ప్రియతమ తను శ్వేతమథ కిం
గమిష్యామో యామో భవతు గమనేనాథ భవతు।
పురా యేనైవ మ్మే చిరమనుస్మృతా చిత్త పదవీ
స ఏవాన్యో జాతః సఖి! పరిచితాః కస్య పురుషాః 94

ప్ర॥ ప్రియతమ- ఓ ప్రియతమా!; ఇదమ్- ఇది; కృష్ణమ్- నల్లనిది; తను- కొంచెము; శ్వేతమ్-తెల్లనిది; అథకిమ్- అవును; గమిష్యామః-వెడలుదాము; యామః-వెడలుచునే యున్నాము; గమనేనభవతు-వెడలుట మానుదము; అథ- అట్లే; భవతు-అగుగాక; పురా-పూర్వము; ఏవమ్-ఈ విధముగా యేన-ఎవని చేత; చిత్తపదవీ-మనోమార్గము; చిరమ్-చాలాకాలము; అనుస్మృతా-అనుసరింపబడినదే; సఖి!-ఓచెలీ; సఏవ-ఆ(నా) ప్రియుడే; అన్యః-ఇతరుడు; జాతః-అయినాడు; పురుషాః-పురుషులు; కస్య-ఎవరికి; పరిచితాః-పరిచితులు.

తా॥ ప్రియురాలు- ప్రియా ఇది నల్లనిది; ప్రియుడు- నల్లనిది; ప్రియురాలు- ఇదికొంచెము తెల్లనిది; ప్రియుడు-అవును; ప్రియురాలు-పోవుదమా; ప్రియుడు- పోవుచున్నాము; ప్రియురాలు- వెడలుట మానుదము; ప్రియుడు-సరే. ఈ విధముగా ఏనా ప్రియుడు నా మనోమార్గము నవలంభించెనో ఇప్పుడాతడే మరొకడుగామారి పోయినాడు. ఓ చెలీ! పురుషులెవరికి పరిచితులై యుందురు?

వి॥ 1. ఒకప్పుడు నా ప్రియుడు నా మనము ననుసరించి ప్రవర్తించువాడు. ఇప్పుడాతడు పూర్తిగా మారిపోయినాడు. నేనన్నదానికి వ్యతిరేకమే చేయుచున్నాడు. నీ వేమో నా ప్రియుడు మంచివాడను కొనుచున్నావు. ఆ మాటనే నాకును స్పష్టముగా చెప్పుచున్నావు. కాని ఈ పురుషులు నమ్మదగిన వారుకాదు. నా అనుభవమే దీనికి ప్రమాణము. అను నర్థమిచ్చు వాక్యము లీ శ్లోకమున నున్నవి. కొంచెము తెల్లని వస్తువును ప్రియురాలు నల్లని దనగా ప్రియుడు నల్లనిదే యన్నాడు. కాదు కొంచెము తెల్లనిదేయని ప్రియురాలనగా ప్రియుడును అంతే అది కొంచెము తెల్లనిదేయన్నాడు. ప్రియురాలన్న మాట బలపరచుటయేగాని ప్రియురాలికే మాత్రము భిన్నముగా ప్రియుడు బదులు పలుకుటలేదు. ఇది నాయిక యొక్క స్వాధీన వల్లభత్వమునకు నిదర్శనము. ప్రియుడట్లు తాళము వేయునా వేయుడా అని తెలిసికొనుటకే ఆమె ఆ ప్రయోగము చేసినది. ఈ మధ్య అట్లు తాళము వేయుట లేదు. అంతేకాదు బదులు పలుకుటకు ప్రియురాలు తెల్లనిదనగా కాదు నల్లనిది. ప్రియురాలు నల్లనిదనగా కాదు తెల్లని దనుట మొదలు పెట్టినాడు. ఇంతేకాదు ఇంటికి

వచ్చుటయే తగ్గించినాడు. పూర్తిగా వచ్చుటయే మానివేసినాడు. అని పెండ్లయిన నాటి నుండి ప్రియునిలో వరుసగా వచ్చిన మార్పును తన స్నేహితురాలికి వివరించి పురుషుల నమ్మరాదని చెప్పుచున్నది. 2. పెండ్లియిన క్రొత్తలో పోవుదమాయని ప్రియురాలనగా పోవుచునే యున్నాము అని ఆమె కోరికను వెంటనే అమలు పెట్టినాడు అని చెప్పుటకు ప్రియురాలి మాట భవిష్యత్క్రియ గలదిగా ప్రియుని మాట వర్తమాన క్రియ గలదిగా కవిచే ప్రయోగింపబడినది. 3. గమిష్యామః యామః అని అనుటచే ఛేకానుప్రాసమను శబ్దాలంకారమున్నది. ప్రశ్నోత్తరాలంకారము అను అర్థాలం కారము కూడ నున్నది. కొండమీది నుండి వాగు వేగముగా క్రిందికి ప్రవహించున ట్లు ప్రియుని ప్రేమ ఎత్తు నుండి క్రిందికి పడి పోయినదని చెప్పుటకు శిఖరిణీ వృత్తము నుపయోగించుట సమంజసముగానున్నది. ప్రేమప్రవాహమెట్లు గంగలో కలిసి నామరూపములు కోల్పోయినదో నాయికకు చెలికత్తె వివరించి చెప్పుటచే నీవు ఇప్పుడు ప్రియుడు మిక్కిలి అనుకూలముగా నున్నాడని పొంగిపోవలదను హెచ్చరిక స్ఫురించుచున్నది.

అవ॥ పై శ్లోకమున నాయికకు చెలికత్తె చేసిన హెచ్చరిక చెప్పబడినది. ఈ శ్లోకమున నాయిక ఆ హెచ్చరికను పాటించి కోపమును పూనవలెనో త్యజించ వలెనో నిశ్చయించు కొనలేక పోవుట చెప్పబడుచున్నది.

శ్లో॥ చరణ పతనం సఖ్యాలాపా మనోహర చాటవః
కృశతర తనోర్గాఢా శ్లేషో హఠాత్పరిచుమ్బనమ్।
ఇతి హి చపలో మానారమ్భస్తథాపి హి నోత్సహే
హృదయదయితః కాంతః కామం కిమత్ర కరోమ్యహమ్॥95

ప్ర॥ చరణ పతనమ్- పాదములపై పడుట; సఖ్యాలాపాః- స్నేహపు మాటలు; మనోహరచాటవః- అందమైన పొగడ్తలు; కృశతరతనోః- మిక్కిలి చిక్కిన శరీరము యొక్క; గాఢాశ్లేషః- బిగికౌగిలింత; హఠాత్- ఆకస్మికముగా; పరిచుమ్బనమ్ - ఒడలంతముద్దుపెట్టుకొనుట; ఇతి- ఇట్టి కారణముల వలన; మానారమ్భః- కోపారంభము; చపలః- చంచలమైనది; తథాపి- అయినను; నోత్సహే (విడచుటకు) ఉత్సాహించలేక పోవుచున్నాను; కాంతః- నాథుడు; కామమ్- మిక్కిలి; హృదయ దయితః- హృదయప్రియుడు; అత్ర- ఈవిషయమున; అహమ్- నేను; కిమ్- ఏమి; కరోమి- చేయుదును?

తా॥ ప్రియుడు పాదపతనమును స్నేహ ప్రసంగములను అందమైన పొగడ్తలను మిక్కిలి చిక్కియున్న ప్రియురాలి శరీరమును గట్టిగ కౌగలించుకొనుట ఆకస్మికముగా ప్రియురాలి శరీరమునంతను ముద్దులతో ముంచెత్తుట వంటి పనులను చేయుచున్నప్పుడు ఆమె కోపారమ్భము చంచలమై జారి పోవుచున్నను, చెలికత్తె స్వానుభవమును తన ఎదలో వేసిన ప్రభావము వలన కోపమును పూర్తిగా నాయిక త్యజించలేక ఎదలో ప్రియుడు మిక్కిలి మనోహరుడుగానే ఉన్నాడు కాని కోపమును వదలుట కుత్సహించలేక పోవుచున్నాను.—ఈ పరిస్థితిలో నాకర్తవ్యమేమి? ఏమి చేయుదును. అను చింతలో మునిగి పోయినది.

వి॥ నాయిక కోపము ఆరమ్భదశలోనే ఉన్నది. నాయకుడు ఆ మాత్రమునకే పాదములపై పడినాడు, ఆమె స్పందన యెట్లుండునో చూతమని స్నేహ ప్రసంగములను చేసినాడు, నాయిక అందమును అందముగా పొగడి ఋలిపించినాడు. విరహముతో మిక్కిలి బక్కచిక్కి యున్న ప్రియురాలి శరీరమును బిగియార కౌగలించినాడు. ఆకస్మికముగా ప్రియురా లన్యమనస్కగా నున్నప్పుడు ఆమె శరీరము నంతను ముద్దులతో ముంచెత్తినాడు. ఈ పనుల నామె నిరోధింపలేక పోయినను బుంగమూతిని మాత్రము వదల లేదు. ప్రియుని చర్యలు ఆమె ఎదలో ప్రేమనే పెంచు చున్నవి. నాయకుడు ఆమె యెదలో సందడి కలిగించుచునే ఉన్నాడు. కూడగట్టుకొని యున్న కోపమును తొలగించుటకు యత్నించుచునే ఉన్నాడు. అయినను పురుషులను నమ్మరాదను చెలికత్తె యొక్క హెచ్చరిక ఇంకను పని చేయుచునే ఉన్నది. అందు వలన ఆమె పూర్తిగా కోపమును వదలలేక పోవుచున్నది. ఆ కోపము ఆరంభ దశలోనే ఉండగా నాయకుడు చేసిన ఈ చర్యల వలన ఆమె తన చపల కోపమును నిలుపుకొనలేక పోవుచున్నది. కోపమును వదలుటయా వదలక పోవుటయా తేల్చు కొనలేక పోవుచున్నది. ఈ యర్థము నొసగు వాక్యములీ శ్లోకమున నున్నవి. వృత్తము హరిణి.

అవ॥ పూర్వశ్లోకమున కోపము పరిత్యజించవలెనా లేదా అను విచారము నాయకచే చేయబడినట్లు చెప్పబడినది. ఈ శ్లోకమున కోపమును పరిత్యజింపక పోవుటచే కలిగిన ప్రియవిరహము యొక్క అసహ్యత చెప్పబడుచున్నది.

శ్లో॥ తన్వంగ్యా గురుసంనిధౌ నయనయో ర్యద్వారి సంస్తమ్భితం
తేనాన్తర్గలితేన మన్మథశిఖీ సిక్తో వియోగోద్భవః।

మన్యే తస్య నిరస్య మాన కిరణస్త్యైషా ముఖే నోద్గతా
శ్వాసాయాససమాకులాలిసరణి వ్యాజేన ధూమావలీ॥ 96

ప్ర॥ గురుసన్నిధౌ-పెద్దల సమీపమున; తన్వంగ్యాః-కృశించిన శరీరముగల నాయిక యొక్క; నయనయోః-నేత్రములందు; యద్-ఏ; వారి-జలము; సంస్తమ్భితమ్-నిలుపబడినదో; అంతర్గలితేన-లోపలకు జారిన; తేన-ఆ నీటిచేత; వియోగోద్భవః-విరహమువలన పుట్టిన; మన్మథ శిఖీ-కామాగ్ని; సిక్తః-తడుపబడినది; నిరస్యమానకిరణ స్య-ఆరిపోవుచున్న జ్వాలలుకల; తస్య-ఆ అగ్నియొక్క; ముఖేన-ముఖమునుండి; ఉద్గతా-బయలుదేరిన; శ్వాసాయాససమాకులాలిసరణి వ్యాజేన-శ్వాసాయాచముచే సమాకులమైన తుమ్మెదల వరుస అను వ్యాజముతో; ధూమావలీ-పొగలవరుసయో యన్నట్లున్నది.

తా॥ భర్తృవిరహముతో పెల్లుబుకుచున్న కన్నీటిని పెద్దల సమక్షమున నాయిక ఆపుకొని యత్నింపగా ఆ కన్నీరు ఆమె యెదలో జ్వలించుచున్న కామాగ్నిలో పడగా ఆ అగ్ని జ్వాలలు తగ్గి వానికి బదులుగా వచ్చు పొగయో యన్నట్లు ఆమె ముఖము యొక్క సుగంధముచే ఆకర్షింపబడివచ్చి ఆమె ఆయాసముతో పీల్చు శ్వాసలచే ఆకులములైన తుమ్మెదల వరుస యొప్పుచున్నది.

వి॥ 1. ఒంటరిగా నున్నప్పుడు కట్టలు తెంచుకొని యెదలోని దుఃఖము పొంగి కన్నీరుగా బయట పడుచుండును. స్నేహితులు సమ వయస్కులు అయిన వారి మధ్య కూడా ఒకప్పుడట్లే జరుగుచుండును. కాని పెద్దల సమక్షమున దుఃఖితులు తమ దుఃఖమువలన వచ్చిన కన్నీరు కన్నులలోనే దాచుకొన యత్నింతురు. అట్లే నాయిక చేసినది. ఆమె యెదలో జ్వాలా మాలాఖిలమైన కామాగ్ని ఉన్నది. కన్నులలోని నీరు ఎదలోని కామాగ్ని జ్వాలలపై పడి వాని ఆట కట్టించినది. కాని ఆ జ్వాల అప్పుడు సెగల పొగగా మారి బయటకువచ్చినది. ఆమె ముఖము యొక్క సుగంధముచే ఆకర్షింపబడి వచ్చిన యాతుమ్మెదలామె ఆయాసముతో కూడిన శ్వాసములతో సమాకులములైనవి. ఆ తుమ్మెదల వరుసలు తుమ్మెదల వరుసలు గావు ఆమె కామాగ్ని నుండి వచ్చిన సెగల పొగలే అను నర్థమును స్ఫురింపజేయు వాక్యములీ శ్లోకమున నున్నవి. 2. దుఃఖ సమయమున నిట్టూర్పులు వచ్చుట సహజము. ఆ నిట్టూర్పులు వేడిగా కూడ నుండును. ఆ నిట్టూర్పులు వాయురూపములు గావున వాయు రూపములే యైన కామాగ్ని ధూమములుగా నుత్ప్రేక్షింపబడినవి. ఈ తొలి ఉత్ప్రేక్షలో నిట్టూర్పు విషయము కామాగ్నిధూమ సమూహము విషయి నిట్టూర్పునకు రూపముండదు. కాని ధూమసమూహమునకు రూపముండును. కావున ఈతొలి

యుత్ప్రేక్షలో అంతగా ఔపమ్యస్ఫూర్తియుండదు. ఔచిత్యము కూడ అంతగా లేదు. కావున ధూమసమూహమును విషయముగా జేసి ఆమె ముఖము యొక్క సుగంధముచే ఆకర్షింపబడి వచ్చిన తుమ్మెదల సమూహమును విషయముగా చేసి మరొక యుత్ప్రేక్ష ఇందు చేయబడినది. 3. ఇప్పుడు విషయమైన ధూమ సమూహము నకు విషయియైన తుమ్మెదల వరుసకును రూపముండుటచే ఔపమ్యస్ఫూర్తి యున్నది. ఔచిత్యముకూడ బాగుగా నున్నది. ఉత్ప్రేక్షాలంకారమునందు ఔపమ్యము వాచ్యము కారాదు. అభేదాధ్యవసాయమే ఉండవలెను. కాని ఆ అభేదా ధ్యవసాయము ఔపమ్య స్ఫూర్తిని కలిగించినప్పుడు ఔచిత్యము మరింత హెచ్చును. అయినను తొలి ఉత్ప్రేక్షలో కూడ 'ఉష్ణత' అను సమానధర్మమున్నది కావున ఔపమ్యస్ఫూర్తి బొత్తిగా లేదనరాదు. ఈ తొలి ఉత్ప్రేక్ష కామమునందు చేయబడిన అగ్న్యుత్ప్రేక్షణ ముపైననే ఆధారపడి యున్నది. రెండవ ఉత్ప్రేక్షకూడ దానిపైననే ఆధారపడియున్నది. కావున అలంకారము ఉత్ప్రేక్ష. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పై శ్లోకమున నాయిక యొక్క విరహజన్యాశ్రుపాత నిశ్వాసములు వర్ణింపబడినది. ఈ శ్లోకమున చెలికత్తెలచే కోపము నేర్పబడిన నాయిక యొక్క నిశ్చయాభావము వలన కలిగిన సందేహము చెప్పబడుచున్నది.

శ్లో॥ భ్రూభేదో గుణితశ్చిరం నయనయో రభ్యస్తమామీలనం
రోద్ధుం శిక్షితమాదరేణ హసిత మ్మౌనేఽభియోగః కృతః।
ధైర్యం కర్తుమపి స్థిరీకృతమిదం చేతః కథంచిన్మయా
బద్ధో మాన పరిగ్రహే పరికరః సిద్ధిస్తు దైవే స్థితా॥ 97

ప్ర॥ చిరమ్-చాలసేపు; భ్రూభేదో-కనుబొమముడి; గుణితః-గుణింప బడినది; నయనయోః-కన్నుల యొక్క; ఆమీలనమ్-మూసికొనుట; అభ్యస్తమ్- నేర్వబడినది ; మౌనే-మౌనమునందు; అభియోగః-అభ్యాసము; కృతః-చేయబడినది; ధైర్యము-ధైర్యమును; కర్తుమ్అపి-చేయుటకును; కథంచిత్-ఎట్లో; మయా-నాచేత; ఇదమ్-ఈ; చేతః-మనస్సు; స్థిరీకృతమ్- స్థిరమొనర్పబడినది; మానపరిగ్రహే- కోప స్వీకారము నందు; పరికరః-సన్నాహము; బద్ధః-చేయబడినది; సిద్ధిఃతు- సిద్ధి మాత్రము; దైవే- దైవము నందు; స్థితా-ఉన్నది.

తా॥ కనుబొమలు ముడిపేయుట, కన్నులు మూసికొనుట, ఆదరముతో నవ్వు నాపుకొనుట, మాట్లాడకుండ నుండుట, మనసును రాయి చేసికొనుట మొదలగు

కోప లక్షణ ము లన్నియు నేర్చుకొనబడినవి. ఇక ప్రియుడు వచ్చినప్పుడు కోపమును చేయగలుగుట మాత్రము దైవాధీనముగానే ఉన్నది.

వి॥ కోపలక్షణ ముల నభ్యసించుట ప్రయత్నము. అది నాయిక యధీనములో నున్నది. ఆ ప్రయత్నము ఫలించుట అనగా ప్రియుడు వచ్చినప్పుడు కోపమును నిలుపుకోనగుట మాత్రము దైవాధీనము. ప్రయత్నమునకు పురుషకార మను నామాంతరముగలదు. పురుషకారము అను మాట యున్నది. స్త్రీలు చేసిన ప్రయత్నమునకును పురుషకారమనియే పేరు. స్త్రీకార మను మాట లేదు. పురుష శబ్దము జీవవాచకము కావున స్త్రీ పురుషుల నిరువురు జెప్పును. దైవ శబ్దము నపుంసక మైనను దేవుడు మాత్రము పురుషుడే. దేవతా శబ్దము పురుష దేవతలను కూడ చెప్పును అట్లే దేవశబ్దము స్త్రీ దేవతలను కూడ చెప్పును . దైవ శబ్దము సర్వదేవతాధికమైన తత్త్వమును చెప్పును. అది లింగరహితము అయినను అది పురుష పక్షపాతము గలదై యుండునని పించును. నా అనుభవమున గత ప్రయత్నములన్ని విఫలమైనవి. నేను స్త్రీని కావున నాప్రయత్నము ఫలించునో లేదో యను సందేహము కలుగుచున్నది. పురుషులు స్త్రీల నుపేక్షించు ధైర్యము కలిగియుందురు. కాని స్త్రీలకట్టి ధైర్యముండదు. ఫలప్రదాత పురుష పక్షపాతమును వీడినప్పుడే నాప్రయత్నము ఫలించుట కవకాశమున్నది. ఆ పక్షపాతము వీడుటయు దైవాధీనమే. ఈ అర్థమును వ్యంజింపజేయు వాక్యములీ శ్లోకమున నున్నవి. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పై శ్లోకమున నాయకుడు వచ్చినప్పుడేమి జరుగునో తెలియని నాయిక వృత్తాంతము చెప్పబడినది. ఈ శ్లోకమున ఏదో చెప్పెదనన్న ప్రియునికడకు విజన ప్రదేశమున కేగిన నాయిక వృత్తాంతము చెప్పబడుచున్నది.

శ్లో॥ అహం తేనాహూతా కిమపి కథయామీతి విజనే
సమీపే చాసీనా సరస హృదయత్వాదవహితా।
తతః కర్ణోపాన్తే కిమపి వదతాఘ్రాయ వదనం
గృహీతా ధమ్మిల్లే సఖీ! స చ మయా గాఢమధరే॥ 98

ప్ర॥ సఖి- ఓ చెలీ!; కిమ్అపి- ఏదో; కథయామి- చెప్పెదను; ఇతి- అని; అహమ్ -నేను; విజనే- జనములేని చోటికి; ఆహూతా- పిలువబడినదాననై; సమీపే- దగ్గఱ; ఆసీనా- కూరుచున్నదానినై; సహసహృదయత్వాత్- సరసహృదయుమకలిగి యున్నందున; అవహితాచ- సావధాననైకూడ( ఆసమ్- ఉంటిని); తతః- పిమ్మట;

కర్ణోపాన్తే-చెవిదగ్గఱ; కిమ్‌అపి- ఏదో; వదతా-చెప్పుచున్నవాని (నాయకుని) చేత; వదనమ్- ముఖమును; ఆఘ్రాయ- మూర్కొని; ధమ్మిల్లే- కొప్పునందు; గృహీతా- పట్టుకొనబడినదాననైతిని; సచ- అతడును; మయా- నాచేత; గాఢమ్- గట్టిగా; అధరే- పెదవియందు; గృహీతః- పట్టుకొన బడినవాడైనాడు.

తా॥ ఏదో చెప్పెదనని విజన ప్రదేశమున కాహ్వానించిన ప్రియుని దగ్గఱ కూర్చొని యుండగా సరసహృదయము కలిగి యున్నందున సావధాననై కూడ ఉండగా నా ముఖమును మూర్కొని నాప్రియుడు నాకొప్పును పట్టుకొనెను. నేనేమో ఆతని పెదవిని( నాదంతములతో) పట్టుకొంటిని.

వి॥ ఎన్నాళ్ళ నుండియో ప్రియునితో సంభోగమునకై ఎదురుచూచు చుంటిని, ఒకనాడు నాప్రియుడు ఏదో పని యున్నదని నన్నేకాంత ప్రదేశమునకు రమ్మన్నాడు. ఆ వచ్చిన అవకాశమును జాఱ విడచుకొన నిష్టము లేక నేనచటకు పోయినాను. దగ్గఱగా కూడ కూర్చొన్నాను. తరువాత ఆతడేమి చేయునో అని తమకముగా ఎదురు చూచుచుండగా ఆతడేదో చెప్పుచు నాముఖమును మూర్కొని నాకొప్పుపై చేయి వేసినాడు. ఆతనికిని నాతోడి సంభోగము నందాసక్తి ఉన్నదని నాకు అర్థమైనది. ఇక నేమి నేనాతనిని గట్టిగా ముద్దుపెట్టుకొన్నాను. ఇక తరువాత ఏమి జరిగినదో చెప్ప వలసిన పని లేదనుకొందును. అని చెలికత్తెతో నాయిక చెప్పుచున్నట్లీ శ్లోకమన నున్నది. శిఖరిణీ వృత్తము. ఏదో చెప్పెదననుట విస్రంభణమని ( అదినాఖ్యాలంకారము) వ్యాఖ్యాత అర్జునవర్మదేవుడు చెప్పినాడు.

అవ॥ పై శ్లోకమున నాయిక యొక్క విరహానంతర ప్రియసంయోగ శృంగారము వర్ణింపబడినది. ఈ శ్లోకమున నాయకుని యొక్క విరహము వర్ణింపబడు చున్నది.

శ్లో॥ దేశై రంతరితా శతై శ్చసరితాముర్వీభృతాం కాననై
ర్యత్నేనాపి న యాతి లోచనపథం కాన్తేతి జానన్నపి।
ఉద్గ్రీవ శ్చరణార్థ రుద్ధ వసుధః ప్రోన్మృజ్య సాస్రేదృశా
తామాశా మ్పథికస్తథాపి కిమపి ధ్యాయన్ పునర్వీక్షతే॥ 99

ప్ర॥ దేశైః-దేశములచేత; సరితామ్- నదుల యొక్క; ఉర్వీభృతాం- కొండల యొక్క; శతైః- నూర్లచేత; కాననైః అపి- అడవులచేతను; అంతరితా ఽపి- వ్యవహిత మైనను; యత్నేన అపి- ప్రయత్నము చేతను; కాన్తా- ప్రియురాలు; లోచన పథమ్- కన్నుల మార్గమును; నయాతి- పొందదు; ఇతి- అని; జానన్‌అపి- తెలిసిన వాడైనను;

ఉద్గ్రీవః-కంఠము నెత్తినవాడై; చరణార్ధరుద్ధవసుధః-అరకాళ్ళచేత అవరోధించిన భూమికలవాడై; సాస్రే-కన్నీళ్ళతో కూడిన; దృశౌ-కన్నులను; ప్రోన్మృజ్య-తుడిచికొని; పథకః-బాటసారి; కిమ్‌అపి-ఏదో; ధ్యాయన్-ఆలోచించుచు; తథాపి -అయినను; తామ్-ఆ; ఆశామ్-దిక్కును; పునః-మరల; వీక్షతే-చూచు చున్నాడు.

తా॥ ప్రవాసములోనున్న పథికుడు తన ప్రియురాలు వందలకొలది నదుల పర్వతముల అడవుల దేశముల ఆవల నున్నను యత్నించినను కంటికి కానరాదని ఎఱిగియు ఏదో కన్నుల నీరు తుడిచికొని తలయెత్తి అరకాళ్ళ మీద నిలబడి మరల మరల ఆలోచించుచు కాంత నివసించువైపు చూచుచున్నాడు.

వి॥ పూర్వకాలమున ప్రయాణసాధనములు అంతగా అభివృద్ధి చెందని కాలమున సాహసులైన వారు సుదూర దేశమునకు పోవుచునే ఉండెడివారు. వేలకొలది కాలము రాకపోకలలోనే గడచి పోయెడిది. పగలంతయు ప్రయాణములో తోటి ప్రయాణికులతో ఎట్లో గడచిపోయెడిది. రాత్రికొందఱు నిద్రించినను క్రొత్తపెండ్లి కూతురును విడచి ప్రవాసములో నున్న యువకుడైన బాటసారికి నిద్ర పట్టులేదు. వెన్నెల కాయుచున్నది. ఆ వెన్నెలలో తన ప్రియురాలే దిక్కునున్నదో ఆ దిక్కున నామె కనబడునేమో అని చూచుచున్నాడు. తన ప్రియురాలున్నచోటు వందల కొలది దేశములకు నదులకు అడవులకు కొండల కావల నున్నది. బాటసారి పిచ్చికాని ఆమె కనబడునా. ఏమాలోచించుకొను చున్నాడో కన్నీరు కారుచున్నది. దానిని తుడిచికొని కొలది దూరములో ప్రియురాలున్నట్లు భావించుకొని అరికాళ్ళ మీద నిలబడి ప్రయత్నించినను కనబడదని తెలిసియు తల పైకెత్తి చూచుచున్నాడు. అను నర్థమొసగు వాక్యములీ శ్లోకమున నున్నవి. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పై శ్లోకమున ప్రవాసత తరుణ నాయకుని విరహము వర్ణింపబడినది. ఈ శ్లోకమున అభిలాషి నాయకుని వృత్తాంతము వర్ణింపబడుచున్నది.

శ్లో॥ చక్షుః ప్రీతిప్రసక్తే మనసి పరిచయే చింత్యమానాభ్యుపాయే
రాగే యాతేఽతి భూమిం వికసతి సుతరాం గోచరే ధూతికాయాః
ఆస్తాం దూరేణ తావత్సరభసదయితాలింగనానన్దలాభ
స్తద్గేహోపాంతరథ్యాభ్రమణమపి పరాం నిర్వృతిం సంతనోతి 100

ప్ర॥ మనసి-మనస్సున; చక్షుఃప్రీతిప్రసక్తే-చక్షుఃప్రీతి సంగములు కలదికాగా; పరిచయే-పరిచయము; చింత్యమానాభ్యుపాయే-చింతింపబడుచున్న సమాగమోపాయము కలదికాగా; అతిభూమిమ్-అతిశయమును; యాతే-పొందిన; రాగే-

రాగము; సుతరాం- మిక్కిలి; వికసతి- వికసించుచుండగా; దూతికాయాః- దూతిక యొక్క; గోచరే- దర్శనముకాగా; సరభసదయితాలింగనానందలాభః-వేగముతో కూడిన ప్రియురాలి యొక్క ఆనందమను లాభము; దూరేణ - దూరముగా; ఆస్తామ్ -ఉండుగాక; తద్గేహోపాంతరథ్యాభ్రమణమ్- ఆమె ఇంటి దగ్గరి త్రోవలో తిరుగుట యు; పరాం- గొప్ప; నిర్వృతిం- ఆనందమును; సంతనోతి- విస్తరింప చేయును.

తా॥ మొదట పురుషునకు (స్త్రీకి) స్త్రీ(పురుషుడు) కనబడినపుడు చక్షుః ప్రీతి కలుగును. ఆ పిమ్మట మనసులు కలియును. తరువాత పరిచయము కొఱకు ఉపాయము చింతింపబడును. ఆ తరువాత రాగమతిశయించును ఆ పిమ్మట ఇరువురి సమావేశమేర్పాటు చేయకల దూతిక(దూత) దర్శనము కలిగినచో ఇక వేగముగా ప్రియురాలిని కౌగలించు కొనుటలోని ఆనందము లభించుట అటుండనీ ఆమె నివసించు ఇంటికి దగ్గఱనున్న దారిలో తిరుగుటయు మిక్కిలి ఆనందమును కలిగించును. ఇటువంటి భాగ్యశాలి పుణ్యపురుషుడు నూటికోటికి ఒకడుండును గదా.

వి॥ ఈ దుఃఖమయ ప్రపంచమున ఆనందమేదైన నున్నచో నది యోగ్యులైన నాయికానాయకుల సమావేశమొక్కటియే. మరొకటి అంతకు మించిన ఆనందము లేదు. అది ఎంతో పుణ్యమొనర్చిన వారికి మాత్రమే లభించునట్టిది. లోకమునసెందఱు స్త్రీలు పురుషులు పరస్పరము చూచుకొనరు. చూచుకొన్నంత మాత్రమున పరస్పర ప్రీతికలుగునా? ఒకానొక పుణ్యవంతునికి పుణ్యవతికి మాత్రమే పరస్పర ప్రీతి కలుగును ఆపైన మనసులు కలియుట ఆ పైన పరియము ఆ పైన వారిరువురి ప్రణయమును ఫలింపజేయు సమావేశకర్త యో సమావేశకర్త్రియో లభింపవలెను. వారి ప్రణయము ఫలించుట నిశ్చితమైన పిదప ఆమె ఆలింగన మాయనకు లభింపకున్నను చొరవ తీసికొని నాయకుడావెు ఉండు నింటి దారిలో తిరుగాడు చుండును. ఆ తిరుగాడుటలోనే ఎంతో ఆనందముండును. మనసులు కలిసినచో మనువులు ముడి వడుటకు దారిలో లభింపక మానవు. ఆ తరువాతది స్వర్గమే కాదు. అది పరనిర్వృతి అనగా మోక్షమునందును అంత ఆనందముండదనుట ప్రణయోపాసకుల సిద్ధాంతము. ఈ యర్థ మొసగు వాక్యములీ శ్లోకమున నున్నవి. ప్రణయ స్రజము ధరించు నాయకప్రేమను స్రగ్ధరా వృత్తమున వర్ణించుట సముచితముగా నున్నది.

2. చక్షుః ప్రీతి మనస్సంగము సంకల్పము. ప్రజాగరము మొదలైన మదనావస్థలలో వేనదతి. దానిని బోధించు చక్షుః ప్రీతిపదముతో నీ శ్లోకమారంభింపబడినది. 'పరాంనిర్వృతింసంతనోతి' అను ముగింపు శతకసమాప్తి ద్యోతకము కావచ్చును.

అవ॥ పై శ్లోకమున ప్రియురాలున్న యింటి దగ్గఱి వీధిలో భ్రమించుట ఆనంద హేతువని చెప్పబడినది. ఈ శ్లోకమున నేకశయ్యాగత నాయికా నాయక వృత్తాంతము వర్ణింపబడుచున్నది.

శ్లో॥ కాంతే తల్పముపాగతే విగలితా నీవీ స్వయ మ్బన్ధనా
ద్వాసో విశ్లథమేఖలా గుణ ధృతం కించి న్నితమ్బే స్థితమ్।
ఏతావత్సఖి! వేద్మి సాౖమ్ప్రతమహం తస్యాంగ సంగే పునః
కోఽయంకాస్మి రతం ను వా కథమితి స్వల్పాఽపి మే న స్మృతిః॥

ప్ర॥ కాంతే-ప్రియుడు; తల్పమ్-శయ్యను; ఉపాగతే-సమీపించగా; నీవీ-కోకముడి; స్వయమ్-స్వయముగా; బన్ధనాత్-బంధనమునుండి; విగలితా-జారినది; విశ్లథమేఖలా గుణ ధృతమ్-వదులైన ఒడ్డాణ పుౖతాటిచే పట్టుకొనబడిన; వాసః-వస్త్రము; కించిత్-కొంచెము; నితమ్బే-పిఱుదునందు; స్థితమ్-ఉండినది; సఖి-ఓ చెలీ; ఏతావత్-ఇంతమాౖత్రము; సాౖమ్ప్రతమ్-ఇప్పుడు; వేద్మి-ఎఱుగుదును; తస్య-అతని యొక్క; అంగసంగే-అంగసంగమున; పునః-మరల; అయం-ఈతడు; కః-ఎవడు; కాఅస్మి-ఎవతెనై ఉన్నాను; రతమ్-సంభోగము; కథమ్‌ను-ఎట్టిదో; ఇతి-అని; స్వల్పాపి-కొంచెము కూడ; మే-నాకు; నస్మృతిః-జ్ఞాపకములేదు;

తా॥ ప్రియుడు శయ్యను సమీపించగానే స్వయముగా కోకముడి జారినది. కాని ఒడ్డాణపు ౖతాటి నంటుకొని కొంత వస్త్రము పిఱుదునందు ఉండెను. ఇప్పుడు ఇంత మాౖత్రమే నాకు జ్ఞాపక మున్నది. అతని శరీర స్పర్శ కలిగిన పిమ్మట ఆతడెవడో నేనెవర్తనో ఆ సంభోగమెటువంటిదో అను విషయములలో ఏ ఒకటియు కొంచెము గూడ నాకు జ్ఞాపకము లేదు.

వి॥ ప్రియుడు శయ్యను సమీపించినాడు. కాని శయ్యపైకి వచ్చి యింకను పడుకొనలేదు. అంతమాౖత్రమునకే నాకోక ముడిజారినది. ఒడ్డాణము నంటుకొని వస్త్రమింకను కొంచెము నాపిఱుదులపై నుండినదని మాౖత్రము జ్ఞాపకమున్నది. ఆ పైన ఆతడు నా శరీరమునందే యే భాగము స్పృశించినాడో అసలు నేనెవరో ఆతడెవరో ఆ సంభోగమెటువంటిదో కొంచెము కూడ జ్ఞాపకము లేదనుటచే విగలితవేద్యాంతర మైన ఆనందము కలిగినదని వ్యంజితమగుచున్నది. ఈ శ్లోకము కూడ ఆనంద వ్యంజకమై శతకమును మంగళాంతమొనర్చుచున్నది. వృత్తము శార్దూల విక్రీడితము.

అవ॥ పై శ్లోకమున సంభోగ శృంగార పరాకాష్ఠచెప్పబడినది. ఈ శ్లోకమున విరహియైన నాయకుడు విప్రలంభశృంగారము యొక్క పరాకాష్ఠను చేరుకొన్న స్థితిలో నాయిక తప్ప వేద్యాంతర మెఱుగని స్థితికి చేరుకొనుట వర్ణింపబడుచున్నది.

శ్లో॥ ప్రాసాదే సా దిశిదిశి చ సా పృష్ఠతః సా పురః సా
పర్యంకే సా పథిపథి చ సా తద్వియోగాతురస్య।
హంహో చేతః ప్రకృతిరపరా నాస్తి మే కాపి సా సా
సా సా సా సా జగతి సకలే కోఽయమద్వైతవాదః॥ 102

ప్రతి॥ ప్రాసాదే-మేడపైన; సా-ఆమె; దిశిదిశిచ-ప్రతిదిక్కునందును; సా-ఆమె; పృష్ఠతః-వెనుక; సా-ఆమె; పురః-ముందు; సా-ఆమె; పర్యంకే-శయ్య యందు; సా-ఆమె; పథిపథిచ-ప్రతిమార్గమునందును; సా-ఆమె; తద్వియోగాతురస్య-ఆమె వియోగముచే దుఃఖితుడనైన; మే-నాకు; అపరా-మరొక; చేతః ప్రకృతిః - చిత్తవృత్తి; నఅస్తి-లేదు; సకలే-సమస్తమైన; జగతి-జగమున; సా-ఆమె; సా-ఆమె; సా-ఆమె; సా-ఆమె; సా-ఆమె; సా-ఆమె; అయమ్-ఈ; అద్వైతవాదః-అద్వైత వాదము; కః-ఏమి; హంహో-ఆహా.

తా॥ ఆమె వియోగముచే ఆతురుడైన నాయకునకు మేడపైన ఆమె, ప్రతిదిక్కునందును ఆమె, ముందు ఆమె, వెనుక ఆమె, శయ్యపై ఆమె, ప్రతి దారి యందు ఆమె, అంతటు ఆమెయే తప్ప మరొకటి కనబడ లేదు. ఆహా! నా చిత్తమును ఆమె తప్ప మరొకటేమియు లేదు. ఈ ప్రపంచమంతటు ఆమె ఆమె ఆమె... ఆహా ఏమి ఈ అద్వైత వాదము.

వి॥ నాయకునకు ప్రపంచమంతటు తన లోపల బయటు ముందు వెనుక ప్రక్కన పైన క్రింద అంతటు నాయికయే కనబడుచున్నది. భక్తునికి భగవంతుడు లేక భగవతి తప్ప మరొకటి కనబడనట్లు, ఈ దర్శనము ఇటువంటి అనుభూతి అద్వైతవాదమున మాత్రమే సాధ్యము. తనలోకూడ భగవంతుని దర్శించుట ఇతర వాదములలో సాధ్యము కాదు. ఈ శ్లోకముననుు వేదాంతరము విరళితమైనట్లు చెప్పబడుటచే ఈ శ్లోకము కూడా శతక సమాప్తి ద్యోతకముగానే ఉన్నది. (అర్జున వర్మ దేవుడు రసిక సంజీవనీ టీక ఈ శ్లోకము వఱకే యున్నది. ఆతని దృష్టిలో ఇదియే సమాప్తి శ్లోకము.) వృత్తము మందాక్రాంత.

సర్వేజనా స్సుఖినో భవన్తు

శ్రీః

148

## శంకర గ్రంథ రత్నావళి

"శంకర భగవత్పాదుల భాష్యము లోకయెత్తు, ప్రకరణము లోకయెత్తు. భాష్యములు పారావారములు. ప్రకరణములు పల్వలములు. 'పాఠకులకు తెలిసెనా లేదా ?' యని విచారింపక వర్తించుచుఁ బోవు వాఙ్ముఖములు భాష్యములు. పాఠకుల యెట్టెదుటఁ గూర్చుండి కైకొన్న విషయమును నమగ్రముగా తెలియు చందమున నుపదేశించు ఒజ్జలు, నెచ్చెలులును ఈ ప్రకరణములు.

శ్రీ శంకరుల ప్రతిప్రకరణ గ్రంథమునందును అనుభూతితో పెనవేసికొనిన క్రొత్తదనమును గాంభీర్యముతోడి కామనీయకమును కానిపించును. ఎన్ని పర్యాయములు చదివినను తనివుతీఱని గొప్పఁదన మీ ప్రకరణ గ్రంథము లన్నిఁటను గలదు.

ఈ ప్రకరణములు మేలిమిముద్దలు, గడ్డు సత్యములఁ జిలికి చిలికి చేతఁబెట్టిన వెన్నముద్దలు. ఇవి 'మమ్ము అనుభవమునకుఁ దెచ్చికొనుము తెచ్చికొను'మను మేలుకొలుపులు."

శతావధాని
శ్రీ వేలూరి శివరామశాస్త్రి

